సపరివార పత్రిక స్వాతి



## ముఖచిత్రం

19-25 జూన్, 87 ఆంధ్ర సచిత్ర వారపత్రిక మా అభిమాన హీరోయిన్ కుమారి విజయశాంతి ముఖచిత్రము అత్యంత ఆకర్షణీయంగా వుంది.

- అరసవిల్లి యోగీశ్వరరావు, కాశీబుగ్గ

★ ★ ★

19-25 జూన్ 87 సంచికలో మా అభిమాన నటి విజయశాంతి ముఖచిత్రం అత్యంత ఆర్షణీయంగా వేసినందుకు మీకు మా ధన్యవాదములు

- కె. సత్యవతి, ఉంగుటూర్ (ప. గో)

★ ★ ★

19-25 జూన్ 87 సంచిక నటి విజయశాంతి ముఖచిత్రంతో చూడ ముచ్చటగా ఉన్నది.

- బి. సత్యవతి, హైదరాబాద్

## వేయిపడగలు

కవిసామ్రాట్ విశ్వనాథగారి 'వేయిపడగలు' నవలను ప్రచురిస్తూ మీరు సాహితీప్రియుల హృదయాలను అనంతానంద రస తరంగాలలో ముంచి వేస్తున్నందుకు కృతజ్ఞతలు.

దిగజారుతున్న సాహితీ విలువలు మరొక్కసారి గుర్తు చేస్తున్నట్టుంది. ప్రతి పాత్రా అమృత ధారల్లో సముద్భవించి ఆంధ్ర సాహితీ మాగాణాన్ని సస్యశ్యామలం చేస్తున్నదనుటలో సందేహం లేదు.

- పైడిమర్రి కృష్ణారెడ్డి, ఖమ్మం

★ ★ ★

"వేయిపడగలు" సీరియల్ చదవటం మా అదృష్టంగా భావిస్తున్నాము. అనాటి సీరియల్‌ను ఈ తరం పాఠకుల కోసం ప్రచురిస్తున్నందుకు హృదయపూర్వక కృతజ్ఞతాభినందనలు.

- వి. నాగేశ్వరరావు, సత్తుపల్లి

## సీరియల్స్

భవానీ కృష్ణమూర్తిగారి "ప్రత్యూష పవనాలు" సీరియల్ మళ్లీ మళ్లీ చదివింపచేస్తున్నది. మంచి సీరియల్ ప్రచురిస్తున్నందుకు మీకు అభివందనలు.

- కె. ఎన్. వి. రవికుమార్, మైలవరం

★ ★ ★

"ప్రత్యూష పవనాలు" సీరియల్ అనేక మలుపులతో ఉన్నత శిఖరాలందుకుంటోంది.




డాక్టర్ రవీంద్ర బాబుగారి "ప్రేమసాగర మథనం" మిగతా భాగం కోసం ఉవ్విళ్లూరింపజేస్తూంది.

- రంగా, సావిత్రి, నందిగామ

★ ★ ★

"ప్రత్యూషపవనాలు", "ప్రేమసాగర మథనం" మా ఇంటిల్లిపాదినీ ఆకర్షిస్తున్నవి. రచయిత్రి, రచయితలకు అభినందనలు. 'తీపి గురుతు' ఒకమాదిరిగా వున్నది.

- సి. ఎస్. రామకృష్ణగుప్తా, పాతికొండ

★ ★ ★

"ప్రేమసాగర మథనం" సీరియల్ బాగుంది. మంచి సీరియల్ అందిస్తున్నారు.

- టి. పెరుమాళ్, ఖర్గపూర్

## వ్యాసాలు

విజయశాంతి ముఖచిత్రంతో వెలువడిన 19-25 సంచిక ముగ్ధ మనోహరంగా ఉంది. ప్లాస్టిక్ సర్జరీ గూర్చి డాక్టర్ టి. ఎస్. కృష్ణమూర్తిగారి వ్యాసంలో తెలియని విషయాలెన్నో తెలుసుకున్నాం.

- శ్రీపాద శాంతి శ్రీనివాస్, బొబ్బిలి

★ ★ ★

డా. టి. ఎస్. కృష్ణమూర్తిగారు "ప్లాస్టిక్ సర్జరీ" గూర్చి బాగా వివరించారు.

- ఎస్. మహమ్మద్ రఫీ, కాశీబుగ్గ

★ ★ ★

ధర్మపథం 'త్యాగ ప్రశస్తి' చక్కగా వుంది. ప్లాస్టిక్ సర్జరీ గురించి కృష్ణమూర్తి డాక్టరుగారు బాగా విశదీకరించారు.

- చో డవరపు నాగేశ్వరరావు, రమాదేవి, హైదరాబాదు

( 74 వ పేజీ చూడండి)


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

17-23 జూలై, '87
శ్రీ ప్రభవ నామ సం. ఆషాఢ బ. సప్తమి
సంపుటము 79 : సంచిక 46

ముఖ్య సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

కార్యనిర్వాహక(వర్కింగ్) సంపాదకుడు :
మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2.75 |
| పోస్టులో 6నెలల చందా | రు. 80.60 |
| పోస్టులో 12నెలల చందా | రు. 161.20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి రాధ
(ఫొటో : ఈశ్వరి)

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# చిన్న మనిషి చేసిన చిన్న అద్భుతం!

మాథియాస్ రుస్ట్‌కు అభినందనలు! ఇంకెవరికి? గత డెబ్బై సంవత్సరాలుగా శాశ్వత నిద్రలో ఉన్న మహానుభావుడు లెనిన్ సమీపంలో, క్రెమ్లిన్ చౌకు మధ్యలో తన చిన్న విమానాన్ని దించిన ఆ పందొమ్మిది సంవత్సరాల జర్మన్ యువకుడు మాథియాస్‌రుస్ట్‌కు అభినందనలు! ప్రపంచంలోకెల్లా అతి ఎక్కువ రక్షణలో ఉండే గగనతలంలో హెల్సింకీ నుంచి 400 మైళ్ల దూరం ఎవరి చేతికి చిక్కకుండా వచ్చాడు రుస్ట్. నిజానికి, తన విమానాన్ని కిందికి దించబోయే ముందు అతను క్రెమ్లిన్ భవనంలోని గోర్బచేవ్ కార్యాలయం మీది నుంచి ఎగిరి వెళ్లాడు. తలుచుకుంటే అతను గోర్బచేవ్‌కార్యాలయం మీద బాంబులు వేసి గోర్బచేవ్‌ను పొలిట్ బ్యూరో నుంచి తప్పించి ఉండేవాడే. కాని మాథియాస్ విమానంలో ఆయుధాలేమీ లేవు. వాస్తవానికి ఆ విమానంలో పెట్రోలు కూడా ఎక్కువగా లేదు. ఇంకొక అరగంట గడిస్తే, ఇంధనం అయిపోయి ఈ విమానం మాస్కోనగర శివార్లలోని పొలాల్లో దిగిపోవలసి వచ్చేది.

అణుక్షిపణులతో, ఇతర భయంకర ఆయుధాలతో కిక్కిరిసి ఉన్న దేశం నడిబొడ్డులో ఇటువంటి సంఘటన జరగడం ఒక చిన్న అద్భుతం. అందుకు మనందరం కృతజ్ఞులమై ఉండాలి. ఇటువంటి సంఘటనే 1974లో జరిగింది. ఒక అమెరికన్ సైనికుడు తన విభాగం నుంచి హెలికాప్టర్‌ను దొంగిలించి, దాన్ని సురక్షితంగా అక్కడా, ఇక్కడా కాదు, సరాసరిగా వైట్‌హవుస్ దక్షిణం వైపున పచ్చిక బయలులో దించాడు. రుస్ట్ లాగనే ఆయన కూడా ఎవరి కంటా పడకుండానే వందలాది మైళ్ళు ప్రయాణం చేశాడు. చివరికి వైట్‌హవుస్‌లో దిగిన తర్వాత కూడా, ఆయన సహాయం కోసం అడగవలసి వచ్చింది. ఎందుకంటే వైట్‌హవుస్ కాపలాదారులు దాన్ని మామూలు కాపలా విమానం కావచ్చు ననుకున్నారట. రుస్ట్ తన విమానాన్ని అద్దెకు తీసుకున్నాడు. అది ఒక చిన్న, ఒకటే ఇంజన్ ఉండే విమానం. లైసెన్స్ సంపాదించడానికి అవసరమైనన్ని మైళ్ళు ప్రయాణం చేయాలని అతను తొందరపడుతున్నాడు. అన్ని స్థలాలూ వదిలిపెట్టి మాస్కోకే ఎందుకొచ్చాడో అతను మాత్రమే చెప్పగలడు. అతనిని చెప్పనిస్తారనే అనుకుంటాను

ఆ సమయానికి గోర్బచేవ్ తూర్పు జర్మనీలో ఉన్నారు. ఆయన, ఆయన రక్షణ మంత్రి సెర్గీ సొకొలొవ్ అక్కడ వార్సా కూటమి శిఖరాగ్ర సమావేశంలో పాల్గొన్నారు రుస్ట్ చరిత్రాత్మక ఆగమనం తర్వాత కొన్ని గంటలలోనే వాళ్ళు మాస్కోకు తిరిగి వచ్చారు. వెనువెంటనే సొకొలొవ్ పదవి ఊడిపోయింది. తోవలో ఎక్కడా కాల్పులకు గురికాకుండా క్రెమ్లిన్ దాకా రావడానికి ఒక జర్మన్ యువకుణ్ని అనుమతించిన రక్షణశాఖ మంత్రి ఏమంత మంచి రక్షణ మంత్రి కాదు. ఇంకా చాలా తలలు దొర్లాయి గాని, వాటిలో రుస్ట్ తల ఉండదనే నేను ఆశిస్తున్నాను

వాస్తవానికి రుస్ట్‌కి బహుమతి ఇవ్వవలసి ఉంటుంది. ఒక వేళ రష్యన్ విమాన చోదకుడెవరైనా వాషింగ్టన్ వరకూ విమానాన్ని నడుపుకుని వెళ్ళి, వైట్‌హవుస్‌లోని గులాబీ తోట ముందర దింప గలిగినట్టయితే ఆయనకు కూడా బహుమతి ఇవ్వవలసిందే. పెద్దవాళ్ళు, బలవంతులయినటు వంటి వాళ్ళు వేసే బ్రహ్మాండమయిన ప్రణాళికల బండారం బైటపెట్టి, అవి ఎంత హాస్యాస్పదమైనవో చూపగల ఇటువంటి చిన్న మనుషులే మనకు ఆనందాన్ని కలిగిస్తుంటారు. ప్రపంచపు భవితవ్య మంతా తమ చేతుల్లో ఉన్నదని గోర్బచేవ్, రీగన్‌లు నమ్ముతుంటారు. ఏ పక్షానికి ఎన్ని క్షిపణులుండాలని, ఎన్ని అణు కేంద్రాలుండాలని, సాయుధమైనవిగాని, నిరాయుధమైనవి గాని ఎన్ని సైనిక బలగాలుండాలని తేల్చుకోవడానికి వీళ్ళు ఎడతెగకుండా చర్చలు జరుపుతుంటారు. రుస్ట్ లాంటి చిన్న మనుషులు తాము సమర్థవంతంగా వేసిన ప్రణాళికలను ఎట్లా భగ్నం చేయగలరో గుర్తించజాలరు.

ఇటువంటి చిన్న మనుషులకు ప్రపంచం ఎంత రుణపడి ఉన్నదో మనలో చాలామంది గుర్తించరు. నిజానికి, ప్రపంచంలో వచ్చిన పెద్ద మార్పులలో చాలా వాటికి ఇటువంటి చిన్న మనుషులే కారణం. ఉదాహరణకు కారల్ మార్క్స్‌ను తీసుకోండి. చల్లని లండన్‌లో సౌకర్యంగా ఉండే బ్రిటిష్ మ్యూజియంలో ఆయన జీవిత కాలమంతా గడిపి తన దాస్ కాపిటల్ వ్రాశాడు. వంద సంవత్సరాల పైన కొద్ది సంవత్సరాలు గడిచేసరికి ఏసుక్రీస్తుని అనుసరించే వాళ్ళు ఎంతమంది ఉన్నారో, మార్క్స్‌ను అనుసరించేవాళ్ళూ అంతమంది తయారయ్యారు. ఇదంతా ఆ పుస్తకం వల్లనే. తూకం ప్రకారం చూస్తే ఆ పుస్తకం బైబిల్‌కన్నా కొంచెం తక్కువ బరువుంటుందేమో. మార్క్స్ తన మహా గ్రంథం రాస్తున్నప్పుడు యూరప్‌లోనూ, ఇతర చోట్లా పెద్ద పెద్ద సైన్యాలతో, పెద్ద పెద్ద కలలతో అనేకమంది చక్రవర్తు లుండేవారు. ఇప్పుడు అతి కొద్దిమంది రాజులు మాత్రం మిగిలారు. వాళ్లలో ఎవరూ చక్రవర్తి కూడా కారు. యూరప్‌లో మార్క్స్ కూడా అంత ఎక్కువగా లేడనుకోండి. ఆ ఖండంలో, కనీసం పశ్చిమార్ధ భాగంలో ఒక్క కమ్యూనిస్టు పార్టీ కూడా

అధికారంలో లేదు. కాని ఒకప్పుడు మార్క్స్ ప్రభావం బాగా చెల్లుతుండేది. మార్క్స్ లేనట్లయితే గోర్బచేవ్ ఉండేవాడు కాదు. సొకొలోవ్ ఉండేవాడు కాదు - బహుశా మాథియాస్ రుస్ట్ కూడా ఉండేవాడు కాదు.

ఇంకో చిన్న మనిషి గురించి ఆలోచిద్దాం - ఆయన అల్బర్ట్ ఐన్‌స్టీన్. ఆయన సాపేక్షికత మీద తన మొదటి పత్రం వ్రాసేటప్పటికి స్విట్జర్లాండ్‌లో ఒక పేటెంట్స్ కార్యాలయంలో గుమాస్తాగా పని చేసేవాడు. అప్పటికి స్విట్జర్లాండ్‌లో అంకెల ఖాతాలు రాలేదనుకోండి. ఓ రోజు సాయంత్రం ఆయన తన పత్రం పూర్తి చేసి, మామూలుగా కాఫీ తాగే కొట్టుకి వెళ్లాడు. ఏదన్నా ఆసక్తికరమయినటువంటి పని చేశావా అని అడిగిన ఓ మిత్రునికి జవాబుగా తల అడ్డంగా ఊపి, ఏమీ చెయ్యలేదన్నాడు. ఈ శతాబ్దంలోకెల్లా అతి విప్లవాత్మకమైన పత్రమని నిస్సందేహంగా చెప్పగలిగినటువంటి పత్రం పూర్తి చేసిన తర్వాత ఆయన చెప్పినదది. ఆ పత్రం రెండు మూడు దశాబ్దాల వ్యవధిలో ప్రపంచ చిత్రపటాన్ని గుర్తించటానికి వీలు లేనంతగా మార్చివేసింది. హిట్లర్, అతని గూండాలు ఐన్‌స్టీన్‌ను జర్మనీలోంచి తరిమేశారని, ఆయన అమెరికాలో ఆశ్రయం పొందాడని మనందరికీ తెలుసు. ఆ దేశానికి ఆయన చేరిన కొద్ది సంవత్సరాలకు, అణుబాంబు విషయమై శ్రద్ధ వహించవలసిందిగా కోరుతూ ఆయన అధ్యక్షుడు




న్యూఢిల్లీ లేఖ

రూజ్‌వెల్ట్‌కు ఉత్తరం వ్రాయవలసి వచ్చింది. ఐతే దాని నమూనాలో గాని, తయారీలో గాని ఆయన స్వయంగా పాల్గొనలేదు. ఎందుకంటే ఆ పని - చిన్న కార్యాలయాలున్న చిన్న మనుషులు చేసేది కాదు. కోట్లాది డాలర్ల పెద్ద బడ్జెటుతో, పెద్ద మనుషులు చేసేపని. నిజానికి ఐన్‌స్టీన్‌కు స్వంతంగా కార్యాలయం కూడా ఉండేదికాదు. ఆయన పడకగదిగానూ, సిట్టింగ్ రూమ్‌గానూ ఉపయోగించే గదిలోనే పనిచేసేవాడు నోబెల్ బహుమతి పొందే సమయానికి ఆయన రెండు కాళ్లకు రెండు రంగుల మేజోళ్ళున్నాయి!

తప్పనిసరిగా పెద్ద, శక్తివంతులయిన వాళ్ల మీద చిన్న మనుషులే ఎందువల్ల గెలుస్తారు? మొట్ట మొదట, చిన్న మనుషులు ప్రధానంగా భావాల మనుషులు, భావాలు ఎల్లప్పుడూ విస్ఫోటనానికి సిద్ధంగా ఉంటాయి. మనుషులందరూ సమానమని, సమానంగా ఉండాలని అన్న - మార్క్స్, వాళ్లెందుకు అలా లేరో చూపించడానికి పూనుకున్నాడు. పదార్థానికీ, శక్తికీ మధ్య ఎక్కువ భేదం లేదన్న ఐన్‌స్టీన్, ఒక ప్రత్యేక పరిస్థితులలో పదార్థాన్ని శక్తిగానూ, శక్తిని పదార్థంగానూ మార్చవచ్చునని చూపాడు. ఇది అర్థం చేసుకోవడానికి ఒక శిశువు కూడా కష్టపడనవసరం లేదు. దీనికోసం రుజువులేమీ అవసరంలేదు. మాథియాస్ రుస్ట్ సెస్నా అనే విమానాన్ని, యూరప్‌లో అద్దెకిచ్చే అతి చిన్న విమానాన్ని తీసుకుని, గోర్బచేవ్ సామ్రాజ్యం నడిబొడ్డు మీదికి ప్రయాణం -
ఆయనే గనుక పెద్ద విమానం తీసుకుని ఉం
రష్యన్లే నాలుగేళ్ల క్రితం కొరియన్ విమానాన్ని కూల్చివేసినట్టుగా ఆ పెద్ద విమానాన్ని కూడా క్రూరంగా కూల్చి ఉండేవారు. రుస్ట్ ఇప్పుడు ఇబ్బందుల్లో పడి వుండవచ్చు. క్రెమ్లిన్ వాసన పీల్చేటంత దగ్గరికి వెళ్లి ఇబ్బందుల్లో పడకుండా ఉండడం ఎవరికీ సాధ్యం కాదనుకోండి. కాని ఆయన తాను చెప్పదలచుకొన్న విషయం చెప్పేశాడు. □

నువ్ బాణాలతో నిచ్చెన
కట్టలేవు అభిమన్యు బావా!!
మా నాన్న యీ సౌధాన్ని
నాగార్జున సిమెంటుతో
నిర్మించాడు!!!

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1987 దీపావళి కథల పోటీ

## మొత్తం బహుమతులు రు. 7,200/-

ఎప్పటిలాగే ఈ ఏడాది కూడా దీపావళి కథల పోటీని నిర్వహిస్తున్నాము. గతంలో లాగే ఇప్పుడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని అకారాదిక్రమంలో ఆంధ్రసచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో ప్రచురిస్తాము. ఆటు తరువాత పాఠకుల బాలట్ నిర్వహిస్తాము.

**ముగింపు తేదీ : 22 ఆగస్టు,1987**

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్కదానికి రు 700/- చొప్పున బహుమతి లభిస్తుంది ఆ తరువాత పాఠకుల బాలట్‌లో మొదటి, రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు 750/-, రు 650/-, రు 550/- వంతున అదనపు బహుమతులుగా అందజేస్తాము. మిగిలిన మూడు కథలకీ ఒక్కొక్కదానికీ అదనంగా రు 350/- చొప్పున ప్రత్యేక బహుమతిగా ఇస్తాము.

## నిబంధనలు

1 కథా వస్తువు తెలుగు వారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి

2 కథ వ్రాత ప్రతి పన్నెండు అర తావు (ఎక్సర్‌సైజు పుస్తకం పేజీకి రెట్టింపు) పేజీలకి మించి ఉండకూడదు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి వ్రాతప్రతిపై "1987 దీపావళి కథల పోటీకి అని మొదటి పేజీపై భాగంలో స్పష్టంగా రాయాలి

3 అనువాదాలు, అనుసరణలు కాపీ కథలు పంపరాదు గతంలో ప్రచురింపబడిన, రేడియోలో ప్రసారం అయిన, ఇతర పత్రికలకి పరిశీలనకి పంపిన వాటిని పోటీకి పంపరాదు ఈమేరకి రచయిత(త్రు)లు హామీ పత్రం రాసి సంతకం చేసి వ్రాత ప్రతితో పాటు పంపాలి హామీ పత్రం లేని రచనలు పరిశీలింపబడవు ఆంధ్రపత్రిక సంస్థలో ని ఉద్యోగులు, వారి బంధువులు ఈ పోటీలో పాల్గొనరాదు

4 రచయితలు, రచయిత్రులు కలం పేరుతో రాసినా తమ అసలు పేరు, పూర్తి చిరునామా వ్రాత ప్రతి మీద స్పష్టంగా రాయాల్సి ఉంటుంది.

5 సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలనీ ఆయా రచయిత(త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము. తరువాత బాలట్ ఫలితాలతో పాటు వారి పరిచయాలని ఫొటోలతో సహా ప్రచురిస్తాము.

6 పోటీలో బహుమతి పొందిన కథా రచయిత(త్రు)లు తమ ఫొటో, జీవిత విశేషాల ప్రచురణకి అంగీకరించవలసి ఉంటుంది.

7 రచనలపై వచ్చే ఎలాంటి పేచీలకైనా ఆయా రచయిత(త్రు)లే బాధ్యత వహించవలసి ఉంటుంది

8 పోటీకి పంపే కథలు 22 ఆగస్టు 19878 గానీ, ఆలోగా కానీ మా కార్యాలయానికి చేరేలా పంపాలి ఆ తరువాత అందిన వాటిని పోటీకి పరిశీలించటం జరగదు

9 పోటీకి పంపిన కథలని ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పి పంపటం జరగదు కాబట్టి రచయిత(త్రు)లు వాటితో పాటు తపాలా బిళ్లలు అతికించిన, స్వంత చిరునామా కల కవర్లు జత పరచి పంపనవసరం లేదు

10 పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి వీలు వెంబడి వాటిని ప్రచురించటం జరుగుతుంది ఆ విషయాన్ని ఆయా రచయిత(త్రు)లకి తెలియ జేస్తాము ప్రచురణకి స్వీకరించని కథల విషయంలో ఆయా రచయిత(త్రు)లకి తెలియ చెయ్యటం సాధ్యం కాదు, వాటి విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదు.

11. పోటీకి పంపే కథలని సంపాదకుడు ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపాలి వ్యక్తుల పేర పంపరాదు కవరు పై భాగంలో "1987 దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి

రచయిత(త్రు)లు అందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము.

—సంపాదకుడు

# నిత్య నూతన సీరియల్

## కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

# వేయిపడగలు



(గతసంచిక తరువాయి)

చీకటులు సన్నగా ప్రవేశించెను. దూరపు మనుష్యు లెవరును కన్పించుట లేదు. సుబ్బన్నపేట పరుగుదూర మున్నది. దారి డొంక. భార్యా భర్త లిద్దరును కౌగిలించుకొనియే నడచుచుండిరి. అరుంధతి అడుగులు నేలమీద ఆనుటలేదు. ధర్మారా వామెను సగము మోయుచునే ఉండెను. ఇద్దరిలో ఎవరును మాటాడుటలేదు. అరుంధతి కేమియు బహిర్విషయ పరిజ్ఞానము లేదు. మధ్య మధ్య పతి తన అధరము నధరముతో తాకుట మాత్రము తెలియుచున్నది. దారి కిరుప్రక్కల కీచురాళ్ళు కూయుచున్నవి. ఒకరిద్దరు బాటసారు లెవరో దూరపుటూళ్ళవారు వారిని పరకాయించి చూచిపోవుచు వచ్చిరి. చీకటి తమాల తరు కిసాలయములు ఊరి దిక్కులకు పట్టు వేసినట్లు చిక్కనై విజృంభించెను. తాను చేసినపని ముందు వెనుకలు ధర్మారావు విచారించలేదు. అతనికి రెండే కనపడుచున్నవి. ఒకటి ప్రక్కనున్న ప్రియురాలు, ...డు దారి. ఊరకేనడచు చుండెను. అరుంధతి వక్షస్థలము తన పార్శ్వమున అనుకొనెను. ఆమె నిశ్వాసములు తన చెక్కిలిపైని, మెడమీదను భుజముమీదను పడుచుండెను. ఆమె చేతులు తన మెడచుట్టు బిగింపబడి ఉండెను. తనచేతులామె శరీర మెల్ల యెడల ఉండెను. నడచుచున్నను దారి దీర్ఘమయ్యెను. ఒక పాము దారి కడ్డముగా పోయెను. అతడాగి దానిని పోనిచ్చి మరల నడచెను. అరుంధతికాసంగతియే తెలియదు. ధర్మారావున కొడలు తెలియుట లేదు. అది ఏమిస్థితిలో ఉండెనో అతని కేమియు తెలియలేదు. అది సంభమా? కాదే! నడచుచుండెను. దారియన్న జ్ఞానముండెను. రోమాంచమా? అదియుకాదు. అప్పుడతడున్న స్థితికి అలంకార శాస్త్రములలో పేరులేదు. ఇంక అరుంధతి మగనిచంకనే ఉండెను. అతడు నడచుచుండెను. సుబ్బన్న పేట దగ్గఱకు వచ్చెను. సహజముగా జంతువులకు తమ నెలవులందుగల జ్ఞానముతో కనులు మూసికొనిపోయినట్లు ధర్మారావు పోవుచుండెను. ఊరిబయట ఎవరో కనపడిరి. వారతనిని పలుకరించలేదు. అతడిల్లు సమీపించెను. వారిద్దరకు ఒడళ్ళు తెలియుటలేదు. అతడు లోనికిపోయెను. సావిత్రమ్మగారు కొడుకు కోడండ్ర నిద్దరనాస్థితిలో చూచి నిలువున కొయ్యబొమ్మ అయ్యెను. తెరచిన నోరు తెరచినట్లే ఉంచి "హా!" అనెను. ధర్మారావు చావడి దాటి పడమటింటిలోనికి పోబోవుచుండెను. అతని తలకు ద్వారబంధము తగిలెను. దెబ్బతగిలి ఒడలు తెలిసెను. ఎదురుగా తల్లి నిలుచుండెను. అరుంధతి కన్నులు మూసికొని తనబుజాలమీద ఉండెను. ధర్మారావు "అమ్మా! కొంచెము నీరు తెమ్ము." అని తొందరపడెను. చల్లని నీరు అరుంధతి మొగమున చిలుకగా ఆమెకు స్మృతి వచ్చి మగనిని వదలి అత్తగారిని చూచి కొంత తెల్లబోయెను. కొంత సిగ్గుపడెను. మఱల మగనినే హత్తుకొనెను. తల్లి గాబరాపడి "ఏమి నాయనా!" అనెను. ధర్మారావు, "ఏమియులేదు. నీవు వంట చేయుము" అనెను. ఆమె "వంటయైనది. నీకోస మెదురు చూచుచున్నాను. పిల్ల సొమ్మసిల్లి నట్లున్నది కొంచెము మరుగుచారు తీసెదను" అని

లోనికి పోయెను. ధర్మారావరుంధతిని గదిలోనికి కొనిపోయెను. అచ్చట ఎనిమిది నెలల క్రింద తన కార్యమునా డెట్లున్నదో అట్లే ఉన్నది. తన తల్లి గది అంతయు ఊడ్చి దులిపి బాగుచేసెను కాబోలు. అరుంధతిని పక్కమీద పరుండబెట్టి తాను ప్రక్కను కూర్చుండి, ఆమె ఎదురు రొమ్ము మీద అనుకొని "ఏమి అట్లుంటివి? మాటాడవా? ఇంటికి వచ్చినాము. నీకు ఒడలు తెలిసినదా?" అని చెవిలో ఊదెను. ఆమె కొంత సేపటికి "తెలిసినది" అనెను. అతడు పన్నీరు బుడ్డి చూడగా అందులో ఇంకను పన్నీరున్నది. అది ఆమె మొగమున చిలుకరించెను.

ఆమె వణికి లేచి కూర్చుండెను. కన్నీలు తుడుచుకొని పతిమెడ మఱల పట్టుకొని ఏడ్వనారంభించెను. ధర్మారావు మరల ఓదార్చెను. "నేనిదిగో! నీ వద్దనే ఉన్నానుగదా, భయ



మెందులకు? ఇంటికి వచ్చినాము. అమ్మ చారు పెట్టుచున్నది. దారి ప్రయాణమునకు బడలిపోతివి. అందుకనియే చాలదూరము నేనే ఎత్తుకొని నడచితిని. ఎందు కేడ్చెదవు నేనిన్నాళ్ళు నిన్ను చూడరాలేదనియా? తప్పు చేసితిని. అరుంధతీ! నీవిటువంటి దానవని తెలియలేదు. లోక సామాన్యముగా నిన్ను గురించి ఊహించితిని క్షమించుము" అని, మంటిచే బురద అయిన ఆమె పాదములు చేతులలో పూని శిరమున ఉంచుకొనెను. ఆమె కాళులు లాగుకొని అతని మెడ మీద పడి వెక్కి వెక్కి మరల ఏడ్వనారంభించెను. అతనికి కారణమే తెలియలేదు. అతడు మరల మరల ఆమెచుబుకము, చెక్కిలి, నేత్రములు, ఫాలము, భుజములు, వక్షస్సు, నడుము, చేతులు ముద్దు పెట్టుకొనుటయే. ఆమె నోదార్చుట ఎట్లో తెలియక ఊరకే ఉద్వేగము పొందుచుండెను.

# వేయిపడగలు

**అధ్వరు అంటగట్టబడి గాలికి అటునిటు ఊగిపోవు రెండు తీగలవలె కదలిపోయిరి.**

**కొంతసేపటికి ధర్మారావు ఎదలో తాను దూరముగా వుండుటొక్కటియే యింత దుఃఖమునకు హేతువు కానేరదు. వేరే ఏదియో హేతువుండవలెనని తోచినది– "అది ఒక్కసారిగా తెలియరాదు. క్రమముగా తెలియవలె" అనుకొని – "నాయనా! ఎందుకోయి అంత దుఃఖించెదవు? ఏదో** కారణమున్నదని నాకు తెలియును. గుండె చిక్కబట్టుకొనుము. నేను బ్రతికి ఉన్నంతవరకు నీమీద ఈగవాలనీయను. చీ! వారేమి చేయగలరు!" అని పునః పునః కృతగాఢాలింగనముల చేత ఆమె దేహమును నలిపివేసెను. బిగిసియున్న ఆమెనరము లాసంవాహనము చేత సడలి, ఆమెకు గుండెలోని భయము తగ్గి, బాధకు "అబ్బా!" అని కౌగిలి వారించి దూరముగా కూర్చుండెను. ఇంతలో తల్లి భోజనమునకు లెమ్మనెను. ధర్మారావు భార్యను దొడ్డిలోనికి తీసికొని పోయెను. ఇద్దరును వేడినీళ్ళు స్నానము జేసిరి. ఇద్దరు ఒక్కసారియే భోజనము చేసిరి. మరల ఇద్దరును గదిలోనికి పోయి పన్నుండిరి. ధర్మారావు భార్యను మరల ప్రశ్నించెను. ఆమె చెప్పుటకు గొంకుచున్నట్లు తోచెను. అతడు

"భయము లేదులే! నేను వారినేమియు అనను. నిన్నేమియు కోపించను. చెప్పుము" అని వేవిధముల ఓదార్చిన తరువాత ఆమె యిట్లు చెప్పెను. ఆ నాడు నే నిచ్చట నుండి వెళ్ళినంతనే "మీరేమి పెట్టిరి, ఏమి చేసిరని అడిగిరి. నేను రాణిగా రిచ్చిన చంద్రహారము మీరు చేయించితిరని చూపినాను. వారు నమ్మలేదు. రంగాజమ్మగారి చీర చూపించినాను. వారు మిమ్మూరక వెక్కిరించ మొదలుపెట్టిరి.

ధర్మా :" వా రనగా ఎవరు? మీ నాయనయు, అమ్మయునా?

అరుం : కాదు, మా పినతల్లి, మేనమామ కుమారుడు, మా అమ్మ, వీరు మువ్వురును. మీకు తిన తిండి లేదట! మీరు నిష్ప్రయోజకులట. వెలివారట. నానాదుష్ట వాక్యములనిరి. నాకు కోపము వచ్చి, నేను వారిని మరల తిట్టితిని. దానితో వారు "అబ్బో! నాలుగురోజులు సంసారము చేసినందులకే మమ్ము బ్రతకనిచ్చుచున్నావు కాదు. కాపురమునకు వెళ్ళిన తరువాత వారి మీద ఈగ వ్రాలనీయవు కాబోలు" అనియు "అప్పుడే మే మంత చేదయితిమటే? చిల్లిగవ్వ పెట్టని మగని మీదనే యింత ప్రేమ అయినచో చిన్నప్పటి నుండి పెంచి పెద్ద చేసిన మా మీద ఎంత ఉండవలయును" అనియు చెప్పనారంభించిరి. నేను "చిల్లిగవ్వ పెట్టకపోవుటయేమి? పెండ్లి నాడు మా మామగారు నా నగల క్రింద "వేయి రూపాయలిచ్చిరట కదా! ఆ మాట మీరు నాతో ఇక్కసారియైన చెప్పక అపహరింప చూచుచున్నారా?" అంటిని. మా అమ్మ "వేయి రూపాయలే ఆ మొగాలకు తోడు వేయి రూపాయలే!! ఎక్కడి నుండి తెచ్చియిచ్చినారో? "మ్రింగ మెతుకులేదు, మీసాలకు సంపెంగ నూనె" అట! నీకేదో మందు పెట్టినారో! లేకపోయిన నాల్గు రోజులలో ఇంత వారి పక్ష మవలంబింతువా?" అని నన్నును, మిమ్మును రాల్చి పోసెను. తరువాత ఇంటిలో వారు ముప్వురును కలసి ఏదో గుసగుస లాడుకొనుచుండుటయు నేను పోయినంతనే మానివేయుటయు ఇట్లు జరుగుచువచ్చెను. నన్ను నా నాబాధలు పెట్టుచుండిరి. ఒకనాడు మా నాన్నను నగల మాట అడిగితిని. ఆయన ఏమియు మాటాడలేదు. నాకు కోపము వచ్చి "ఏమయ్యా! నా సొమ్ము తినదలచుకొన్నా వాయేమి? ఇన్నాళ్ళుగా నాకు నా డబ్బున్న దనియైన తెలియనిచ్చితివికాదు" అని నిందించితిని. ఆయన కోపపడి "నేనెరుగనుపో! మీ అమ్మ నడుగు" అనెను. నాకేమి చేయుటకును తోచినది కాదు. నా కేడుపు వచ్చినది. నన్నోదార్చినవా రెవరును కనిపించలేదు. చివరకు నేనే ఏడుపుమాని అన్నమునకు పోయితిని. అన్నము సరిగా పెట్టలేదు. నేయి విదల్చుట – చేసికొన్న కూరలు వేయకుండుట – యిట్లు మొదలు పెట్టిరి. మీకు కబురంపవలె ననుకొంటిని. ఎవరి ద్వారా చేయుదును? ఒకనాడు స్నానము చేయుచు చంద్రహారము తీసి గదిలో ఉంచితిని. స్నానము చేసి వచ్చునప్పటికి హారము కనిపించలేదు. ఎవరిని అడిగినను "మాకు తెలియదన్నచో మాకు తెలియ"దన్నారు. రాత్రికి మా తండ్రి రాగా ఆయనతో చెప్పితిని. ఆయన "ఎవరు తీసి"రని అడిగెను. అందరు "మాకు తెలియదన్న మాకు తెలియ"దనిరి. ఆయన ఏమో వస్తువే పోనట్లూరకుండెను. ఆ వెనుక మా చెల్లి జడకుప్పెలెవరో ఎత్తుకొని పోయిరి. అవి నాల్గు రూపాయల ఖరీదు చేయవు. దానికై యిల్లంతయు నాలగోలు బాలగోలు అయినది. వేయి రూపాయల నా సొమ్ము పోయినచో ఎవరికిని పోయినట్లే లేదే అని నాకు విచారము వేసెను. క్రమముగా నా యింట నేను నిరాధారను అయినట్లు తోచినది. ఒక రోజున మా మేనమామ కుమారుడు..."

అరుంధతి పెదవి కొరుకుకొని చెప్పుట మానెను. ధర్మారావు "చెప్పుము, చెప్పుము, నేనేదో అటువంటిది కూడ జరిగెనని అనుమాన పడుచున్నానులే దాచుట ఎందుకు?" అని ఉద్ఘాటన చేసెను.

అరుం : నాతో మోటసరాగ మాడెను. నాకును వానికిని పడుట లేదు. అందులో "గోరు చుట్టుపై రోకటి పోటన్న"ట్లిది వచ్చెను.

ధర్మా :"ఏమి చేసినాడో చెప్పుము!" అని బలవంత పెట్టెను. ఆమె ఏమో చెప్పుటయు ధర్మారావు ఉగ్రుడగుటయు సంభవించెను.

అరుం : అతనిని గరిట కాడ పెట్టి పొడిచితిని. అది డొక్కలో గ్రుచ్చుకొని గాయమయ్యెను. ఆ నాడు నన్నిల్లంతయు రాల్చి పోసిరి. తల్లియే విరోధము కాగా ఇంక నేచెప్పునది ఏమి? నా పని ఆ యింట నీచమైపోయినది. నే నిచ్చటికి రా నెన్నిసార్లు ఊహించినను తీసికొని వచ్చువారు లేకపోయిరి. పైగా మీ రీ ఊరిలో లేరాయెను. నాకొకటి తోచినది – పెట్టెలన్నియు వెదికి చంద్రహారము ఎచ్చట ఉన్నదో కనుగొనవలయునని. ఒక రోజున అందరును నిద్ర పోవుచుండగా వారి అందరి పెట్టెలు వెతికితిని. మా పినతల్లి పెట్టె అడుగున ఉన్నది. అది తీసికొని పెట్టె మరల సరిగా సర్దితిని. చంద్రహార మేమి చేయవలయునో తోచినది కాదు. నా దగ్గరనున్న వారు మరల ఎట్లును కాజేయక మానరు. ఏమి చేయవలయునా అని ఊహించి, ఒక పొట్లముగట్టి, మా నాయన అగ్ని హోత్రము చేయు బూడిద రాశి క్రింద ఉంచితిని. మరునాడు లేచి అది రహస్యముగా తీసి, రాజ్యాలక్ష్మమ్మ గారింటికి పోయి యీ సంగతులన్నియు చెప్పి అది ఆమె వద్ద దాచ ఉంచితిని. మా మేనమామకు ఆస్తి ఏమియు లేదు. పలనాటి పురోహితుడు. కొన్నాళ్ళు పోయి నరసరావు పేటలో పూటకూళ్ళు పెట్టినట. తరువాత అచ్చట గిట్టక మాల ఇల్లు చేరెను. మా యింట ఉన్న సర్వము మా అమ్మ అమ్మి పుట్టినింటికి చేర్చుచున్నది. ఊరిలో ఉన్న శూద్ర స్త్రీలకు ఇంటిలోనికి తెచ్చిన పెసలు, కందులు, బియ్యము సగానికి సగము తక్కువ ధరల కమ్మి మేనల్లున కిచ్చి పంపించును. ఈ రీతిగా కొంప గుల్ల చేయుచున్నది. తరువాత. చంద్రహారము పోయినదని. వారు తెలిసికొని నన్నడిగిరి. "ఏమమ్మా! చంద్రహారము నాదాయెను. మీరు తీయలే దంటిరి కదా! అది మీ దగ్గఱనుండి ఎట్లు పోయినది?" అని నేను అనగా, మా అమ్మ "ఎంత జాగవే! ఎంత కొంపలు ముంచుదానవే!" అని నన్ను మీద పడి కొట్టినది. ఆమె యేమి? ముగ్గురును మీదపడి కొట్టిరి. మా నాన్న చూచుచు ఊరకున్నాడు గాని పెదవి విప్పలేదు. నేను రాజ్యలక్ష్మి గారింటికి పోయి రెన్నాళ్ళు గడిపి మఱల ఇంటికి వచ్చితిని. నగల డబ్బు వారిచ్చునట్లు లేదు.

ధర్మారావునకు అరుంధతి సగము చెప్పి మానివేసి నట్లున్నది.

ధర్మా: అదేమి, అట్లు మానివేసితివి? కథ

**జరిగిన కథ–14 :** సుబ్బన్న పేట జమీందారు కృష్ణమనాయని మరణానంతరం రంగారావుగారికి పట్టాభిషేకం జరుగుతుంది. రుక్మిణమ్మా రావుగారు కబురుపంపగా ధర్మారావు కోటలోనికి వెడతాడు. ధర్మారావు భార్య అరుంధతి కాపురానికి వస్తుంది. రుక్మిణమ్మారావుగారి సహాయంతో ధర్మారావు గుంటూరు కళాశాలలో చేరతాడు. ధర్మారావుకు సూర్యపతి అనే మిత్రుడుంటాడు. పూటకూళ్ల ఇంటిలో భోజనం చేస్తూ ఉంటారు. సీస పద్యాన్ని శ్రీనాథుడే నాశనం చేసాడని ధర్మారావు అంటాడు. ధర్మారావు మోటారుబండిలో రామచంద్రరాజును కలుసు కొంటాడు. పుట్టింటికి వెళ్ళిన అరుంధతిని ధర్మారావు సుబ్బన్న పేట తీసుకు వస్తాడు.

అంతయు కాలేదే?

అరుం: ఏమియు లేదు. వారు నాకు విషము పెట్టి చంపవలయునని ఊహ చేయుచున్నారట!

ధర్మా: మీ అమ్మ కూడ అందులో ఉన్నదా?

అరుం: అమ్మ లేదు. మా మేనమామ కొడుకును, మా పినతల్లి పంపించినదట విషము తెమ్మని! నాకు మా ఊరిలో మంగలి రత్తి చెప్పినది. దాని మగడు ఊరిలో వైద్యము చేయుచుండును. దాని దగ్గఱకు వెళ్ళి అడిగినాడట!

ధర్మా: మీ పిన తల్లియు. మేనమామ కొడుకును ఇపుడు ఎచట ఉన్నారు?

అరుం: వారి ఊరు పోయిరి. ఇంక నాలుగైదు రోజులలో వత్తురు.

ధర్మా: వచ్చి నీవు కనబడక ఏడ్చెదరు కాబోలును! నీకు విషము పెట్టి ఏమి చేసికొందమని? నీ వద్ద ఏమున్నది?

అరుం: నన్ను బెదరించి హారము తీసికొందమని కాబోలు?

ధర్మా: అది కాదు. నా కిపు డంతయును తెలిసినది. నీకు పెట్టుద మనుకొనినది విషము కాదు, మందు. అది నీవు వారి మాట వినుటకు పెట్టు మందు. ఇటువంటి మందులు, మాకులు కలవందురు. ఎటులయిన నేమి? ఇంక నీ వచటికి పోవునదియు లేదు, వారు నీకు మందు పెట్టునదియు లేదు. ఎందుకు కాదుగాని, నాకు లోకమున ఇట్టి తల్లి దండ్రు లున్నందు కాశ్చర్యముగా ఉన్నది. రాక్షసు లనిన ఎచ్చటనో ఉందురా? వీరే రాక్షసులు. మనుష్యులలోననే రక్షో గుణములు కలిగిన వారే రాక్షసులు! ఆహా ఏమి తల్లి దండ్రులు! తల్లి దండ్రు లిట్లు చేసిరని చెప్పిన నమ్ముటకైన వీలులేకుండ ఉన్నది. సరేకాని, చంద్రహారము రాజ్యలక్ష్మమ్మ గారి వద్దనే ఉన్నదా యింత వఱకు? మఱల తెచ్చితివా?

అరుం: ఆమె ఒద్దనే ఉన్నది. మీరు ఱేపు పోయి తేవచ్చును.

మన్మథుడు- పూవింటిజోదు- గది నాల్గు మూలల పరవళ్ళు త్రొక్కెను. ఏనాడో శివుడు తపస్సు చేయు వేళ ఆశ్రమమున ఒదిగి ప్రత్యాలీఢపాదుడై జ్యావల్లి కర్ణగతము చేసిన వాడు, నేటికి విచ్చల విడిగా సంచరింప చొచ్చెను. హృదయములు ఒక్కటైన సతీ పతులే ఉండవలయును గాని, వారికి కష్ట కథలు అభ్యంతరములు లేవు: వారి శృంగార రసమునకు కష్టములు కూడ ఉద్దీపనవిభావములే అగును.

ఎనిమిది నెలల ప్రణయ గాథ మరల తవ్వి పోసి కొనిరి. వారిర్వురకు నిన్ననే కలిసి కొన్నట్లున్నది. ఇంతటి దీర్ఘ ప్రవాసము నప్రవాసత నందెను. సంయోగ సౌఖ్యము చిత్రమైనది. తత్పూర్వ కష్టములన్నిటికి అది చికిత్సా లేపము. ఒక్క వ్యక్తి కేమిటి? ఒక జాతి పదివేలేండ్లు పారతంత్ర్య బాధ అనుభవింప వచ్చును. మఱల శత్రు జయము ఘటిల్లిననాడు దాని వేయేండ్ల కష్టములు తృణప్రాయములై పోవును. లోకమాదరించుటయు, అంతియే. ఆ నిన్నటి దినము వఱకు అప్రయోజకమైన ఆ జాతిని అగ్రస్థానమున ఉంచి ప్రపంచక మంతయు పూజించును. ఇది వ్యక్తి యందును సరిపోవును. లక్షణ శాస్త్రములు మనస్సును సరిగా రూపించ లేవు.

ధర్మారావున కానాడు అరుంధతి వట్టి స్త్రీ వలె గోచరించ లేదు- పూర్వ జన్మమున ఆమె చేసిన సుకృతము మనోజ్ఞాకృతి దాల్చి పంట చేనివలె తన వైపున కొరిగెను. వేల యేండ్లు తపస్సు చేసినది భగీరథుడు; మందాకిని వచ్చి తాండవించినది శివుని శిరస్సున- శివునకా అదృష్టము హఠాత్సంభవము. అదృష్టము త్రోసికొనివచ్చు మార్గముతే అట్లుండును. ధర్మారావునకు తన అరుంధతీ ప్రాప్తి అట్లు తోచినది. ఉన్నట్లుగా ఉండి అతడు రెండు చేతులతో అరుంధతిని లేవనెత్తి తలమీద పెట్టు కొనెను. ఆమె పకాలున నవ్వినది. ధర్మారావు గంగానది తన వీచీ హస్తములతో కొట్టుకొని ధ్వని చేసినట్లున్న దనుకొనెను.

అరుం: ఇంత ప్రేమ కలవారు సంవత్సరము విడిచి ఎట్లుంటిరి?

ధర్మారా "ఏట్లుంటి"నని కన్నులు మూసికొనెను.

ప్రతి నిమేషము వారి ఆత్మలలో దేవతలు తాండవించిరి, వేదబుక్కులు వారి క్రీడలతో నర్థవంతము లయ్యెను. కులదేవతలు వారి లీలాపాంగముల యందు భావ్యాశలు త్రవ్వుకొనిరి. పితృ దేవతలకు వారి శృంగార లీలలందు తర్పణము లందినవి.

ధర్మారావున కామె తనువే, తద్విలాసమే, తన్నై గనిగ్యమే, తదంచల రేఖామార్దవమే చక్షుర్విషయము. ఆమె పేద మాటలు, విన్న నవ్వులు, శ్రోత్ర విషయము, తదధరము, తదురః ప్రసారితాగ్రము చుంబన విషయము. లిప్తలు, నిమేషములు, గడియలు, యామములు మృగయు బాణపాతభయ త్రస్యద్ధావదటవీ మృగముల నడుపున మాడని బాఱెను. ఎదుగుచున్న సస్యమున కాశా మెడ మిచ్చినట్లు పతిచేతి కామె సన్నని నడు మెడమిచ్చెను. ప్రవహించుచున్న నదీజలమయా కృతికి సైకతము సిక్తమై, ఆవరించిన జల మూర్తిగత ప్రాణికోటి పరితృప్తి పొందినట్లు- ఆవరింపబడి తాను కూడ తృప్తియే పొందును. సృష్టి విచిత్ర మైనది. ఆక్రమణ లో ఎంత తృప్తి ఉన్నదో యొదుగుటలో అంత తృప్తి ఉన్నది. ఒకటి పురుషుడు; ఒకటి ప్రకృతి. జ్యోత్స్నాంధకారముల వలె, సూర్య చంద్రులవలె, భూమ్యాకాశములవలె ఒకదాని కొకటి పరిపోషకము రెండు ఒకటే. దాని రెండు సగములు ఒకటే. దాని రెండు సగములన్న జ్ఞానము దీపించిన చోటు, తదైక్యభావపరిస్ఫుట సూచకమై బ్రహ్మానందము తాండవించిన చోటు. ఈ మహాభావము చేత ప్రకాశింపలేని తారాశశాంక విజయము, బిల్హణీయము మొదలయిన మహా కథలు పచ్చి బూతులై యీనాటికీ హేయము లగును. వీని అన్నింటికి శిరోరత్నము రాధాకృష్ణ సంయోగము! ప్రతి నీచ సంయోగమున ఈ తత్త్వమున్నదని, మిథ్యా యోగులు వాదించ వచ్చును. అట్లు వాదించుట చెరువుకు సముద్రమునకు భేదము లేదని వాదించుట. అనంత గ్రీష్మముల కెండనిది, నానా మహాజంతు నివాస భూమి యైనది, నానా ద్రవ్యగుణ మయమైనది, అనంత జలమూర్తికే సాగరత్వసిద్ధి, కించి దూనములకును కావచ్చును. అందుకనియే అరుంధతీ ధర్మారావుల సంయోగము బ్రహ్మానంద సబ్రహ్మచారి అయ్యెను.

యుగయుగమ్ములు సృష్టి లీలా విలాసమున అలసి ప్రళయవేళ క్షీరపాథోధివీచీ మధ్య శేషతల్పమున మాయాసహితు డయిన నారాయణుడు శయనించినట్లు ధర్మారా వరుంధతిని పాదములతో, చేతులతో, తన సర్వ శరీరముతో కప్పి తెల్లని ఆ పానుపుపై సుఖ నిద్ర



# వేయిపడగలు

పొందెను.

చల్లని వాయువులు వీచెను. మల్లికా ప్రసూనకింజల్క సితగరున్మారుతులు, మధుకర కుమారులు, ద్రాక్షాతః పతితహిమానీ బిందు పరిషిక్త దేహులు బొంగురు పోయిన గొంతులతో సోమెక్కి కదలనే లేకపోయిరి. తెల్లవారెను. తెల్లవారు చున్నదనగా వృక్షాగ్రముల నుండి లోకముకన్న ముందుగా ప్రత్యూష రథము కదలికలు చూచిన ద్విజకులము కూసెను. "పైడి కంటులు" తపతపమని రెక్కలు కొట్టి, కిచకిచమని కూసి జంటలై కదలి శాఖశాయనికు లయ్యెను.

తూర్పు కొండ నునుపైన చఱియల మీద కాలిగిట్టలు జారి సూర్యహయములు పరువెత్త లేనిచో అనూరుడు కొరడా చివళ్ళు ప్రయోగించి అదలించి తోలెను కాబోలు, వాని ముట్టెల కట్టిన నుర్వుల ట్సుషఃకాంతి ఉండలుండలుగా తూర్పుసీమ చింది పోయెను.

జంటగా వెడలి వచ్చిన కొడుకు కోడంద్రను సావిత్రమ్మగారు చూచి తన కబ్బిన భాగ్యము రామేశ్వరశాస్త్రి గారికి లేదను కొన్నది. ఎంతయైశ్వర్య మనుభవించి ఏమి? ఎంత కీర్తి పొంది ఏమి? ఎంత భోగ శాలియై ఏమి? అట్టి కొడుకు కోడంద్రను కనులార చూచినదే జన్మము!

కొంచెము ప్రొద్దెక్కిన తరువాత రామచంద్రరాజు తమ్మునికై వచ్చెను. ధర్మారావు వీధిలోనికి రాజుతో కలసి పోయెను. ఊరిలో అందరు రామచంద్ర రాజును క్రొత్తగా చూచిరి. కొందరు వయసు మీరిన వారాయనను ఎరుగుదురు.

రామచంద్రరాజు తన కిరువది యేండ్లపుడు తుని పారిపోయెను. తుని దగ్గఱ ఒక పల్లెటూరిలో ఒక ధనవంతుడయిన రాజుగా రాయనను చూచి అతని తెలివితేటలు గ్రహించి అతనిని తన వద్ద ఉంచుకొనెను. ఆ ఊరిలో ఇతడన్న అందరికిని ప్రేమగా ఉండెడిది. రామచంద్రరాజు తండ్రి వద్ద కొంత ధనుర్విద్య నేర్చినవాడు. కఱ్ఱసాము, కత్తిసాము కూడ కొంత నేర్చెను. కాని ఆ విద్య లతనికి పూర్తిగా అంటలేదు. ఇంతలో అతనికి తన వర్ణస్థులున్న చోటున అయినచో తనకు పైకి వచ్చుటకు వీలుండునని తోచి అచటికి పోయెను. వారును అతని ధనుర్విద్యాదులకు మెచ్చుకొని గౌరవించిరి. అతనితో భోజనము కలసి చేయుదురు. అతనిని సర్వ వ్యవహారము లందును స్వవర్ణస్థుని వలెనే చూతురు. కాని ఎవరును పిల్ల నీయరు. అతనికి సుబ్బన్న పేటలో ఆస్తి ఉన్నదనియు తెలియును. ఇట్టి స్థితిలో ఒక వృద్ధ క్షత్రియుడు, సంస్కృతము, ధర్మ శాస్త్రము చదివిన వాడు తన కుమారు లిద్దరును చనిపోగా పెద్దవాని కూతురు పదునేనేండ్ల పిల్లకు పేదతనము చేత సంబంధము కుదరక బాధపడుచు ఇతనిని చేరదీసి పిల్ల నిచ్చి పెండ్లి చేసెను.

పెండ్లి అయిన నాటి నుండియు రామచంద్ర రాజున కైశ్వర్య మెత్తుకొనెను. ఆమె పేరు రథంతరి. అతనికి భార్యవలన ఒక చిన్న యిల్లు వచ్చెను. తరువాత రామచంద్రరాజు ధాన్య వర్తకము సాగించెను. మొదటి యేడాదిలో అతనికి నాల్గువేలు లాభించెను. ధాన్యమా వెనుకటి ఏట పుట్టి ముప్పది రూపాయ లమ్మి, మరు సంవత్సరమే ఎనుబది అమ్మెను! ఆ మరు సంవత్సరము పసుపు నిలువ చేసెను. దాని మీద రెండువేలు లాభము తీసెను. తరువాత వడ్డీలకు తన డబ్బు ఒసగి అది పెంచెను. ఇదిగాక వ్రాయను, చదువను నేర్చిన వాడగుటచే ఆ ఊరిలో వ్యవహారము లన్నియు ఇతడే చేయు చుండెను. అట్లు మరికొంత సంపాదించెను.

తనకు మొదట పిల్ల నీయనన్న వారిమీద కోపము గలిగి వారిని సాధించవలయునని పుట్టెను. తన భార్య తాతగారి వద్ద స్మృతు లన్నియు చదువుచు, వాని ద్వారా కొంత సంస్కృత భాషాపరిచయము, కావ్య పరిచయము కలిగించు కొనెను. ఇంతలో ముసలి రాజుగారు చనిపోగా తనే సర్వాధికారియై, పండక ముసలి రాజుగారు వదిలిన భూములు తాను సేద్యము చేసెను.

(ఇంకాఉంది)

# అందానికి అవరోధం
# "దయాస్టిమా"



డా॥ కె.ఎల్.వి. ప్రసాద్

"శరస్యాభరణం రూపం.. ." అన్నారు.

అందాన్ని ఆరాధించని వారు, అందచందాలకు బానిసలు కానివారు అందం కోసం ఆరాటపడని వారు, మన సమాజంలో చాల అరుదుగా కన్పిస్తారు. అమ్మాయి అన్ని రకాలుగా సద్గుణవతే! కాని అందంగా వుండదు.." లాంటి మాటలు నిత్యం యేదో ఒక మూల నుండి వింటూ వుంటాం అలాగే, 'అ.. అమ్మాయి, అందమయిన కుందనపు బొమ్మలా వుంది" లాంటి పొగడ్తలు కూడ మన చెవిన పడుతూనే వుంటాయి. అందానికి ఆకర్షణ ఎక్కువ గనుక, అందానికి ఆకర్షింపబడని వారంటూ వుండరు. అందుచేత అందానికి మనలో ఎంతో విలువ,మోజు వున్నాయి

మన శరీరంలో అందాన్ని ప్రతిబింబింపజేసే అంగాలు, అంగ విభాగాల్లో, దంతాలు కూడ ప్రముఖ పాత్రను వహిస్తాయి. అందుచేతనే, అందమయిన పలువరుసను రకరకాలుగా వర్ణించి చెబుతుంటారు కవులు "ముత్యాల్లాంటి పళ్ళు" అంటే తెల్లగా అందంగా మిలమిల మెరిసే పళ్ళని, "దానిమ్మ గింజల్లాంటి పలువరుస" అంతా చక్కని శుభ్రమయిన పలువరుసని అర్థాన్నిచ్చే విధంగా దంతాలను వర్ణిస్తుంటారు. అందమయిన ముఖార విందానికి ముత్యాల్లాంటి పళ్ళు అవసరం అన్న విషయం అందరికీ తెలిసిందే కదా!

మనకంటే రెండు దవుడల్లోని దంతాలు, ఎగుడుదిగుడుగా, ఎత్తుగా, వంకర టింకరగా వుంటే అవి దంత సౌందర్యానికి అవరోధాన్ని కల్గిస్తాయి ఇలాంటి పరిస్థితులే కాకుండా, పలువరుస సక్రమంగానే వుండి ముందరి పళ్ళ మధ్య అమితంగా ఖాళీ యేర్పడితే అది చూడ్డానికి చాల అసహ్యంగా వుంటుంది ఇలా నోరు తెరవగానే మనకు ముందుగా కన్పించే ముందరి పళ్ళ మధ్య, అభ్యంతరకరమయిన ఖాళీ కనుక వుంటే, దానిని 'తోసి పన్ను' లేక 'దయాస్టిమా' అంటారు.

ఈ దయాస్టిమా అన్నది ఆడపిల్లల్లోను, మగపిల్లల్లో కూడ సమానంగా వుంటుంది. సాధారణంగా స్థిర దంతాల్లోకి (పర్మనెంట్ టీత్) యిది కన్పిస్తుంటుంది. ఇది వ్యాధి కాదు కనుక భయపడవలసిన పని లేదు గాని. అందాన్ని దృష్టితో వుంచుకొని ఆలోచిస్తే మగపిల్లల కంటే, ఆడపిల్లలకు ఎక్కువ యిబ్బందులను కలిగిస్తుంటాయి.

ముఖ్యంగా, హైస్కూలు – కాలేజీలకు వెళ్ళే ఆడపిల్లలు, ఆఫీసులకు పోయే ఆడపిల్లలు, పెళ్ళి కెదిగిన అమ్మాయిలు దయాస్టిమా పంటి పరిస్థితులకు సమాజంలో వూహించని వైపరీత్యాలను ఎదుర్కోవలసి వుంటుంది. కేవలం దీని గురించే కాక అందానికి ప్రాకులాడని అమ్మాయిలంటూ (అబ్బాయిలు కూడ సుమండీ!) 'వుండరు కనుక యీ పరిస్థితి యేర్పడకూడదని అందరూ అనుకుంటారు.

మరి, దయాస్టిమా అనేది ఎందుకు యేర్పడు తుంది? ఇది అందరూ తెలుసుకోవలసిన విషయం. కొన్ని రకాల చిగురు వ్యాధుల వల్ల, పళ్ళు జరిగి, స్థానభ్రంశం చెందడం వల్ల కూడ పళ్ళ మధ్య ఖాళీ లేర్పడవచ్చును. దీనిని దయాస్టిమా అనడానికి వీలులేదు. ఇవి వ్యాధి వల్ల యేర్పడిన ఖాళీ కనుక దీనిని 'పెథీలాజికల్ మైగ్రేషన్' అంటారు. 'దయాస్టిమా' యేర్పడడానికి యింతవరకు సరయిన కారణం తెలియక పోయినప్పటికి, కొన్ని ముఖ్యమయిన కారణాలను శాస్త్రజ్ఞులు వూహించగలిగినారు వీటిలో వంశపారంపర్య సమస్య ప్రధానమయినది తాతముత్తాతల నాటి యీ లక్షణం జన్యుమూలంగా నేటి తరాలకు సంక్రమించే అవకాశం వుందన్న మాట. చాల మందిలో. యిదే రకానికి సంబంధించిన దయాస్టిమా కన్పిస్తుంటుంది. దీని తరువాత చెప్పుకోతగ్గది అదనపు పన్ను చేసే కొంటి చేష్టల వల్ల. దీన్ని "సూపర్ న్యూమరీ టూత్" అంటారు. ఇది దవుడలో దాగి వుండి, దవుడలోని ముందరి పళ్ళను దరిచేర నీయకుండా చేస్తుంది. ఇది దవుడలో దాగి వున్న (ఇంపాక్టెడ్) విషయం మామూలుగా తెలియదు. కేవలం 'ఎక్స్ –రే' ఫోటో పరీక్షల ద్వారా మాత్రమే వీలవుతుంది. కొన్ని సందర్భాల్లో దాగి వున్న అధనపు పన్నును, చిన్న శస్త్రచికిత్స ద్వారా తొలగించడం వల్ల, దయాస్టిమా అదృశ్యమయి మామూలు పరిస్థితులు యేర్పడుతుంటాయి.

ఇలాగే, పై దవుడలోని మధ్య కొరుకుడు పళ్ళ మధ్య, చిగురుకు, పై పెదవికి లంగరు వేసి ఒక చిన్న – సన్నని కండరం వుంటుంది. దీనినే "ఫ్రీనల్ అటాచ్‌మెంట్" అంటారు. అలాగే 'లేబియల్ ఫ్రీనం' అని కూడ అంటారు. ఈ సన్నని కండరం, వుండవలసినదీ అయి వుండక, దళసరిగా వున్నట్లయితే, కండరపు శక్తి, యిరువైపులా పళ్ళ మీాద పని చేసి, పళ్ళ మధ్య చెప్పుకోతగినంత ఖాళీ యేర్పడి, దయాస్టిమా యేర్పడుతుంది. ఈ పరిస్థితిని కూడ బాల్య దశలో కండరాన్ని సరిపడినంత స్థాయిలో కత్తిరించడం వల్ల పలు వరుసలో మామూలు పరిస్థితులు యేర్పడతాయి.

వీటికి తోడు ప్రక్క కొరుకుడు పళ్ళు సన్నగా, చిన్నగా వున్నపుడు, చిన్నపుడే ముందరి స్థిర దంతాలు కోల్పోయినపుడు మధ్య కొరుకుడు పళ్ళు స్థానభ్రంశం చెందినపుడు కూడ "దయాస్టిమా" యేర్పడుతుంది. బొటన వ్రేలిని, నిత్యము చప్పరించే అలవాటు వున్న పిల్లల్లో కూడ, దంతాలు యెత్తుగా యేర్పడి, మధ్యలో దయాస్టిమా అవతరిస్తుంది.

చికిత్సా విధానం · దయాస్టిమా పరిస్థితిని అతి సులభంగా పరిష్కరించుకోవచ్చు. ముందు పిల్లల చేత వేళ్ళు చప్పరించడం వంటి అలవాట్లను మాన్పించాలి. తరువాత దయాస్టిమాను అనేక పద్ధతుల ద్వారా నిరాకరించుకోవచ్చు. దీని చికిత్స అర్థడాంటిక్ విధానంలో జరుగుతుంది. అందుచేత, యిరవయి సంవత్సరాల లోపు పిల్లల్లో చికిత్స విజయవంతమవుతుంది. పరిస్థితిని బట్టి కొందరికి "ఫిక్స్‌డ్" పద్ధతిలోను, మరికొందరికి 'రిమూవబుల్' పద్ధతిలోను చికిత్స చేయబడుతుంది.

అయితే, నూతన ప్రయోగ ఫలితాల వల్ల, ఆధునిక చికిత్సా విధానాలు మనకు యిప్పుడు అందుబాటులో వున్నాయి. ఈ చికిత్స ద్వారా యిరవయి సంవత్సరాలు పైబడిన వారు కూడా లాభం పొందగలుగుతారు. దీనినే 'అసిడీ ఎచ్' విధానం అంటారు. ఈ విధానంలో, ఎలాంటి క్లిప్పులు వుపయోగించవలసిన అవసరం వుండదు. నెలల కొద్దీ చికిత్సకు గురి కావలసిన పరిస్థితి తప్పుతుంది. ఈ చికిత్స, దయాస్టిమా వున్న వైపు, పంటి రంగును పోలిన రంగు గల పదార్థంతో (డెంటల్ మెటీరియల్) పంటి సైజును పెంచడం ద్వారా, వీలు పడుతుంది. అయితే, యిది వ్యయ ప్రయాసలతో కూడుకొన్న చికిత్స, సామాన్యునికి యిది అందని ద్రాక్ష పండే!!

ఇది కాకుండా దయాస్టిమా ఎక్కువగా వున్న సందర్భంలో, పంటి తొడుగులు (యాన్‌టీరియన్ టూత్ క్రౌన్స్) గాని, కట్టుడు పళ్ళను గాని పెట్టుకోవడానికి వీలవుతుంది. కొందరికి సన్నని దయాస్టిమా వుండడం వల్ల దంత సౌందర్యం అధికమయ్యే పరిస్థితులు కూడ వుంటాయి. ఇలాంటి వారు చికిత్స గురించి ఆలోచించవలసిన పనే లేదు! అది వారి అదృష్టం!! దయాస్టిమాకు, చికిత్స చేయించుకోవడం, కేవలం దంత సౌందర్యం గురించే కాకుండా, మాట స్వచ్ఛతకు కూడ అత్యవసరం అన్న విషయం, సంబంధించిన వారు గుర్తుంచుకోవాలి. □






# ఋణవిముక్తి
# పెద్దలక్ష్మి

"ఒరేయ్ శంకరం ఆ రామ్మూర్తి మేస్టారు యిప్పటికే నాలుగైదు సార్లు కబురుపెట్టారు. ఒక్కసారి వెళ్ళి కన్పించి రారాదూ?" అన్నం వడ్డిస్తూ జానకమ్మ కొడుకు శంకరంతో అంది.

ఆ మాటకి చివ్వున తలెత్తాడు శంకరం..... "నాకు ఊపిరి పీల్చుకునే తీరికే లేదు చూస్తున్నావ్ కదా? ఇంక వాళ్ళింటికి యెప్పుడు వెళ్తాను? అయినా యింతకీ నాతో ఆయనకి ప్రత్యేకమైన పనులేముంటాయి చెప్పు? ఎప్పుడో చిన్నప్పుడు నాకు ట్యూషన్ చెప్పేరు. ఆ కనెక్షన్ అంతటితో అయిపోయింది. మేస్టారి స్నేహితులు నాన్నగారా? లేరు.... ఆ సంబంధం కూడా లేనట్లే. ఇప్పుడు నేనింత పొజిషన్లో ఉన్నప్పుడు కూడా 'ఒక్కసారి యింటికి రా' అని కబురు పంపటమేమిటి? ఆ సందులు గొందులు తిరిగి ఆ పాక వెతుక్కుని తీరా నేను వెళితే ఆ ముసలాయన యింట్లో ఉంటారు లేకపోతారు..... ' అంటూ చెయ్యి కడుక్కుని విసురుగా లేచాడు కంచం దగ్గర్నుంచి.

"అమ్మా, యివాళ ట్యూషన్కి వెళ్ళనం"టూ మారాం చేస్తూ యేడుస్తున్న ఏడేళ్ళ శంకరం అరక్షణం కళ్ళముందు మెదిలి అర్థయుక్తంగా నవ్వుకుంది జానకమ్మ.... 'ఎంతలో యెంతగా యెదిగిపోయావురా శంకరం?' అనుకుంటూ.

ముందు హాలులోకి వచ్చిన శంకరం తనకోసమే వెయిట్ చేస్తున్న స్టూడెంట్స్ కొందరిని కలుసుకుని హడావుడిగా స్కూటర్ మీద కాలేజీకి బయలుదేరాడు.

'క్షణం తీరిక లేని జీవితమై పోయింది.' కనీసం 'అమ్మా'? అని ఆప్యాయంగా తనతో రెండు ముక్కలు మాట్లాడే తీరిక కూడా లేదు. ఉన్నంత సేపు కాలేజీ ఆ తర్వాత ట్యూషన్స్. ఇరవై నాలుగ్గంటలూ చదువు ... చదువు... చదువు! చదువే ఒక ప్రపంచం అయిపోయింది! చిన్నప్పుడంతా 'చదువుకోరా వెధవా!' అని తిట్టేది తను ఇప్పుడు 'ఆ చదువులు చెప్పడం కాస్త తగ్గించుకోరా నాయనా' అనవలసి వస్తోంది. అయినా యింకా యెన్నాళ్ళీ సంసార తాపత్రయం? త్వరలో శంకరం పెళ్ళి జరిపించేస్తే తన బాధ్యత కొంత తగ్గుతుంది. ఆ వచ్చే కోడలు కొడుకుని కాస్త అదుపులో నూ పెట్టుకుంటుంది. ఆ తర్వాత యిద్దరూ కలిసి పద్మ పెళ్ళి జరిపించేస్తారు..... కొడుకుని సాగనంపిన జానకమ్మ అలా ఆలోచిస్తూ అక్కడే నిలబడి పోయింది....

'ఊఁ అయితే అమ్మగారు మళ్ళీ అన్నయ్య పెళ్ళి కలలు కంటున్నారన్న మాట!' అప్పుడే అక్కడికి వచ్చిన పద్మ పరిహాస మాడింది.

"నేనేమో వాడి పెళ్ళి కలలు కంటున్నాను... వాడేమో నీ పెళ్ళి కలలు కంటున్నాడు. కట్నమెంతైనా సరే యిచ్చి నిన్నొక ఆఫీసరు భార్యని చెయ్యాలని పట్టుదలగా ఉంది వాడికి.... ఎవరి కళ్యాణ ఘడియ యెప్పుడు రాసి పెట్టి ఉందో?" తన మామూలు వేదాంత ధోరణిలో పడిపోయిందిజానకమ్మ.

* * * * *

శివరామయ్య, రామ్మూర్తి చిన్ననాటి స్నేహితులు. శివరామయ్య ఒక ఆఫీసులో గుమాస్తాగా స్థిరపడ్డాడు. రామ్మూర్తి ఉపాధ్యాయ వృత్తిని చేపట్టాడు.

శివరామయ్య, జానకమ్మల సంతానం శంకరం, పద్మ. ముగ్గురు కూతుళ్ళు, ముగ్గురు కొడుకులతో రామ్మూర్తి సంసారం పెద్దదైంది. ఆదాయం ఒకటి, వ్యయం మూడుగా సాగిపోయింది. కాని, ఆర్థికంగా యెన్ని యిబ్బందుల్ని యెదుర్కొన్నా రామ్మూర్తి ముఖంలో చెదరని చిరునవ్వు అతని మనోనిబ్బరానికి ప్రతీకగా నిలిచి ఉండేది. ఎప్పుడైనా శివరామయ్య ఒక స్నేహితుడిగా కష్టాలలో పాలు పంచుకుందామని యే చిన్న విషయం కదిపినా... 'చూడు శివా, యీ సంసారం ఒక మహాసాగరం..... ఒడిదుడుకులు తప్పవు.... తట్టుకుని ఆత్మస్థైర్యంతో నిలబడాలి గానీ ప్రతీ చిన్న విషయానికీ చలించి పోతే మన పెద్దరికం చిన్నబోదూ?" అనేవారు నవ్వుతూ.

ఆ యేడు శంకరం పదవతరగతికి వచ్చాడు. ఉద్యోగం రీత్యా ప్రమోషన్ మీద శివరామయ్యకి మరో ప్రాంతానికి బదిలీ అయింది. శంకరం చదువు మధ్యలో ఆగిపోవడం యిష్టం లేక కుటుంబాన్ని అక్కడే వదిలి తానొక్కడే వెళ్ళిపోయారు శివరామయ్య వెళ్ళేముందు రామ్మూర్తిని కలిసి.....

'ప్రమోషన్ వదులుకోలేక నేను వెళ్తున్నాను. కాని, శంకరం చదువు బాధ్యత పూర్తిగా నీకే అప్పగిస్తున్నాను. అంటే యిప్పుడు మాత్రం నేను చూడటం లేదా? అంటావేమో. ఓనమాలు దిద్దించిన నీ చేతుల మీదుగానే వాడు టెన్త్ మంచి మార్కులతో పాస్ కావాలి. వాడి భవిష్యత్తంతా యీ ఒక్క యేడు చదువు మీద ఆధారపడి ఉంటుంది. వాడు చూస్తే వట్టి జులాయి వెధవలా తిరుగుతున్నాడు. నా మాట కూడా లక్ష్యపెట్టకుండా ఉన్నాడు. నువ్వే యేదో భయం చెప్పి వీడిని మంచి మార్గంలో పెట్టాలి'... తండ్రి ప్రక్కనే నించున్న శంకరం తండ్రిని, మేస్టారిని ఓసారి మింగేసేలా చూసాడు.

కొంచెం సేపు ఆలోచించిన రామ్మూర్తి... 'శివా, నువ్వు యేమనుకోనంటే చిన్న మాట..... చాలా రోజులుగా చెప్పాలనుకుంటూనే సంశయిస్తున్నాను. నెలకి ఎంతో కొంత ట్యూషన్ ఫీజు పంపించు. నా ఆర్థిక యిబ్బందుల దృష్ట్యా అడుగుతున్నాను. మరేమీ అనుకోకు...' వ్యక్తిత్వాన్ని చంపుకుని అలా అడిగినందుకు తనలో తనే కుంచించుకు పోయారు రామ్మూర్తి మేస్టారు.

ఎప్పుడూ లేనిది రామూర్తి నోటి వెంట ఆ మాటలు శివరామయ్యకి చాలా ఆశ్చర్యాన్ని కలిగించాయి.... 'దీనిలో అనుకునే దేముంది రామ్మూర్తీ .... ఎంత పంపమంటావో చెప్పు.... నేను మాత్రం అంత పరిస్థితులు అర్థం చేసుకోలేని వాడినా?' అన్నారు.

'నెలకి ఒక యాభై పంపు చాలు....' అంటున్న మేస్టారి వైపు కొరకొరా చూసాడు శంకరం.... మిగతా పిల్లల దగ్గర పాతిక రూపాయిలు తీసుకోవడం తను కళ్ళారా చూసాడు.... మరి తన దగ్గర యాభై తీసుకుంటారా?

'వస్తాను రామ్మూర్తీ...... మా వాడిని నీ చేతులలో పెట్టాను మరి..... ' అంటూ శెలవు తీసుకున్నారు.

ఆ యేడు శంకరం ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణుడు కావడం శివరామయ్య దంపతులకు కించిదాశ్చర్యాన్ని, శంకరానికి కించిత్ గర్వాన్ని కలుగ జేసింది. 'రామ్మూర్తీ, నీ దయవల్ల శంకరం యిన్నాళ్ళకి ప్రయోజకుడయ్యాడ'ని తండ్రి రామ్మూర్తి మేస్టారి చేతులు రెండూ పట్టుకుని అభినందించడంతో శంకరం మనసు చివుక్కుమంది. కష్టపడి చదివినది తను...... పరీక్షలు రాసినది తను..... మరి నాన్న తనని పొగడకుండా రామ్మూర్తి మేస్టారిని అభినందిస్తారేం?

* * * * *

ఆ తర్వాత శివరామయ్య సకుటుంబంగా విశాఖపట్నం వదిలి వెళ్ళి పోవడం, మరొక మూడేళ్ళలో శివరామయ్య గుండెపోటుతో హఠాత్తుగా మరణించడం, శంకరం ఎమ్. ఎస్. సి. పి. హెచ్.డి. చేసి లెక్చరర్గా తిరిగి విశాఖరావడం అన్నీ కాలచక్రంలో గిర్రున తిరిగిపోయాయి.

రామ్మూర్తి మేస్టారు కూడా రిటైరయ్యారు. పెద్ద కొడుకు విశాఖలోనే అకౌంటెంట్గా సెటిలయ్యాడు. ఇద్దరు పిల్లలు. పెద్దమ్మాయి పెళ్ళితో ఆర్థికంగా చాలా దెబ్బతింది రామ్మూర్తి సంసారం. రిటైరయినా మళ్ళీ జీవనోపాధి కోసం యేవో ఎకౌంట్స్ రాసి నెలకి మూడొందలు సంపాదించు కుంటున్నారు. రెండవవాడు ఢిల్లీలో ఐ. ఎ. యస్. ఆఫీసరు..... యింటిని కొంత వరకు ఆదుకొంటున్నాడు. ఇంకా యిద్దరాడపిల్లల బాధ్యత తీరాలి.

ఇన్నేళ్ళ తర్వాత తన శివుడి కొడుకు శంకరం యీ ఊరికే లెక్చరర్గా తిరిగి వచ్చాడని తెలిసి రామూర్తి మేస్టారు చాలా ఆనందించారు. శంకరాన్ని ఒక్కసారి చూడాలనీ, మనసారా అభినందించాలనీ మనసు ఆరాటపడింది. ఒకటి రెండుసార్లు తనే వెళ్దామనుకున్నారు కాని.... యీ వయసులో తను చేస్తున్న ఆ ఉద్యోగం వల్లనేమో సాయంకాలానికి నిస్త్రాణగా అయిపోతున్నారు. ఎక్కడికీ కదిలే ఓపిక



ఉండటం లేదు.

*     *     *     *     *

'శంకరం, నిన్న మళ్ళీ మేస్టారు కబురు చేసేరురా ఒక్కసారి రమ్మని.... ఏదో ముఖ్యమైన విషయం మాట్లాడాలిట.... ఈరోజు కాలేజీ అయి పోయాక ఒక్కసారి వెళ్ళికూడదూ?' ఏమంటాడో నని సంశయిస్తూనే చెప్పింది జానకమ్మ.

బూట్లు వేసుకుంటున్న శంకరం తలెత్తలేదు.... తలెత్తకుండానే 'సాయంకాలం చాలా ముఖ్యమైన పార్టీ ఉందమ్మా. వెళ్ళకపోతే బాగుండదు. అంత ముఖ్యమైన విషయమేమిటో కబురు పెట్టొచ్చుగా?' అన్నాడు.

'వీతో స్వయంగా మాట్లాడాలంటున్నప్పుడు కబురెలా పెడతారురా? ఈ పార్టీలవీ యెప్పుడూ ఉండేవే .... ఒక్కసారి వెళ్ళి కలసివస్తే సరిపోయే దానికి యిన్ని వాదనలు.... వాయిదాలు యెందుకురా?' చాలా సౌమ్యంగా అనాలనుకున్నా చివరిమాటలు కరుగ్గానేవచ్చాయి.

'ఎంత సేపూ తన మాట తనదే గాని నా గురించి ఆలోచించదేం? అసలే రామ్మూర్తి మేస్టారి ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రంగా ఉంది. ఎదిగిన ఆడపిల్లలు గుండెల మీద కుంపటిలా కూర్చున్నారు..... తను చూస్తే ఆయనదగ్గర చదువుకున్న వాడు. ఒకటి రెండు సార్లు తన తండ్రి పరిహాసానికే కావచ్చు మేస్టారి కూతురు శకుంతల గురించి .... 'మా కోడలు పిల్ల కన్పించదేం?' అనడం తను చెవులారా విన్నాడు. ఇప్పుడు 'నా స్నేహితుడి కొడుకువి నా మాట కాదనకం'టూ తనని మొహమాట పెట్టేస్తే? తను మాత్రం మారు మాట్లాడ గలడా? పోనీ యింకేదో సాకు చెప్దామన్నా శకుంతల అపురూప సౌందర్యవతి.... 'మీ నాన్నే బ్రతికి ఉంటే తప్పకుండా నా మాట మన్నించే వాడంటే తను కాదనగలడా? ఇన్ని లిటిగేష న్లున్నాయి కాబట్టే తను వెళ్ళడానికి సంశయిస్తున్నాడు... అమ్మ అర్థం చేసుకోదేం?

'నాతో పాటు చదువుకున్న రఘు యీ ఊళ్ళోనే ప్రాక్టీస్ పెట్టాలనుకుంటున్నాడు. జగదాంబ సెంటర్‌లో యీ రోజు క్లినిక్ ఓపెన్ చేస్తున్నాడు. నన్ను మరీ -మరీ రమ్మని చెప్పి కార్డు పంపించాడు. వెళ్ళకపోతే బాగుండదు. పైగా యీరోజు మన సైట్ కొకసారి వెళ్ళి చూసిరావాలి.... వచ్చే నెలలో యిల్లు కూడా ప్రారంభించాలనుకుంటున్నాను.... ' చెప్ప దలచుకున్న రెండు మాటలు గడగడా చెప్పేసి వెళ్ళి స్కూటర్ స్టార్ట్ చేసాడు శంకరం.

*     *     *     *     *

అది ఒక అత్యాధునిక మైన బిల్డింగ్. 'డా. రఘుకుమార్ ఎమ్. డి.' అన్న బోర్డు విద్యుద్దీపాల తోరణాల కాంతిలో ధగధగా మెరిసి పోతోంది.

ఆహ్వానితులు ఒక్కొక్కరే వచ్చి ఖాళీ కుర్చీల నలంకరిస్తున్నారు.

శంకరం కళ్ళు రఘుకోసం ఆత్రుతగా వెదికాయి... ఎక్కడా కన్పించలేదు.

రఘుకి దగ్గరవాళ్ళు గాబోలు కొంత మంది పార్టీ యేర్పాట్లలో హడావుడిగా తిరుగుతున్నారు. తన ఉనికినే పట్టించుకోలేదు యెవ్వరూ. చూస్తూ ఉండగానే అరగంటలో హాలంతా ఆహ్వానితులతో

ఇంట పోయింది. ఎవరి నోట విన్నా రఘు గురించిన ప్రశంసలే..... కాని, రఘు జాడ మాత్రం లేదు.

ఒకరిద్దరు ముఖ పరిచయస్తులు తనని విష్ చేసి వెళ్ళి తమ స్థానాలలో తిరిగి కూర్చున్నారు. ఆతృత నణచుకోలేక శంకరం స్టేజి దగ్గరగా వెళ్ళి ఓ వ్యక్తి నడిగాడు .. 'డా. రఘు ఎక్కడ?' అని. ఇంత పార్టీ యేర్పాటు చేసిన అసలు వ్యక్తి కనీసం యెదురుగా వచ్చి పలుకరించనైనా లేదని చాలా చిరాగ్గా ఉంది శంకరానికి.

'ఇప్పటికి వందమందికి చెప్పాను.... ఎవరో ముఖ్యమైన అతిథులు రావలసిన వాళ్ళు రాలేదని తీసుకురావడానికి 'కారులో వెళ్ళారు' తనకంటే రెట్టింపు విసుగ్గా సమాధాన మిచ్చాడా వ్యక్తి.

'అదిగో డాక్టరుగారు వచ్చేసారు.... ' జనంలో కలకలం.

'రఘుకి అంత ముఖ్యమైన అతిథి యెవరు?' శంకరానికి ఆతృత మరీ యెక్కువైంది. గేటువైపు చూసిన శంకరం అవాక్కయి పోయాడు. రఘు కారులో నుండి దిగివస్తున్న ఒక ముసలాయన్ని చేయి పట్టుకుని జాగ్రత్తగా నడిపించుకుని తీసుకు వస్తున్నాడు.... అతను.... ఎవరు? ఎక్కడో చూసిన గుర్తు. ని.... జ.... మే.... అతను రామ్మూర్తి మేస్టారు!!

ముడతలు పడ్డ శరీరం, పళ్ళూడిపోయిన బోసి నోరు, ముగ్గు బుట్టలాంటి తల.... నేడో రేపో రాలిపోయే పండుటాకులాగున్నారు. ఒకటి రెండు సార్లు రఘు నోటనే మేస్టారి ఆర్థిక పరిస్థితి గురించి విన్నాడు తను. పెళ్ళి కెదిగిన యిద్దరమ్మాయిలు, పెళ్ళి చేయలేని అసమర్థత అతన్ని బాగా కృంగదీసాయనీ చెప్పాడు రఘు. పోనీ, రెండవ కొడుకు పెళ్ళికి వచ్చిన కట్నంతో అమ్మాయి పెళ్ళి జరిపించవచ్చు కదా? అని తను రఘుతో అంటే రఘు నవ్వాడు కూడా. 'కన్న కొడుకుని కట్నం కోసం అమ్ముకోలేను' అంటారు. పాపం మేస్టారి భార్య, ఎల్లలు కూడా యీ విషయంలో యెంతగానో నచ్చ జెప్పి విఫలులయ్యారుట.' అన్నాడు.

'నలుగురు నడిచే త్రోవన నడవక యిదేం

## పునాది రాళ్ళు

మూర్ఖపు పట్టుదలో?' మరి తను మాత్రం కట్నం తీసుకుందుకు సిద్ధంగా ఉన్నాడు గదా? అమలాపురం వాళ్ళు రెండున్నర లక్షలు రెడీ క్యాష్ యిస్తామంటున్నారు... రాజమండ్రి వాళ్ళు రెండు లక్షలు కట్నం యిచ్చి ఒక్కర్తే పిల్ల కాబట్టి లాంఛనాలన్నీ ఘనంగా జరుపుతామని కబురు పెట్టారు.... ఎటు మొగ్గాలో తేల్చుకో లేక సతమత మవుతున్నాడు తను..... నవ్వు కున్నాడు శంకరం.

'నావల్ల మీ కందరికీ కలిగిన అసౌకర్యానికి క్షంతవ్యుడిని. నాకు ఓనమాలు నేర్పి, నా విద్యా జీవితానికి పునాది వేసిన శ్రీ రామ్మూర్తి మేస్టారి చేతుల మీదుగానే యీ కార్యక్రమం జరిపించ దలచాను. ఒక భవనం పది కాలాలపాటు నిశ్చలంగా నిలబడిందంటే అది ఆ భవనం గొప్పతనం కాదు. దాని కాధార భూతమైన 'పునాది' గొప్పతనమేనని నా నమ్మకం... అస్వస్థత కారణంగా ముందు నిరాకరించినా నా మాట మన్నించి నాతో దయచేసిన నా గురువుగారికి కృతజ్ఞతాభివందనలు.... ' మైకు దగ్గర రఘు గొంతు ఖంగుమంటోంది.

మేస్టారు లేచారు.... 'నాదగ్గర చదువుకున్న రఘు యీరోజు యింత ప్రయోజకుడయ్యాడంటే నా కెంతో గర్వంగాను, ఆనందంగాను ఉంది. నేను నేర్పినవి ఓనమాలే.... కాని .... ఒక మహావృక్షం తన జీవనానికి మూలకారణమైన విత్తును ఈసడింపుగా చూస్తున్న యీ రోజుల్లో .... విదేశాలలో చదువుకుని వచ్చిన తర్వాత కూడా నన్ను ... ఒక సామాన్య బడిపంతులుని యింతగా గౌరవిస్తున్న రఘుని చూస్తూ ఉంటే యీ కాలంలో పుట్ట వలసిన వాడు కాదనిపిస్తోంది... ' దగ్గు తెర అడ్డు వచ్చి ఆగారు.... 'నేను నాటిన విత్తు మొలకెత్తి, మొక్కై, యీ రోజు పది మందికీ ఆశ్రయాన్ని కల్పించే మహా వృక్షమైందంటే నేను పొందుతున్న యీ ఆనందాను భూతిని నోటితో చెప్పడానికి మాటలు రావడం లేదు. ఈ సందర్భంగా నేను రఘుకి యివ్వ గలిగేది నా శుభాశీస్సులే!' కరతాళ ధ్వనులు మిన్ను ముట్టాయి.

ఇదేమిటి? పార్టీకని వచ్చి తను యిక్కడ ఒంటరిగా యిలా నిలబడిపోయాడేమిటి? అంతగా ఆహ్వానించిన రఘు అసలు తన కోసం యెదురు చూసినట్లు కూడా కనబడలేదు.

'సార్.... కూల్ డ్రింక్' ఎదురుగా డ్రింక్స్ కుర్రాడు. తనకి డ్రింక్ ఆఫర్ చేస్తున్నాడు... క్షణం ఆలోచించిన శంకరం నాలుగడుగుల్లో బయటికి వచ్చి స్కూటరెక్కాడు... అక్కడ... ఆ పార్టీలో ఊపిరాడ నట్లుగా ఫీలయ్యాడు. ఇప్పుడింక యెంతో రిలీఫ్‌గా ఉంది.

*         *         *         *         *

ఆలస్యంగా యింటికి చేరుకున్న శంకరం వాకిట్లో కారు చూసి తన యింట్లో యెవరో పరిచయస్థుల మాటలు వినపడటంతో ఆతృతగా లోనికి అడుగు పెట్టాడు. ఎదురుగా రామ్మూర్తి మేస్టారు, రఘు! అమ్మ ఆ యిద్దరితోను మాట్లాడుతోంది.

'రారా.... శంకరం నీ కోసమే యెదురు చూస్తున్నాం. ఎన్నాళ్ళ నుండో అనుకుంటున్నాను నీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలని.... కాని వయసు మీరి పోయి యెక్కడికీ వెళ్ళలేక నీకే కబురు పెట్టాను. ఇన్నాళ్ళకి రఘు ధర్మమా అని యిలా తీసుకొచ్చాడు...' శంకరం గుండెల్లో రాయి పడింది.

'నువ్వు నా యింట్లో పార్టీకే వెళ్ళావని మీ అమ్మ గారు చెప్పేరు.... మరి... నాకెక్కడా కన్పించలేదే?' రఘు లేచి తన వైపే అడుగులు వేస్తూ అన్నాడు.

వాళ్ళిద్దరినీ అక్కడ చూసిన శంకరానికి ఒక్క క్షణం మతి పోయింది. వెంటనే సర్దుకుని 'నమస్కారం మేస్టారూ.... నాకూ పని ఒత్తిడిలో ఎప్పటికప్పుడే కుదరడం లేదు. అంతా కులాసా యేనా?' అంటూ తనూ ఓ కుర్చీలో కూర్చున్నాడు శంకరం.... 'అసలు నీ పార్టీకనే బయల్దేరాను... దారిలో మరో అర్జెంటు పని తగిలింది. అందువల్ల రాలేకపోయాను.... సారీ ... రఘు...' అన్నాడు రఘు వైపు చూస్తూ. పైకి యేదో మాట్లాడుతున్నాడే తప్ప మనసు మాత్రం మేస్టారు మాట్లాడబోయే






ముఖ్యమైన విషయం చుట్టూ తిరుగుతోంది.

కాఫీ కప్పులతో పద్మ వచ్చింది.

'ఈ రెండు కుటుంబాల మధ్య ఉన్న స్నేహాన్ని బంధుత్వంతో మరింత పటిష్ఠం చేయాలనుకుంటున్నాను. చెల్లెమ్మా!' మేస్టారి మాటలకి శంకరం నెత్తిన పిడుగు పడ్డట్లయింది... అర్థం కాక అయోమయంగా చూసింది జానకమ్మ. 'పద్మని నా యింటి కోడలుగా చేసుకోవాలను కుంటున్నాను శంకరం... ఈ విషయం అడగాలనే నిన్ను యింటికి రమ్మని కబురు చేసాను....'

జానకమ్మ, శంకరం ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.... ఆనందం, ఆశ్చర్యం ముప్పిరి గొని రామ్మూర్తి మేస్టారి చేతులు రెండూ పట్టుకున్నాడు శంకరం ... 'మేస్టారూ.... మా పద్మ చాలా అదృష్టవంతురాలు...' .

'సంప్రదాయమైన కుటుంబం, లక్షణమైన పిల్ల ... అదృష్టం నాది శంకరం' అన్నారు మేస్టారు నవ్వుతూ.

'మేస్టారూ.... మరి.... ' అర్ధోక్తిలో ఆగిపోయాడు యేదో అడగబోయి

'నాకు తెలుసు నీ సందేహం. కట్న కానుకల సంగతేనా? ఇప్పటికి కనీసం ఓ ముఫ్ఫై, నలభై సంబంధాల దాకా వచ్చాయి...' అందరూ రెండు లక్షలు పైగానే యిస్తామంటున్నారు.... మరి నీ సంగతి కూడా చెప్పేయ్. ఎంత యిచ్చుకోగలవో?" మరోసారి తల్లీ కొడుకులు ముఖాముఖాలు చూసుకున్నారు.

వచ్చిన పని అయిందన్నట్లుగా లేచారు రామ్మూర్తిగారు.... "చూడు శంకరం.... కోట్లు విలువచేసే కోడలుపిల్ల యింటికి వస్తూ ఉంటే లక్షలు కట్నం కోసం కక్కుర్తి పడతాననుకున్నావా? కట్నం ప్రసక్తి నాకు, మావాడికీ యిద్దరికీ గిట్టదు .. మంచి రోజు చూసి పద్మ జాతకం పట్టుకురా. అబ్బాయికి కూడా ఉత్తరం రాస్తాను ఈ వైశాఖంలో ముహూర్తాలు పెట్టుకుందాం.... వస్తాను చెల్లెమ్మా...." నాలు గడుగులు వేసి యేదో గుర్తు కొచ్చి మళ్ళీ వెనుదిరిగారు .... "మరో ముఖ్యమైన విషయం చెప్పాలని వచ్చి మర్చి పోయాను..... 'మా శకుంతల పెళ్ళి, అబ్బాయి పెళ్ళి ఒక్కసారే జరిపించాలనుకుంటున్నాను. మా అల్లుడు.... యిదిగో రఘు... నా ప్రక్కనే ఉన్నాడు.' ఏమిటో ఛాదస్తం.... ఏమీ యిచ్చుకోలేని యీ బడిపంతులంటే యెందుకో యింత అభిమానం? 'మీరు నడిచే బాటలో కనీసం ఒక్క అడుగైనా వేయనీయండి మాస్టారూ.... ' అంటాడు. ఆదర్శాలు ఒకరు నేర్పితే వచ్చేవా? పుట్టుకతో రావాలి గాని... .' అడుగులు తడబడుతూ ఉంటే రఘు ఆసరాతో కారెక్కారు.

ఈయన గురించా తను అంత తక్కువగా ఊహించు కున్నాడు? రఘు..... తను చేయలేని పని చేసి చూపించాడు.

నలుగురికంటే తన దగ్గర మరో పాతిక యెక్కువ ఫీజు వసూలు చేసిన మేస్టారిలో యింతటి మార్పు ఒక్కసారిగా యెలా వచ్చిందో అర్థం కాలేదు శంకరానికి.... ఆ విషయమే అడిగాడు తల్లిని. 'అదేమిటిరా స్నేహితుడి కొడుకువి కదా అని నీకు ఊరికే ట్యూషన్ చెప్తూ ఉంటే నువ్వు అసలు శ్రద్ధ చూపలేదు. అందుకని అందరికంటే ఓ పాతిక యెక్కువ, అదీ నీ చేతుల మీదుగానే పుచ్చుకుంటే నీకు బాధ్యత కొంత తెలిసి వస్తుందని అలా చేసారు. నీ ట్యూషన్ ఫీజుగా నీ దగ్గర వసూలు చేసిన అయిదు వందలు మనం యీ ఊరి నుండి వెళ్ళిపోయే ముందు తెచ్చి నాన్నగారికి యిచ్చేసారు కూడా.... ఆ డబ్బుతోనే నీ కాలేజీ ఫీజులవీ చెల్లించాం. నాన్నగారు నీకు చెప్ప లేదేమో?'

తల్లి మాటలతో శంకరం మనసులో యిన్నేళ్ళుగా పేరుకు పోయిన అనుమానపు పొరలు ఒకటొకటే తొలగి పోయాయి.

'ఒక వృక్షం ఎండవానలకి తట్టుకుని నిలబడ గలిగిందంటే ఆ గొప్పతనం ఆ చెట్టుది కాదురా.... భూమి లోపలికి చొచ్చుకు పోయిన దాని వేళ్ళది.... అలాగే ఓ భవనం పది కాలాల పాటు నిశ్చలంగా ఉందంటే ఆ గొప్పతనం ఆ కట్టడానిది కాదు.... దానికాధార భూతమైన పునాదిది. కాని, యింత ప్రాముఖ్యత ఉన్నా ఆ పునాదిరాళ్ళు యెప్పుడూ అట్టడుగునే ఉంటాయి..... ఎవరి దృష్టినీ ఆకర్షించవు అవి .... !' తండ్రి మాటలు దివ్య సందేశంగా వినిపిస్తూ ఉంటే పరిపూర్ణ పశ్చాత్తాపంతో తల దించుకున్నాడు శంకరం..... □

# ఈ వేమన పద్యాలు




ఎడ్డ దెల్ప వచ్చు నేడాదికైనను
మౌని దెల్పవచ్చు మాసమునను
మొప్పె దెల్పరాదు ముప్పదేండ్లకునైన
విశ్వదాభిరామ వినురవేమ.

# వారఫలం

17–7–1987 శుక్రవారం మొదలు 23–7–1987 గురువారం వరకు:

★ **మేషం:** ఆకాశాన గ్రహాల అమరిక మీ రాశికి అనుకూలం అధికంగా వ్యయం అయ్యే సూచన ఉన్నది. అంటే ఆదాయం ఉన్నదన్న మాట, పత్రికారంగాన మెఱుగు. స్త్రీలకు: క్రొత్త ఉద్యోగాలు లభించే అవకాశమున్నది, గ్రహించండి.

★ **వృషభం:** ఆదాయ, మున్నది, కానివర్గం అణగి ఉంటుంది. పెద్దగా బెంగ లేదు. వృత్తియందు వికాస మున్నది. రాజకీయంగా మేలే, మాటకు విలువ పెరుగుతుంది స్త్రీలకు: ధనలబ్ధి, ఉద్యోగమందు విలువైన సంఘటనలు జరుగుతవి.

★ **మిధునం:** నూతన వృత్తిలోకొందరు అభివృద్ధిని చవి చూస్తారు. రాజకీయ వాదులకు అనుకూలం. రాజకీయంగా ఒక కాలు వెనుకకు పెట్టటమే మెరుగు. మాటకు గౌరవ మున్నది. సభా గౌరవం కొందరకు, పత్రికా గౌరవం కొందరకు స్త్రీలకు: యోగాభివృద్ధి సమయం.

★ **కర్కాటకం:** దూర భారాల నుండి మిత్రులు యింటికి రానున్నారు. ఉత్తర ప్రత్యుత్తరాల వలన మేలు జరుగుతుంది. అదేవిధంగా కృషి చేసి, అంటే నిరంతర కృషివలన మేలు పొందుతారు. స్త్రీలకు: సాహిత్యరంగాన మేలు, చక్కని అవకాశాలు. చివరి రెండు రోజులు ధనలబ్ధి.

★ **సింహం:** ఇంటా బయటా బాధ్యతలు అధిక మవుతాయి. ఒకానొక విషయంలో, తృప్తి కనిపించక యిబ్బంది పడుతారు. మీ మార్గానికి అడ్డువచ్చే వారుంటారు, గమనించి మెలగాలి స్త్రీలకు: వ్యాపారులకు, విద్యార్థులకు అనుకూలం.

★ **కన్య:** వివిధ రంగాలలో పని చేయు వారికి అనుకూలం. వ్యవహారరీత్యా మేలున్నదని గ్రహించాలి. స్త్రీల మూలమున తగాదా తంటాలు రాకుండా చూచుకోవాలి. అక్రమంగా తగాదాలు రాగలవేమో గమనించండి. స్త్రీలకు: ధనాదాయం వస్తు సేకరణకు అనుకూలం.

★ **తుల:** ఇంటా బయటా మి మాటకు విలువ పెరుగు తుంది. రాజకీయంగా అనుకూలత గల వారం. స్త్రీలతో తగాదాలు రాకుండా చూచుకోవాలి. వ్యవహారం సానుకూల మయ్యేదినం. స్త్రీలకు: పెద్దల సహాయం, రావలసిన డబ్బు అందటం విశేషం.

★ **వృశ్చికం:** వ్యవహారరీత్యా మేలుగాదు ఓటమిని తెలివిడి చేసే కాల్యం మనస్సు బాగా చికాకుగా ఉండే సమయం. కొందరు అనవసరంగా మాటపడ గలరేమో, గమనించండి. బంధువర్గాన తగాదాలు రాకుండా చూచుకోవాలి. స్త్రీలకు: వాహనయోగం, అప్రయత్న ధనలబ్ధి.

★ **ధనుస్సు:** దూర దేశాలకు పోగల అవకాశా లున్నాయి. వస్తు విక్రయమందు అనుకూల మున్నది. మీ మాటకు అనుకూలత చేకూరుతుంది. విద్యా సంస్థ లందు ఉద్యోగం చేసేవారికి అనుకూలం. స్త్రీలకు: సుఖ శాంతులు, ఆదాయం.

★ **మకరం:** ఉద్యోగరీత్యా ప్రమోషన్ చెప్పదగిన సమయం. వ్యవహార సంబంధంగా మీకు అనుకూలం. రాజకీయాలందు మీకు అనుకూలం. ఏది చేస్తే అనుకూలం కాదు? అని తెలిసి కొంటారు. సమయానికి డబ్బు అందుతుంది. స్త్రీలకు: అనుకూలం, శుభవార్తా శ్రవణం.

★ **కుంభం:** ఇరుగు పొరుగు తగాదాలతో జోక్యం చేసికోకండి. ఏదో ఆపద వెన్నాడే వారం స్థిర చరాస్తులందు వాదోపవాదా లుండగలవు కొందరకు వాహన సంపాదనకు అనుకూలం. విద్యార్థులకు పెంపు గలవారం. స్త్రీలకు: ఆదాయం, అనుకూలం, కళారంగాన పెంపు.

★ **మీనం:** ఆదాయ మున్నది అనుకూలత గల వారం. మీ మాటకు విలువ పెరుగుతుంది. ఉద్యోగంలో అనుకూల మార్పు సంభవం సుఖ శాంతులకు లోపం లేదు. అభిమానించే వారున్నారు. గ్రహిస్తారుగా! స్త్రీలకు: అనుకూల వార్తాశ్రవణం. ధనాదాయం.

– విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# వ్యక్తిగతం



1987 వింబుల్డన్ పోటీలు ప్రపంచ టెన్నిస్ చరిత్రలో ప్రముఖ స్థానాన్ని అలంకరిస్తాయి. సింగిల్స్ పోటీలలో పాట్రిక్ కాష్, మార్టినా నవ్రతి లోవా చరిత్రాత్మక విజయాలు సాధించారు. నూట ఒక్క సంవత్సరాలుగా జరుగుతున్న ఈ పోటీలలో 1950 నుంచి 71 దాకా ఆస్ట్రేలియా విజేతగా ఉంటూ ఉండేది. కాని 1971లో గెల్చిన జాన్ న్యూకోంబ్ తర్వాత మళ్ళీ విజయం ఆస్ట్రేలియన్ క్రీడాకారులను వరించలేదు. ఇప్పుడు 16 సంవత్సరాల తర్వాత అద్భుత విజయాన్ని సాధించి పాట్‌కాష్ ఆస్ట్రేలియా ప్రతిష్ఠను కాపాడారు. ఇవాన్ లెండిల్‌ను మూడు ఆటల లోనూ ఆయన ఓడించారు. 22 సంవత్సరాల వయసు గల కాష్ మెల్‌బోర్న్ నగరంలోని ఒక న్యాయవాది కుమారుడు. 19వ ఏటనే వింబుల్డన్ సెమిఫైనల్స్‌కు చేరినటువంటి కాష్ వీపు మీది గాయంతో కొంత కాలం పాటు టెన్నిస్‌కు దూరం కావలసి వచ్చింది కోలుకొని తిరిగి టెన్నిస్ కోర్టులో అడుగు పెట్టిన కాష్‌కు మళ్ళీ 1986 వింబుల్డన్‌కు కొద్ది రోజుల ముందే అపెండెక్టమి శస్త్ర చికిత్స జరిగింది. అయినా తర్వాత మూడు రోజులకే మళ్ళీ టెన్నిస్ రాకెట్ చేపట్టిన కాష్ ఆ సంవత్సరం వింబుల్డన్‌లో క్వార్టర్ ఫైనల్స్‌కు చేరుకున్నాడు. ఆ తర్వాత మోకాలు కీలులో శస్త్ర చికిత్స చేయించుకున్న కాష్ ఒకవైపు అనారోగ్యం మీద పోరాడుతూనే, వింబుల్డన్ విజేత కావాలనే దీక్షతో ముందుకు సాగాడు. చివరికి ఇవాన్ లెండిల్‌ను ఓడించడం ద్వారా, రెండు దశాబ్దాల పాటు పోగొట్టుకున్న స్థానాన్ని ఆస్ట్రేలియాకు తిరిగి సంపాదించి పెట్టడం ద్వారా, అనారోగ్య బాధితుడయి ఉంటూనే విజయం మీద విజయం సాధించడం ద్వారా పాట్ కాష్ చరిత్రను సృష్టించాడు. □



గతంలో అనేక విజయాలు సాధించి ప్రపంచ ప్రసిద్ధురాలైనటు వంటి మార్టినా నవ్రతి లోవా 1987 వింబుల్డన్ స్త్రీల సింగిల్స్ పోటీలలో సాధించిన విజయంతో అంతకు పూర్వం ఉన్న రికార్డులను అధిగమించింది. టెన్నిస్ క్రీడాంగణం మీదికి ఉద్ధృతంగా దూసుకు వచ్చిన పద్దెనిమిది సంవత్సరాల యువ క్రీడాకారిణి స్టెఫీ గ్రాఫ్ చేతుల్లో నవ్రతిలోవా పరాజయం చవిచూడ వలసి వస్తుందేమోననే సందేహాన్ని ఆమె పటాపంచలు చేసింది. ఈ గెలుపుతో ఆమె మొత్తం మీద ఎనిమిది సార్లు వింబుల్డన్ ఛాంపియన్‌గా గెలిచింది. ఈ ఎనిమిది విజయాలలో ఆరు వరుసగా సాధించినవి. □

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## మహిళా పాఠకులకి మరో కొత్త శీర్షిక!

# ఈ కాలం పెళ్ళిళ్ళు








మన సంస్కృతిలో వివాహానికి అత్యంత ప్రాముఖ్యం, ఎంతో పవిత్రత ఉన్నాయి. ప్రతి వ్యక్తి జీవితంలో పెళ్లి అన్నది అతి ముఖ్యమైన మలుపు. స్త్రీ పురుషుల జీవితాలలో అది ఒక మధురమైన దివ్యానుభూతి, నూరేళ్ల పంటగా నిలిచే పవిత్ర బంధం.

మారుతున్న నేటి సమాజంలో పెళ్లిళ్లు ఎలా జరుగుతున్నాయి? వివాహాల విషయంలో ఎలాంటి సమస్యలు ఎదురవుతున్నాయి? మొదలైన విషయాలని చర్చిస్తూ ఈ కింద పేర్కొన్న అంశాలపై లేదా వాటిలో కొన్నిటిని గురించి కానీ వ్యాసాలు రాసి పంపవచ్చును.

1 మారుతున్న సామాజిక పరిస్థితులు
2 విడాకులు పునర్ వివాహాలు
3 భార్యల సంపాదనలు ఉద్యోగాలు
4 కట్నం
5 సమిష్టి కుటుంబం
6 వివాహంలో వ్యభిచారం సెక్స్
7 కులాంతర వివాహాలు
8 వివిధ కులాలలో వివాహ వ్యవస్థ
9 మతాంతర వివాహాలు
10 ఇంకా రాబోయే మార్పులు
11 సినిమాల పత్రికల ప్రభావం
12 భర్తలని హింసించే భార్యలు







### నిబంధనలు :

* రచనలు ఆలోచనలని రేకెత్తించేట్లుగా ఉండాలి
* ఆడవారి రచనలకే ఎక్కువ ప్రధాన్యత ఉంటుంది
* రచనతో పాటు రాసినవారి ఫొటో పంపవచ్చు
* రచనలు కాగితానికి ఒక వైపే సిరా లేదా బాల్‌పెన్‌తో రాయాలి
* వ్యాసాలు రెండు అర తావు పేజీలకి మించకుండా ఉంటే మంచిది
* వ్రాత ప్రతి మీద వ్యాసం రాసిన వారి పేరు, పూర్తి చిరునామా ఉండాలి
* ప్రతి రచనతో ఈ పేజీలో ఇచ్చిన కూపన్ జతపరచి పంపాలి కూపన్ జత పరచకుండా పంపిన వ్యాసాలు పరిశీలింపబడవు
* ప్రచురించిన ప్రతి రచనకి రు 50/- పారితోషికం ఇస్తాము
* ప్రచురణకి స్వీకరించని వ్యాసాలని ఫొటోలని తిప్పి పంపగోరేవారు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవరు జతపరచి పంపాలి వాటి విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు
* ప్రచురణకి స్వీకరించిన రచనల విషయం ఆయా రచయిత్రులకి తెలియ చేయటం జరుగుతుంది
* పరిశీలనకి పంపే వ్యాసాలని ఈ కాలం పెళ్ళిళ్ళు" శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక గాంధీనగరం, విజయవాడ-520 003 అనే చిరునామాకి పంపాలి

–సంపాదకుడు

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## ఈ కాలం పెళ్ళిళ్ళు

పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

పిన్‌కోడ్

# [illegible]

రామమోహనరావు ఆ ఇంటి గుమ్మం వరకు వచ్చి రెండు నిముషాలు అచేతనంగా నిలుచుండి పోయాడు

గణపతిరావు, హెల్తు ఇనస్పెక్టరు అన్న నేమ్ బోర్డు వుంది

తలుపు తట్టడమా మానడమా అని మథన పడ్డాడు తన రాక వారికి ఆనందాన్ని కలిగిస్తుందా కోపాన్ని తెప్పిస్తుందా అన్న భావన లేదు తనను అవమానించి ,గెంటి వేస్తారేమో నన్న సంశయం లేకపోలేదు

అతనికి ఒక వంక బాధగా వుంది వేరొక వంక కర్తవ్యం గుర్తు కొస్తున్నది

ఇంత దూరం ఎందుకు వచ్చాడు?కలియకుండానే తిరిగి వెళ్ళి పోవడానికా?

సీత!

తను అగ్నిసాక్షిగా పెళ్ళాడిన అర్ధాంగి ఆమెను వదిలి వుండలేడనేది అతని బాధకాదు పాతిక సంవత్సరాల పాటు ఈ జీవితానికి అలవాటు పడ్డాడు అందులో మార్పు లేక పోతే బ్రతకలేనన్న బాధలేదు పెళ్ళి మూడు సంవత్సరాల కిందట జరిగినా ఒంటరిగానే వుంటున్నాడు జీవితంలో వెలితి లేదనికాదు అయినా ఆ వెలితిని చూసి అతను బాధపడడం లేదు

సీతను తల దన్నేవాళ్ళు కాక పోయినా ఆమెకు సరితూగ గలిగిన వాళ్ళు అతనికి దొరకరన్న చింతలేదు అప్పటికే ఆడపిల్లల తండ్రులు ముగ్గురు నలుగురు అతని చుట్టూ అతని తండ్రి చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నారు ఊ అంటే కన్యాదానం చేయడానికి సిద్ధంగా వున్నారు అందులో ఒకతను ప్లీడరు గుమస్తా క్షణంలో విడాకులు ఇప్పించే పూచీ తనదంటూ ముందుకు వచ్చాడు

కాని రామమోహనరావు దానికి అంగీకరించ లేక పోయాడు న్యాయాన్యాయాల గురించి ఆలోచించాడు

'న్యాయాన్యాయాల గురించి ఆలోచించ వలసింది మనం కాదు గణపతిరావుకి ఆ జ్ఞానం వుండాలి ఆడపిల్ల వాళ్ళకే అంత మొండి పట్టుదల అయితే మనం కాళ్ళ బేరానికి ఎందుకు వెళ్ళాలి? అంతకు మించిన తల వంపు లుంటుందా? ఇంకా నయం మనం కాబట్టి ఇంతకాలం ఆగేం దేనికేనా ఒక హద్దు వుంటుంది నా మాట విని నీవు వేరే పెళ్ళి చేసుకో విడాకులు దొరకవన్న భయంలేదు తండ్రి పదే పదే హిత బోధ చేయసాగాడు

అతనన్న దానిలో తప్పులేదు అతని ఆరాటం అతనిది

రామమోహన రావుకి పెళ్ళి నాటి సంగతులు గుర్తుకొచ్చాయి గుర్తుకి రావడమే కాదు వీడియో చిత్రంలా ఆనాటి సంఘటనలు కళ్ళకు కట్టాయి

అబ్బా! ఎంత పెడసరం! ఆడపెళ్ళి వారు అన్న భావనేనా లేకుండా స్థానబలం చూసుకొని ఎంత మొండిగా ప్రవర్తించారు?

అసలు తన తల్లిదేం తప్పువుందని? తోటలో దిగినప్పుడు చీరా పంచల చాపులూ ఇవ్వడం రివాజు కాదా? కన్యాదానం అప్పుడు వియ్యాల వారికి బట్టలు పెట్టరా? అప్పగింతల్లో పెళ్ళి కొడుకు తల్లికి తండ్రికీ చీరా పంచల చాపులు ఇవ్వడం అనవాయితీ కాదా? ఆ వేడుకలు తీర్చమంది అమ్మ

పట్టు బట్టలిమ్మని పట్టు బట్టలేదే? సాదా బట్టలైనా అనవాయితీగా ఇవ్వమంది అందుకు సీత తండ్రి హంగామా చేయాలా? కట్న కానుకల గురించి మాట్లాడు కున్నప్పుడు వీటి ప్రశక్తి రాలేదు తాను ఇస్తానని మాట ఇవ్వలేదు కాబట్టి ఇచ్చేది లేదు అన్నాడు

'ఈమాత్రం చదువు వెలిగించి చేస్తున్న వుద్యోగానికి నేను కాబట్టి పదివేలు కట్నం ఇస్తున్నాను మరెవరైనా అయిదు వేలు అయినా ఇవ్వరు' అంటూ దెప్పి పొడిచాడు నలుగురిలో ఎంత తలవంపులు కలిగించాయి నిజమే పదివేలు కావాలని తండ్రి అన్నాడు తన చదువు వుద్యోగం అతనికి నచ్చక పోతే ఈ సంబంధానికి ఎందుకు అంగీకరించాలి? అయిష్టమైన సంబంధం ఎందుకు చేసుకోవాలి?

రామమోహనరావుకి చెప్పలేనంత కోపం వచ్చింది నలుగురిలో అవమానించే అధికారం అతని కెవరిచ్చారు? ఆ పది వేలూ అతని మొహన పారేసి- మరో సంబంధం చేసుకోండి అని చక్కా వెళ్ళిపోవాలనిపించింది పాల పొంగులాంటి వయసు వాళ్ళతో మాటలు పడడానికా వచ్చారు తాము?

అలాంటి మొండి మనిషి కూతురే ఈమె ఆమె మెడలో తాళికట్టి తాను ఆమెను భరించ గలడా?

ఏడిదిలో అడుగు పెట్టిన దగ్గర నుంచి అవమానాలు చేయాలనే వాళ్ళు ప్రయత్నించారు వాళ్ళ పొగరుమోతు తనం క్షణ క్షణం బయట పడేది గదులు వూడిపించినట్టు లేవు పనివాళ్ళను పంపించండి అని కబురు పెడితే చీపురు కట్ట పంపించారు అపరాహ్ణం దాటి రెండు గంటలైనా భోజనాలకు పిలుపు రాలేదు. చంటి పిల్లలు శోషవచ్చి పడిపోయారు కొంచెం పాలూ మరో మారు కాఫీలు పంపించండి అని కబురు పెడితే, మీకు ఆరాఅరా పాలూ కాఫీలూ తాగే అలవాటుంటే హోటలు కెళ్ళి రండి అని సలహా ఇచ్చారు ఈ మర్యాదలకు ఒళ్ళు మండి పెళ్ళీ లేదూ గిళ్ళీలేదు వెనక్కు పోదాం పదండి అన్నారు కొందరు వాళ్ళ మాట సబబుగా వుందని పించింది రామమోహనరావుకి కాని అతని తల్లి అంగీకరించలేదు

వాళ్ళు నీచంగా ప్రవర్తిస్తున్నారు కదా అని మనం కూడా నీచంగా ప్రవర్తించాలా? అభం శుభం తెలియని ఆ పిల్ల చేసిన తప్పేమిటి? ఇలా పీటల మీద పెళ్ళి ఆగిపోతే ఆమె బ్రతుకు నాశనం అవదా? ఓ నాలుగు గంటలు మనవి కావనుకుంటే సరి ఆతరువాత ఆ పిల్లను తీసుకొని మనం మన దారిని పోతాం తగవులకు పట్టింపులకు ఇది సమయం కాదు అంది

అమ్మ దొడ్డ మనసుకి కొందరామెను శ్లాఘించారు

అయినా ఆమె ఆశించింది కాలేదు

గణపతిరావుగారికి మతే చలించిందో తాగిన మైకమో పిల్లను అత్తవారింటికి పంప డానికి అతను అంగీకరించలేదు

అల్లుడి జీతం అతని తిండికే చాలదు నా కూతురేం సుఖపడుతుంది వేరింట కాపురం పెడితే పంపిస్తాను అంతేకాని ఆ ఇంట్లో వంటలక్కగా వెట్టి చాకిరీ చేసే హీనస్థితి నా కూతురికి లేదు' అన్నాడు

వలుగుతూ అతనికి గడ్డి పెట్టారు అయినా తాపట్టిన కుందేటికి మూడే కాళ్ళు అన్న తన మంకుపట్టు విడువలేదు అతను

అప్పటి నుంచి సీత రాక కోసం నిరీక్షిస్తూ కాలం గడప సాగాడు మామగారికి పదేపదే వుత్తరాలు రాసాడు ప్రయోజనం మాత్రం శూన్యం

ఈలోగా తల్లి కాలధర్మం చెందింది

తండ్రి ఓరిమి నశించింది

బాబూ! వాళ్ళ పిల్ల సుఖపడడం వాళ్ళకే ఇష్టం లేనప్పుడు మనం చేసేది ఏముంది? తన కూతురికి మారు మనువు చేయాలనుకుంటున్నాడు కాబోలు నువ్వు మాత్రం ఎంత కాలం ఒంటరిగా వుంటావు? నా మాట విని విడాకులు తీసుకొని మళ్ళీ పెళ్ళి చేసుకో

నిజమే! తండ్రి బాధను అర్ధం చేసుకోగలడు సీత వస్తుందన్న ఆశ సన్నగిల్లింది తండ్రి మొండివాడైనంత మాత్రాన సీతకు పరిస్థితులు తెలియవా? పోనీ ఆమె తల్లి తనకేం పట్టనట్టుంటుందేం?

రామమోహనరావుకు ఏమీ పాలు పోలేదు

నాన్నా! మీరు అన్నది సందర్భంగానే వుంది అయితే సీత జీవితాన్ని నాశనం చేయలేను పెళ్ళి

అయి మొగుడి చేత పరిత్యజించ బడిన స్త్రీని లోకం ఎంత హీనంగా చూస్తుంది? ఆ తండ్రి తప్పులకు సీతకా శిక్ష అమ్మ మనసుకు శాంతి వుండదు చివరగా మరొకసారి ప్రయత్నిస్తాను ఈ పర్యాయం నేనే స్వయంగా వెళ్తాను సీతను నాతో పంపిస్తే సరేసరి లేదా అప్పుడు వాళ్ళతో తెగతెంపులు చేసుకుందాం

రామమోహనరావు ఆరోజే సీత తండ్రి గణపతిరావుగారికి ఉత్తరం రాసాడు

'నేను సోమవారం వస్తున్నాను మంగళవారం నాడు సీతను తీసుకు వెళ్తాను మీ ఏర్పాట్లు మీరు చేసుకుందికి గాను ముందుగా తెలియ జేస్తున్నాను"

ఉత్తరం పోష్టు చేసాడు కాని అతనికి అనుమానంగానే వుంది సీతను పంపిస్తారా? ఇంకా దుర్భాష లాడుతారా? తన ఉద్యోగంలో మార్పులేదు వేరింటి కాపురం పెట్ట బోవడం లేదు

రామమోహనరావు ఒక నిశ్చయానికి వచ్చాడు ఇంతదూరం వచ్చి తిరిగి వెళ్ళి పోవడం బావ్యం కాదు తన ఆలోచనే సవ్యంగా లేదేమో? వస్తున్నానని రాసి వెళ్ళక పోవడం పెద్దమనిషి తరహాకాదు ఇక అవమానిస్తారన్న బయమా?దూషణ భూషణలు శరీరానికే కాని ఆత్మకు కావు

తలుపు తట్టాడు

ఎవరు? లోపలి నుంచి ప్రశ్నించింది ఒక తీయని కంఠం

'నేను'

తలుపులు తెరుచు కున్నాయి

తన ఎదురుగా నిలుచున్నది తాను తాళి కట్టిన బార్య తన సీతే నని అతను గుర్తించ లేక పోయాడు సీత కూడా రామమోహనరావుని గుర్తించలేదు అది విడ్డూరం కాదు పరిస్థితుల ప్రబావం

గణపతిరావు గ్గారున్నారా? నేను రామమోహనరావుని భిలాయ్ నుంచి వచ్చాను అన్నాడు నేల వంక చూస్తూ

బెదిరిన లేడిలా లోనికి పరుగు తీసింది ఆమె

రామమోహనరావుకి అర్థం కాలేదు ఉన్నారని కాని లేరని కాని చెప్పలేదు లోనికి రమ్మన లేదు అయితే వాళ్ళకు ఇంకా తనను అవమానించాలనే వుంది కాబోలు అనుకున్నాడు

అమ్మా! అతనొచ్చారో!'

ఎవరో?

అతనేనే!




అతనే అంటే ఎలా అర్థమౌతుందే? పేరు వూరూ లేదా?

రామమోహనరావుకి వారి మాటలు వినిపిస్తున్నాయి

మీ అల్లుడు గారు అంది

ఏమిటీ తలుపు తీసింది తన బార్యేనా? తను గుర్తు పట్టలేక పోయాడు సీత తన ముందుకు వస్తుందని వూహించలేదు పాపం సిగ్గుతో జవాబు చెప్పకుండా వెళ్ళి పోయింది

ఏమిటీ ఈ వేళప్పుడొచ్చాడా? రైలు ఆరుగంటలకైతే అపరాత్రికా రాక?' అంటూ ఆమె బయట కొచ్చింది

రామమోహనరావు హృదయం బాధగా మూలిగింది తన తప్పేం వుంది రైళ్ళు సమయానికి రావడం విచిత్రం కాని లేటు అయితే అందులో

ఆశ్చర్యపడవలసింది ఏముంది? నిండా పది గంటలు కానిదే ఆమెకు అపరాత్రి అయిందా? నేరక వచ్చాడు తను

రా బాబు రా! బయటే నిల్చుండి పోవాలా?

రామమోహనరావు వచ్చి వసారాలో కుర్చీలో కూర్చున్నాడు

అంతా బాగున్నారా? మీ అమ్మగారు పోయారని విన్నాము "

రామమోహనరావు జవాబిచ్చి అత్తయ్యగారూ! రేపు పది గంటల బండికే మా ప్రయాణం మీకు నా ఉత్తరం అందే ఉంటుంది నేను సీతను తీసుకు వెళ్ళడానికి వచ్చాను

ఉత్తరానికేం అందింది అయినా ఇంత తొందరగా పంపడం ఎలా వీలవుతుంది?

తొందరా? మూడు సంవత్సరాలుగా ఎదురు చూస్తున్నాను చివరకు వారం రోజుల ముందు వుత్తరం రాశాను

రాశావు కాదనలేదు ఆడపిల్లను అత్తవారింటికి ఒట్టి చేతులతో ఎలా పంపుతాం? దానికి వ్యవధి కావాలిగా?

అత్తయ్యగారూ! నేనేం పెట్టుపోతలు ఆశించి రాలేదు మీకు అమ్మాయిని పంపించడం సమ్మతమో కాదో చెప్పండి

పిల్లనిచ్చుకున్న తరువాత తప్పుతుందా బాబూ! రేపా విషయాలు ఆలోచించుకోవచ్చు నువ్వు కాస్త విశ్రాంతి తీసుకో నీ బోజనం సంగతి చూడాలిగా

అబ్బే ఆ శ్రమ అనవసరం

ఏం బాబూ! అత్తవారింట్లో అన్నం మెతుకులకు కూడా దొరకలేదని మామీద అబాండాలు వేయడానికా? ఇప్పుడు పంచబక్ష్య పరమాన్నాలు వండి పెట్టలేను కాని ఏదో ఇంత వుడికిస్తాను తిని నిద్రపో

అదేంకాదు నేను హోటల్లో భోజనం చేసి వస్తున్నాను ఇంత రాత్రి మిమ్మల్ని ఎందుకు

# నింగి నేలకు దిగింది

ఇబ్బంది పెట్టడం అని అన్నాడు రామమోహనరావు

ఆమె అక్కడే పక్క వేసింది

నా ప్రశ్నకు జవాబు చెప్పలేదు "

జవాబు చెప్పడానికేం వుంది తెల్లవారిన తరువాత మీ మామయ్యనే అడుగు ఆడవాళ్ళం మా మాటకు విలువెక్కడ? అంది

మర్నాడు వుదయం కాఫీ తాగుతూ తిరిగి భార్యను పంపించే విషయం అత్తగారితో ప్రస్తావించాడు రామమోహనరావు అప్పుడు ఎనిమిది గంటలవ వస్తున్నది

బాగుంది బాబూ నీ వ్యవహారం పీకల మీద కూర్చుని తేల్చి చెప్పమంటే ఎలా? అమ్మాయికి పెళ్ళి చేసింది మా ఇంట్లో వుంచుకోడానికా? మీ మామయ్యగారు అర్జంటు పనిమీద టూరు మీద వెళ్ళారు నీతో మాట్లాడాలని అనుకున్నారు కాని నువ్వు అప్పుడు గాఢ నిద్రలో వున్నావు సాయంత్రం వరకూ ఆగు బాబు వారు రాగానే మీ ప్రయాణానికి ఏర్పాటు చేస్తారు

అత్తయ్యగారూ! అది వీలయ్యేది కాదు అందుకే ముందుగా ఉత్తరం రాసాను

"ఒప్పుకుంటున్నాను నిర్ణయమైనా తీసుకొనే అదికారం మా ఆడవాళ్ళ కెక్కడ ఏడ్చింది మీ మామగారు లేరు ఒక్క రోజు వుంటే ఆకాశం విరిగి పడుతుందా? మీ అత్తగారి యింటిలో బోజనం చేయకూడదని ఒట్టు వేసుకున్నావా? అత్తగారి యింటిలో అల్లుడికి భోజనమైనా పెట్టలేదు అన్న చెడ్డ పేరు మాకు తేవాలనుకుంటున్నావా? రాత్రి భోజనమయినా చేయకుండా పడుకున్నావు ఇప్పుడు వెళ్ళిపోవాలంటూ పీకల మీద కూర్చున్నావు

అత్తయ్యగారు! మీరు పొరబాటుగా అర్థం చేసుకొంటున్నారు నేను చేస్తున్నది చిన్న ఉద్యోగం మామయ్యగారిలా ప్రతిష్ఠ కలది గాదు శెలవు పొడిగించుతే ఆ వుద్యోగానికే ముప్పు వస్తుంది నాకు మీరే సత్కారాలూ చేయనవసరం లేదు పెట్టుపోతలూ అక్కరలేదు నా కర్తవ్యం నన్నిక్కడకు రప్పించింది చెప్పండి సీతను నాతో పంపించడం ఇష్టంలేదా? లేదా సీతకే నాతో రావడం ఇష్టంలేదా?

ఆమె ఎటూ చెప్పలేకపోయింది ఆమె అడకత్తెరలో పోక చెక్కలాగయింది అటు బర్త అంక్షలు ఇటు అల్లుడి బల్వాకం పట్టు

రైలుకి వేళ అవుతున్నది నేను వస్తాను రామమోహనరావు కుర్చీలోంచి లేచాడు

ఆగండి, నేనూ వస్తున్నాను అంది సీత

ఆమె ఆశ్చర్యపోయింది సీతా! నాన్నగారు

అమ్మా! నేనేమీ అర్థం చేసుకోలేని చిన్న పిల్లను కాను పంతాలకు పోయి నా పచ్చని సంసారంలో చిచ్చుపెట్టుకోలేను

అమ్మా! నిన్నిలా కట్టు బట్టలతో పంపించేయడం మాకు తలవంపులు కా ్ి నాన్నగారికి నేనేం జవాబు చెప్పను?

అమ్మా! అతను ఏమీ ఆశించడంలేదే! మధ్యను నీకెందుకు వ్యధ? నాన్నగారికి నిజంగానే అర్జంటు పని వుందనే వెళ్ళిపోయారా? అల్లుడి మీద నిరసన కాదూ? ఇప్పుడు చెప్పు నాన్నగారు ఆ టూరు మీద వెళ్ళకపోతే ఆకాశం విరిగిపడుతుందా? నేను వినలేదనుకోకు అల్లుడికి ఎలాంటి ఆతిద్యాలూ చెయ్యాల్సిన అవసరం లేదంటూ ఆర్డరు వేసారే సారె సామానులు కావాలంటాడో తిరుగు రైలు ఛార్జీలు కావాలంటాడో? మనం అనుకున్నవి పెళ్ళిలోనే ఇచ్చాం ఇంక వేరే ఇచ్చేది లేదు అన్నారు నాన్నగారు మొండి పట్టుదల ప్రదర్శించుతున్నారు అతని స్వబావం నాకు తెలుసు అయినా కన్నతల్లివి నీకూ నా మీద అబిమానం లేదా? పెళ్ళిలోనైనా వాళ్ళు ఏం అడగరానివి అడిగారని, మీరు నా జీవితాన్ని నాశనం చేయాలనుకుంటున్నారు నిజమే ఆయన కంటే నేను ఎక్కువ చదువుకున్నాను నా కాళ్ళ మీద నేను నిలబడగలను అయితే అది జీవితానికి నిండుతనాన్ని ఇస్తుందా? వివాహమైనా ఇలా కన్యగానే జీవితాంతం వుండిపోమంటావా? ఆకాశానికి ఎగిరే అవకాశం మనకు లేదు నింగే నేలకు దిగి వచ్చినా అందుకోవక పోవటం, చేరుకోవక పోవటం మూర్ఖత్వం కాదా? మీరింతగా వారినిఅవమానించినా నిండు మనసుతో నన్ను పిలుచుకుపోవడానికి వచ్చిన ఆయన ఔన్నత్యాన్ని ఇప్పటికైనా మీరు అర్థం చేసుకోలేకపోయినా నేను అర్థంచేసుకోగలను మనం అతని స్థాయికి ఎదగలేకపోయాం అతనే దిగివచ్చారు అలాంటి బర్తను నేను ఎలా వదులుకోగలను? నాన్న వస్తే చెప్పు మీ కూతురు కట్టు బట్టలతో వెళ్ళిపోయిందని అంటూ సీత భర్త చెయ్యి అందుకుని బయటకొచ్చి రిక్షా పిలిచింది

కట్టు బట్టలతో వెళ్ళిపోతున్న కూతుర్ని చూసి ఆమె కళ్ళలో నీళ్ళు నిండుకున్నాయి. □

సుప్రసిద్ధ రచయిత్రి

శ్రీమతి రావినూతల సువర్ణాకన్నన్

కొత్త సీరియల్ నవల

## మంజీర నాదం

త్వరలో ప్రారంభం!

# ప్రేమసాగరమథనం

డాక్టర్ కొత్త రవీంద్రబాబు



(గత సంచిక తరువాయి)

"మేడ ముందున్న సందునిండా నామనుష్యులున్నారు! నువ్విక తప్పించుకొనే వీలే లేదు" అన్నాడు నాగరాజు మళ్ళీ.

విలాసిని మీదనే అతను కాన్సెన్ట్రేట్ చేసి వుండడం వల్ల క్రీనీడలో వున్న దీప్‌ను చూడలేదతను!

"ఫట్" మని నాగరాజు కుడి దవడమీద దీప్ యిచ్చిన పంచ్‌తో అతను కుప్పకూలి పోయాడు.

"రా విలూ! ఇక్కడో క్షణం ఆగకూడదు" అంటూ ఆమె చేయి పుచ్చుకుని ముందుకు పరిగెత్తాడు దీప్.

డీజెల్ పోయించుకు తిరిగి వస్తున్న టాక్సీని సందు చివర రోడ్డు మీద ఆపాడు శివ.

"సార్! మీరు అమ్మాయి గారూ యిందులో ఎక్కి వెళ్ళండి" అన్నాడతను. "శివా వస్తా!" అంటూ జేబులోంచి వందనోట్లు తీసి అతని చేతిలో పెట్టాడు. టాక్సీలో ఎక్కి "రైలు స్టేషన్‌కు పోనీయ్" అన్నాడు దీప్.

పది నిముషాలలో టాక్సీ స్టేషన్ ముందాగింది. టాక్సీ దిగి విలాసినితో పాటు ముందుకు నడుస్తూ "విలూ! నాకు స్టేషన్ కొత్త! నువ్వు ముందు నడువు మద్రాస్ వెళ్ళే రైలు ఎక్కి వెళ్ళి పోదాం!" అన్నాడు దీప్. మద్రాస్ వెళ్ళే సర్కారు ఎక్స్‌ప్రెస్ ప్లాట్ ఫాం మీద వున్నది అని ఎనౌన్స్‌మెంట్ వింటూ అలాఅన్నాడతను.

"మరి టికెట్?" అంది విలాసిని.

"ట్రైన్‌లో ఎక్కిన తర్వాత టి టి తో చెప్పి రాయించుకుందాం! ఇక్కడ వుండడం మంచిది కాదు" అన్నాడు దీప్.

టైగర్ కోటి లిద్దరూ బాహాబాహి, ముష్టాముష్టి, కచాకచి యుద్ధం చేస్తూ వుంటే దగ్గరగా వాళ్ళను చూద్దామని గేటు ముందుకు అడుగు వేసాడు చలమయ్య.

కోటి అనుచరుడు విసిరిన సోడా రోడ్డు మీద పడి పేలి ఆ ముక్కలు వచ్చి చలమయ్య ముఖంలో దిగబడ్డాయి.

జరిగిన కథ -7 : నారాయణరావు చివరి కోరికపై సందీప్ విజయవాడ వస్తాడు. విలాసిని గురించి, ఆమెను వేధిస్తున్న నాగరాజు గురించి తెలుసుకుంటాడు. తాను తెచ్చిన ఎనిమిది లక్షల రూపాయలు విలాసిని ఖాతాలో జమ చేస్తాడు. తన ముతాస్వావరంపై దాడి జరగడంతో సన్నీకీ, విలాసినికీ సంబంధం ఉందని నాగరాజు అనుమానిస్తాడు. సన్నీ కుడి భుజమైన సాంబ్శును చంపేయిస్తాడు. విలాసిని ద్వారా తమ పగలు తీర్చుకునేందుకు ఇద్దరి కిరాయి మనుషులు విలాసిని ఇంటి ముందు ఎదురుపడి ఘర్షణలోకి దిగుతారు. విలాసిని, సందీప్ బైట పడతారు.

"బాబోయ్! దేముడోయ్!" అంటూ చలమయ్య పెట్టిన కేకలు విని సందులోని ఇళ్ళల్లో వాళ్ళు బయటకు వచ్చారు. రణరంగంలా మారివున్న ప్రదేశాన్ని చూసి భయంతో మళ్ళీ లోపలకు వెళ్ళారు. చలమయ్య యింటి పక్కన అతను పోలీసులకు ఫోను చేసాడు. నిముషాలలో పోలీస్ జీప్ సందులోకి ప్రవేశించడం కోటి టైగర్ తమ అనుచరులతో సహా చలమయ్యను పడదోసుకుని మేడ వెనుకనున్న సందులోకి పరుగెత్తుకు వెళ్ళడం జరిగింది.

మేడ వెనక సందు మొగదలన మూల్గుతూ నిలబడ్డ నాగరాజును తనతో పాటు తీసుకుని పారి పోయాడు కోటి.

వళ్ళంతా గాయాలతో భీతిల్లి పోయి అరుస్తున్న చలమయ్యను పోలీసులు చుట్టుముట్టి అదేపనిగా ప్రశ్నల వర్షం కురిపించ సాగారు.

వంటినిండా గాయాలతో భీతిల్లి పోయిన మనసుతో గజ గజ వణకుతున్న చలమయ్య సమాధానంగా బావురుమని ఏడ్చాడు!

అతనిలో కరడు గట్టిన వాయిరిజం అనే బలహీనత కరగి కన్నీరై ప్రవహించినట్లు అనిపించిందాక్షణాన!

కాళీగావున్న సర్కార్ ఎక్స్‌ప్రెస్ ఫస్ట్ క్లాస్ కంపార్ట్‌మెంట్ కూపేలో కూర్చున్నారు దీప్, విలాసిని! దీప్ అంతకు ముందే టి టి తో మాట్లాడి డబ్బులిచ్చి టికెట్ వ్రాయించుకుని వచ్చాడు. విలాసిని కోసం నాగరాజే కాకుండా, సన్నీ కూడా కిరాయి గూండాలను పంపాడని అర్థం అయిన దగ్గర్నుండి దీప్‌కు విలాసిని విజయవాడలో వుంటే అత్యంత విపత్కర పరిస్థితులను ఎదుర్కొన వలసి వస్తుందని అర్థం అయింది.

కూపేలో నుండి ఏ పరిస్థితులలోనూ బయటకు రావద్దని విలాసినితో చెప్పాడు దీప్! కూపే కిటికీ తలుపులు వేసి డోర్ దగ్గరకు లాగి లోపల గడివేసి కూర్చున్నారిద్దరూ.

ఉదయం నుండి జరుగుతున్న సంఘటనలతో మనసులో దడపుట్టి భీతావహయై తల్లడిల్లి పోసాగింది విలాసిని!

కట్టుబట్టలతో విలాసిని తనూ యిలా అర్ధాంతరంగా విజయవాడ వదలి వెళ్ళవలసి వచ్చిన పరిస్థితి గూర్చి మనసులో బేరీజు వేసుకోసాగాడు దీప్. జేబులో నాలుగు వేల రూపాయలు వున్నాయి. చెక్‌బుక్ వుంది బాంక్ కార్డ్‌వుంది. మద్రాస్‌లో దీప్ ఎంటర్ ప్రైజెస్ బ్రాంచి ఆఫీస్ వుంది! బ్రాంచి ఆఫీస్‌కు వెళ్ళి కావలసినంత డబ్బు తీసుకోవచ్చు! డబ్బు ప్రశ్న ఉత్పన్నం కాదని తెలుసుకున్నాక దీప్ మనసు కుదుట పడింది!

ఎదుటి బెర్తు మీద కూర్చున్న విలాసిని వంక చూసాడు దీప్. మాసి పోయిన పాత చీరె కట్టుకుని వున్నది వున్నట్లుగా వచ్చేసింది విలాసిని!

"ఈమె జీవితం యిప్పటి వరకూ అంధకార బంధురంగా నడిచింది. అందుకు కొంతగాక పోతే కొంతైనా డాడీ బాధ్యత వున్నది. డాడీ అకాల మరణంతో ఆ బాధ్యత నా మీద పడింది.

కేవలం ఆర్థికంగా యీమెను దుస్థితి నుండి కాపాడినందు వలన నా బాధ్యత తీరిపోదు!

ఈమె శరీరం లోను నా శరీరం లోను ప్రవహించే రక్తం వొక్కటే!

ఈమె భవిష్యజ్జీవితంలో వెలుగు పూలు పూయించి వెన్నెల మయం చేయించాలి!

భయంకరులైన ఇద్దరు రౌడీలు వాళ్ళ ముఠాలతో యీమెను వెంటాడి వేధించటానికి సిద్ధంగా వున్నారు! నా సర్వ శక్తి యుక్తులూ వొడ్డి యీమెను కాపాడి తీరుతాను అని వివేకం అతని మనసులో ఆలోచనలు రేపు తున్నది!

కాని మనసు అడుగు పొరలలో "దివ్య మంగళ రూప అయిన ఈ అందాల సుందరి మనసులోని దిగులు పోగొట్టి జాజ్వల్య మానంగా వెలిగే ఆమె మనోజ్ఞ రూపాన్ని దర్శించాలి! మెరుగు పెట్టిన బంగారంలా వెలుగొందే యీమెను నా జీవిత భాగస్వామినిగా చేసుకోవాలి! పంకిలమయమైన కాసారంలో జనించిన తామర పువ్వులాటి యీ దివ్యరూపిణిని వివాహమాడి ఆమెను సముచిత స్థానంలో సుప్రతిష్ఠితం చేయాలి! అంతః చేతనలోని ఆలోచనలు బయలు దేరి మనసును శరీరాన్ని రంజింప జేస్తున్నాయి

తలుపు మీద టకటకమని శబ్దం వినపడటంతో దీప్ ఆలోచనలు చెదరి పోయాయి

విలూ! నువ్వు తల అటువైపుకు తిప్పి బెర్త్ మీద పడుకో! తలుపు తెరిచినప్పుడు చూచే వాళ్ళకు నీ ముఖం కనుపించకూడదు! అన్నాడు దీప్

విలాసిని బెర్త్ మీద ముడుచుకుని పడుకోగానే వెళ్ళి తలుపు వోరగా తీసాడు!

ఎదురుగా బేరర్ నుల్చుని వున్నాడు

సార్! మీల్స్ కావాలా?" అని అడిగాడు

యస్! అని దీప్ అనగానే

"వెజిటేరియన్ కావాలా? నాన్ వెజిటేరియన్ కావాలా!

"వెజిటేరియన్" అని దీప్ చెప్పగానే వెళ్ళిపోయాడు బేరర్

కూపే తలుపులు మూసి గడియ వేసి లోపల బెర్త్ మీద కూర్చున్నాడు దీప్

ఇవతలకు తిరిగి పడుకుని అతని వంక చూడసాగింది విలాసిని

అంధకార బంధురమైన నా జీవితంలో వెలుగు కిరణాలను ప్రసరింపజేస్తున్న యీ దీప్ ఎవరో? రెండు రోజుల పరిచయంతో ఇతని వెంట పడి కట్టుబట్టలతో వెళ్ళిపోతున్నాను!

కాని దీప్ అపరిచితుడు అని అనిపించటం లేదు! ఏదో జన్మాంతర బంధం, అనిర్వచనీయ సుహృద్భావ బంధం, మాటలకందని ప్రేమ బంధం మమ్మల్నిద్దర్నీ దగ్గరకు జేర్చి నట్టు కనపడుతున్నది



## ప్రేమసాగర మథనం

ఊహకందని ప్రణయరాగం మమ్మల్నిద్దర్నీ ముంచెత్తి తనువులు పులకింప జేస్తున్నది!

వాస్తవ దృష్టితో పరికించినా విజయవాడలో నాకు మిగిలి వున్నదేమిటి?

డబ్బు సంపాదనే గాని నా వూసుపట్టించుకోని నాన్న, కసాయి మెడ నరక బోయే ముందు బయపెడుతున్నట్లు బెదిరించే పిన్ని మాకో అక్క వున్నదన్న విషయం మర్చిపోయి ప్రవర్తించే తమ్ముళ్ళు, పిచ్చి మాలోకం చెల్లెలు బుసలు పెడుతూ కాటు వేయటానికి ప్రయత్నిస్తున్న నాగరాజు– అందరూ వున్నారు! కాని 'నా అని అనుకోవటానికి మాత్రం ఎవరూ లేరు!

లాటరీలో ఎనిమిది లక్షలు రావటం నా పాలిటి శాపంగా మారింది నిర్భాగ్యురాలైన విలాసినిని గాబట్టి యిన్నాళ్ళు నాగరాజు నాజోలి ఎక్కువగా పట్టించు కోలేదు లక్షల బాంక్ బాలెన్స్ వున్న విలాసినిని నాగరాజు వదలి పెట్టడు

బలవంతంగా నన్ను వివాహం చేసుకుని తన జనానాలోకి జేర్చుకుని బాంక్‌లో డబ్బుకాజేసిందాకా నిద్రపోడతను

అతనికి సన్నీకి వున్న కక్షలతో సన్నీ నా మీద కన్ను వేసి నన్ను ఎత్తుకు పోవాలని చూస్తున్నాడు

ఒక వైపు నాగుబాము! ఒక వైపు పెద్దపులి! మరో వైపు పుట్టిల్లు అనే కందిరీగలపుట్ట!

ఇంక విజయవాడలో వుండి అవమానాల పాలై ఆపదలలో చిక్కుకోవడం కన్న తెలివి తక్కువ మరొకటుండదు!

దీప్‌ను చూస్తుంటే నేను పుట్టగానే మరణించిన అమ్మ ఫొటో చూచినట్లు అనిపిస్తున్నదెందుకో?

అమ్మ ఫొటో! అటక మీద దుమ్ము కొట్టుకుని పడి వున్న అమ్మ ఫొటో! అదృష్ట వశాత్తు తను బూజు దులుపుతూ చూసింది! చూచి అది అమ్మ ఫొటో అని తెలియగానే సంతోషంతో దుమ్ము దులిపి తన గదిలోకి తెచ్చుకుంది!

కాని అమ్మ ఫొటో చూసిన పిన్ని రాక్షసిలా విరుచుకు పడింది!

ఫ్రేము విరుగ కొట్టి ఫొటో ముక్కలుగా చింపి వేసింది కాని నా మనసులో అమ్మ రూపం సుప్రతిష్ఠితమై పోయిందని పిన్నికి తెలియదు పాపం!

అప్పట్నుంచే ఏ కష్టాలు వచ్చి నా మనసులోని అమ్మతో మొర పెట్టుకోవటం అలవాటయి పోయింది

దిగులుగా వున్నప్పుడు అమ్మ వూరుకో తల్లీ అని వూరడించినట్లు అనిపించేది!

నాగరాజు బారి నుండి రక్షించిన దీప్‌ను చూడగానే అమ్మను చూచినట్లనిపించింది!

నిర్మలంగా శాంతంగా ప్రేమామృతం వర్షించే ఆ కళ్ళల్లోకి చూస్తుంటే దివ్య లోకాలలోకి వెళ్ళిన అమ్మ కళ్ళల్లోకి చూస్తున్నట్లే అనిపిస్తోంది!

ఆపదల నుండి రక్షించిన వాడు అమ్మ పంపిన వాడు అయిన దీప్ వెంట వెళ్ళటానికి ఎందుకు సందేహించాలి? లేచి కూర్చుంది విలాసిని

కుదుపు యిచ్చి కదిలింది రైలు! వులికి పాటుతో దీప్ వక్షస్థలం మీద పడింది విలాసిని తల

ఆలోచనలతో నిండి వున్న విలాసిని మనస్సులో ఒక్కసారి జల్లుమని తీవ్ర బయంతో శరీరం కంపింప సాగింది

గుండెల మీద వాలిన విలూ తలను నిమురుతూ బయపడకు విలూ! నిన్నిక యీ ప్రపంచంలో ఏ శక్తీ బాదించలేదు! అంటున్న దీప్ మాటలకు విలూ కనులనుండి కట్టలు తెంచుకున్న నదీ ప్రవాహంలా కన్నీరు కారసాగింది

దీప్! నేను విజయవాడ తిరిగి వచ్చే అవకాశం లేదు!

ఎందుకని విలూ?

నిన్న నాకు లాటరీలో ప్రైజ్ వచ్చి బాంక్‌లో ఎనిమిది లక్షలు లాటరీ ఏజంట్ జమ చేసాడట! ఇవ్వాళ తెల్లవారు జామున నాగరాజు గోడౌన్ మీద రెయిడ్ జరిగింది!

•

# రచయిత జవాబులు



సి హెచ్ ఇంద్రాణి, కుంచనపల్లి

ప్ర హీరో హీరోయిన్ లేక పోతే కథ సాగదా? సందీప్ కరాటే ఫైటర్ కాదుగదా? మానవత్వం గూర్చి రచయితలు రాయరెందుకు? నవలల వలన యువత చెడుదారి పడుతుందా?

జ హీరో హీరోయిన్లు లేని కథలు బహు అరుదు! సందీప్‌కు కరాటే రాదని మీతో చెప్పాడా? మానవత్వం గూర్చి కూడా రాస్తారు రచయితలు– అవి మీరు చదివి గ్రహించాలి– ఇదిగో యిక్కడ యీ విషయం గూర్చి రాస్తున్నాను అని ఎనౌన్సు చేసి రాయరుగదా? నవలలు చదివి చెడుదారిన పడటం ఎందుకు? దేనిలో నైనా (ఏ నవలలో నైనా) మంచిని మాత్రమే ఎంచుకుంటే ఏ ప్రమాదం వుండదు

ఏ అప్పలకొండ, బోగాపురం

ప్ర మనిషికి మహిమలుంటే?

జ కోరికల మీద స్వారి చేస్తాడు

ప్ర జీవితానికి అర్థం?

జ ఇతరులకు అనర్థం కల్గించక పోవటం

ప్ర నేటి సమస్యలకు రచయితలు, సినిమాలు కారణమా?

జ కాదు!

చంద్రశేఖరరెడ్డి, కుంచనపల్లి

ప్ర కథ బాగుండాలంటే శైలి బాగుండాలా రచయితకు పేరుండాలా?

జ పేరున్న రచయితల నవలలన్నీ బాగుండవు! నవల బాగుంటేనే రచయితకు పేరొస్తుంది

కె సుజన, సత్తుపల్లి

ప్ర ఒకప్పుడు ప్రజలకొరకు సాహిత్యం యిప్పుడు డబ్బుకోసం

జ రచయిత జీవించివుండాలంటే డబ్బు కావాలి మరి!

ఎ నాగేశ్వరరావు, కోటనందూరు

ప్ర ప్రస్తుతం రచనలలో హింస సెక్సు ఎక్కువగా వుంటున్నది

జ యధాప్రజా తథా రచన!

పి శ్రీరామమూర్తి గుంటూరు

ప్ర రచయితల ముఖాముఖి పై మీ అభిప్రాయం?

జ పాఠకుల మనసు రచయితలకు తెలుస్తుంది! రచయిత వ్యక్తిత్వం పాఠకులకు అర్థం అవుతుంది

కారంచేడు బుచ్చిపార్థసారధి, మహబూబ్‌నగర్

ప్ర సాహిత్యం సంతృప్తికోసమా సాహితీ సేవా లేక పాఠకుల ఆనందంకోసమా'

జ అన్నీనూ!

## ఉత్తమ ప్రశ్న

కాజ హనిత, ఏలూరు

ప్ర సాహిత్యంలో, చిత్రాలలో అశ్లీలత ఎక్కువవుతుంది వర్థమాన రచయిత్రులకు మీ సలహా ఏమిటి?

జ అశ్లీలత ఎక్కువయి వెగటుపుట్టి చివరకు కొంతకాలానికి తగ్గిపోతుంది! 17, 18 శతాబ్దాలలో మన ఆంధ్రదేశంలోను బ్రిటన్‌లోనూ కూడా సాహిత్యంలో అశ్లీలత ఎక్కువయి చివరకు మొఖం మొత్తి 19వ శతాబ్దంలో అందుకు పూర్తి విరుద్ధంగా వుండే సాహిత్యం వచ్చింది!

నిరంతర శ్రమ, అనునిత్య శోధన, ఆత్మవిమర్శ, సదా రచనలలో లోటుపాట్లు గమనించుకుంటూ ధైర్యంగా ముందుకు సాగి పోయే ఓర్పు, నేర్పు, కుతూహలం– ఇవి వున్న రచయితలు తప్పక పేరు తెచ్చుకుంటారు

ఎ ఎల్ సువర్చల, బాపట్ల

ప్ర సాహిత్యంలో వస్తున్న మార్పులు మీలో ఎలాటి భావాలను కలుగజేస్తున్నాయి!

జ స్పీడు పెరిగింది, వేగవంతమయిన మలుపులు మెలోడ్రామా, ఎక్కువవుతున్నవి సెంటిమెంటు, సున్నిత భావాలు వెనక్కు 'వెళ్ళి పోతున్నవి చూస్తున్నా. !

యన్ రవి, సత్తుపల్లి

ప్ర ఒకో యువతి కన్నవారిని వదలి ప్రేమించిన వాడితో వెళ్తుందెందుకు?

జ ప్రేమ గుడ్డిదన్నారు!

టి శశిధర్‌కుమార్, తిరువూరు

ప్ర సెన్సేషనల్ సబ్జక్ట్ పై నవల వ్రాయండి చిరునామా యివ్వండి

జ అలాగే డా కె రవీంద్రబాబు, తెనాలి వంటేరు విజయ బ్రాహ్మణక్రాక, నెల్లూరు

ప్ర మీ శైలి మారింది

జ ఎంచుకున్న వస్తువును బట్టి శైలి మారుతుంది!

కె శ్రీనివాసులు, ఎమ్మిగనూరు

ప్ర స్త్రీ స్వేచ్ఛ, స్త్రీ స్వాతంత్ర్యము పై మీ అభిప్రాయం

జ స్త్రీకి స్వేచ్ఛ ఆర్థిక స్వాతంత్ర్యమూ వుండాలి

గొడవర్తి హరిప్రసాద్‌రాజు, ఖోర్ధన్

ప్ర డాక్టరుగా రైటర్‌గా డబుల్ యాక్షన్ చేస్తున్నారు

జ ప్రఖ్యాత డాక్టరు రచయితలు ఎందరో గతంలో వుండేవారు– ఇప్పుడూ వున్నారు

వి కృష్ణవేణి నంద్యాల

ప్ర సందీప్ ఒక్కడే నలుగురు రౌడీలను ఎలా చితక బాదాడు?! విలాసిని యింటి వోనర్ ప్రవర్తన అర్థం కావడం లేదు!

జ ప్రేమించిన పడతి అవమానాల పాలవుతున్నప్పుడు యువరక్తం ఉద్రేక పడటం అతి సహజం! అందుకు భిన్నంగా ప్రవర్తించటం అసహజం కల్పనా సాహిత్యం చదువుతున్నప్పుడు యిలాటి ప్రశ్నలు తడుతుంటాయి కొందరకు! విలాసిని యింటి వోనర్ ప్రవర్తన ముందుముందు అర్థం అవుతుంది □

---

నాగరాజు అపో నెంట్ సన్నీకి అతని రహస్యాలు అంద జేసి అతని వద్ద డబ్బుచ్చుకున్నానని నాగరాజు అనుమాన పడుతున్నాడని మా చెల్లెలు రాసి చెప్పింది

సన్నీ పాపు నాగరాజు నాశనం చేసాడు నాగరాజు మీద పగ తీర్చుకోవటానికి నన్ను టార్గెట్‌గా చేసుకున్నాడు సన్నీ!

ఇద్దరి కిద్దరూ దుర్మార్గులే!

ఈ పరిస్థితులలో విజయవాడలో వుండటం అసంభవం! పుట్టి పెరిగిన ప్రదేశం వదలి వెళ్తున్నా నని ఏడుపు వచ్చింది!

ఇప్పట్లో తిరిగి రాలేనని అనుకుంటుంటే ఏడుపు మరీ ఎక్కువైంది!

విలా! ఈ సువిశాల భారత దేశంలో నీకు నిలువ నీడ దొరకదా? పీడ కలల లాటి జ్ఞాపకాల గుర్తులు తప్ప మరేమీ యివ్వని విజయవాడ తిరిగి రావటం ఎందుకు?

దీప్! పుట్టిన కొద్ది రోజులకే కన్న తల్లిని పోగొట్టుకున్నాను! ఇప్పుడు జన్మస్థలాన్ని వదలి వెళ్తున్నానని విచారం కల్గింది!

విలా! నీ అంతట నువ్వు విజయవాడ వదలి వెళ్ళటం లేదు! దుర్మార్గులు కొందరు నువ్వు విజయవాడ వదలి వెళ్ళేలా పరిస్థితులు కలుగ జేసారు అంటూ తన వక్షస్థలం పై తల అనించిన విలాసిని వీపు పై నెమ్మదిగా తడుతూ ఆమెకు ధైర్యం చెప్ప సాగాడు దీప్!

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

స్టేక్‌కు వెయ్యిరూపాయల పందెంతో పేకాట ఆడుతున్న రాఘవరావు




వి యస్ – తుని

నాకు నడుము నెప్పి, తల నెప్పి, మోకాళ్ళ నెప్పులు వున్నవి జీర్ణశక్తి వున్నది కాని మలవిసర్జన సక్రమంగా వుండదు గట్టిగా చిన్న చిన్న వుండలుగా వస్తుంది కడుపులో మంట నెప్పి వస్తూ వుంటుంది

మలబద్ధకం వల్ల పై లక్షణాలన్నీ ఏర్పడే అవకాశం వున్నది ఆహారంలో ఆకుకూరలు ఎక్కువగా వాడవలసి వున్నది నీరు అధికంగా త్రాగాలి శరీర వ్యాయామం, పాలు, పండ్లు, అధికంగా వాడటం మొదలైన వాటి వల్ల పై లక్షణాలన్నీ తగ్గిపోతాయి

సి వి యస్ ఆర్ – పెనుగొండ

నా వయస్సు 22 సంవత్సరములు నేను మూత్రం రోజుకి 7, 8 సార్లు విసర్జిస్తాను మూత్రంలోనూ రక్తంలోనూ ఏమీ లోపం లేదన్నారు మూత్ర విసర్జనకు రెండు నిముషములు పడుతుంది రోజుకి ఎన్నిసార్లు మూత్ర విసర్జన చేయ వచ్చును? మా ఇంట్లో ఎవ్వరికీ చక్కెర వ్యాధి లేదు

వానాకాలంలో ఎక్కువ సార్లు, వేసవిలో తక్కువ సార్లు మూత్ర విసర్జన జరుగుతుంది ఎన్నిసార్లు విసర్జించాలనేది ఎక్కడా లేదు మూత్ర విసర్జన నాళంలో ఏదైనా అవరోధం (పిన్ హోల్ మియాటస్) ఉంటే మూత్ర విసర్జనలో ఆలస్యం జరుగవచ్చును

ఎ కె – బిట్రగుంట

నాకు పచ్చకామెర్లు వచ్చి తగ్గినవి తగ్గిన తర్వాత మూత్రము పరీక్ష చేయించుకున్నాను ఏమి లేదన్నారు అయినా ఇప్పటికీ మూత్రము పసుపుగా పోవుతున్నది ఇలా ఎందు వలన జరుగుతుంది

ఇన్ పెక్టివ్ హెపటైటిస్ (పచ్చకామెర్లు) వచ్చి తగ్గిన తర్వాత కొన్ని రోజులపాటు మూత్రం పసుపుగా పోవటం సహజమే! కాని అందులో బైల్ సాల్ట్స్, బైల్ పిగ్మెంట్, యూరో బిలినో జెన్ అనేవి లేవని తీర్మానించుకోవలసి వుంటుంది కొన్ని సందర్భాలలో వాడ బడిన మాత్రల వల్ల ఇలా పసుపుగా పోయే అవకాశం ఉంటుంది

టి ఎస్ – వైజాగ్

మా అమ్మ వయస్సు 35 సంవత్సరములు ఎప్పుడూ తల నెప్పి అంటుంది కె జి హెచ్‌లో ఎన్నో ఎక్సరేలు తీసారు ఎన్నో మందులు వాడాము ఎన్నో నూనెలు గూడా వాడారు ఈ తలనెప్పి ఎందు వలన వచ్చింది? ఇది తగ్గటానికి ఏమి చెయ్యాలి?

తల నెప్పికి చాలా కారణాలు వున్నాయి ఇ ఎన్ టి నేత్ర వైద్యం, న్యూరాలజీ, సైకియాట్రీ మొదలైన విభాగాలలో నిపుణుల చేత పరీక్షింప చేసుకోవటం అవసరం. రోగ నిర్ధారణను బట్టి చికిత్స చేయవలసి వుంటుంది □

## ప్రేమసాగర మథనం

ముందు వచ్చి నుల్చున్నాడు కింగ్‌కాంగ్ కింగ్‌కాంగ్ శరీరం ఎంత భారీగా వుంటుందో మెదడు అంత చురుకుగా పనిచేస్తుంటుంది

అందుకే అతన్ని బాడీగార్డ్ కం పర్సనల్ అసిస్టెంట్‌గా అట్టి పెట్టుకున్నాడు రాఘవరావు

కింగ్‌కాంగ్ పేకాట సెట్ అయ్యేదాకా వుండి బాస్! మీరొక సారిలా రావాలి! అన్నాడు రాఘవరావుతో!

పేకాటలో కూర్చుని వుండగా ఎవరైనా డిస్టర్బ్ చేస్తే మూతిపళ్ళు రాల గొడతాడు రాఘవరావు! అందుకని అతని దగ్గర పనిచేసే వాళ్ళల్లో అంతపని చేయగల సాహసం ఎవరకీ లేదు కాని కింగ్‌కాంగ్ స్టేటస్ వేరు! రాఘవరావు దగ్గర జీతం పుచ్చుకుని జీవిస్తున్నా అతనంటే రాఘవ రావుకు విపరీతమైన గురి!

ఎన్నో ప్రమాదాల నుండి, దాడుల నుండి అతన్ని శారీరకంగా రక్షించటమే కాకుండా, అనేక చిక్కు సమస్యలు ఎదురైనప్పుడు తగు సలహాలిచ్చి కాపాడాడని కింగ్‌కాంగ్ మీద అభిమానం పెంచుకున్నాడు రాఘవరావు

చప్పున కుషన్ కుర్చీలోంచి లేచి ఏమిట్రా కింగ్‌కాంగ్' అంటూ గది బయటకు నడిచాడు రాఘవరావు

మాట్లాడకుండా ముందుకు నడిచాడు కింగ్‌కాంగ్ మహాకాయాన్ని వూపుకుంటూ

త్రిశంకు స్వర్గాన్ని అనుకుని ఒకగది వున్నది ఎయిర్ కండిషన్ చేసిన ఆ గదిని అప్పుడప్పుడూ వాడు తుంటాడు రాఘవరావు, పెద్ద పెద్ద వాళ్ళను ఎంటర్ టెయిన్ చేయటానికి, పేకాట మీద తాగుడు మీద విముఖత్వం కల్గినప్పుడు డాలీతో ఖుషీగా కాలం గడుపటానికి!

రాఘవరావు లోపలకు రాగానే గది తలుపు వేసి ఎ సి ఆన్ చేసాడు కింగ్‌కాంగ్ చివాస్‌రీగల్ గ్లాస్‌లోకి వంపి సోడా కలిపి యిస్తూ–

బాస్! ఇవాళ నాగరాజు గారి గోడౌన్‌పై రెయిడ్ జరిగింది

చివాస్‌రీగల్ సిప్‌జేస్తూ, ఓర్నీ! దీనికేనా నన్ను పిలిచావు? అన్నాడు రాఘవరావు

సన్నీగాడి పని చేయించాడేమోనని అతని పుస్తకాల షాపు తగుల పెట్టించాడు మీ బావమరిదిగారు

సన్నీ ముఖ్య అనుచరుడు సాంబు వళ్ళు కాలి మరణించాడు కూడాను!

చస్తే పీడాబోయె!

పెద్దమ్మాయిగారి పేరుతో నిన్నెవరో బాంక్‌లో ఎనిమిది లక్షలు జమ చేసారు! సన్నీ దగ్గర ఆ డబ్బు తీసుకుని గోడౌన్ రహస్యం అతనికి చెప్పి వుంటుందనే అనుమానంతో అమ్మాయిగార్ని ఎత్తుకు రమ్మని కోటిగాడి ముఠాను పంపాడు నాగరాజు గారు అదే సమయానికి సన్నీ పంపిన టైగర్ ముఠా వాళ్ళు అమ్మాయి గారి గది దగ్గరకు వచ్చారు రెండు ముఠాలు తీవ్రంగా తారసపడ్డాయి!"

చస్తే చావనీయ్! ఇందుకేనా నన్ను డిస్టర్బ్ చేసింది

అమ్మాయిగారు ఎవరో వుత్తరాది నుండి వచ్చిన యువకుడు కలసి ఎటో వెళ్ళిపోయారు విజయవాడ నలు మూలలా గాలించినా ఆచూకి తెలియ లేదు!

హోటళ్ళు, లాడ్జీలు అన్నీ వెతకండి! ఎక్కడో వుంటారు!"

వెతకడం అయిందిసార్! అమ్మాయిగారి ఆచూకీ తెలియ లేదు!

పోతేపోనీయ్! నన్ను కాదని వెళ్ళినాక అదెలా చస్తే నాకేం!

సార్! మీరు కోపగించుకోకుంటే ఒక మాట చెబుతాను!

"ఊఁ!

మన యంగ్‌మెన్స్ రిక్రియేషన్ క్లబ్బు, యిల్లు వున్న స్థలం పెద్దమ్మాయి గారి తల్లి తండ్రివి, ఆ వుత్తరాదివాడు అమ్మాయిని వివాహమాడి యా ఆస్తులన్నీ నావంటే చిక్కుల్లో పడతాము!

అంతమాటని యీ వూళ్ళో బతగ్గలడా వాడు!"

"మనల్ని చిక్కుల్లో పెట్టటానికి వాడీ వూళ్ళో వుండక్కర్లేదు! దేశంలో ఏ మూలనో వుండి కోర్టులో వ్యాజ్యం వేయించొచ్చు!"

"ఆఁ! నిజంగానా!" అంటూ లేచి పచార్లు చేయసాగారు రాఘవరావు క్షణంలో ఎలర్టయి పోయాడతను (ఇంకా వుంది)

1వ వారం

2వ వారం

3వ వారం

4వ వారం

5వ వారం

6వ వారం

# చూడండి! కేవలం 6 వారాల్లో త్వరగా మీ చాయ మెరుగవుతుంది

# క్లియర్•టోన్

## ద్వారా చాయ మెరుగయ్యే పథకం

మీ ముఖంపైన చాయ మరింత మెరుగ్గా మిలమిల మెరిసేలా, ప్రకృతి మీకిచ్చిన వరంలా.

క్లియర్•టోన్. చాయను మెరుగు పరిచే క్రీమ్. చేస్తుందిది నిజం.

క్లియర్•టోన్‌ని రోజుకి రెండుసార్లు మృదువుగా రాయండి. దానిలోని మృదుత్వాన్ని మీ చర్మంలో లోపలికి యింకుతూన్న అనుభవాన్ని పొందండి —మిగిలేదిక కేవలం అద్భుతమైన ఆ ఫ్రెంచి సుగంధం. క్లియర్•టోన్ యొక్క 4 విధాల చర్య యిక మొదలు.

**అద్వితీయమైన తీరులో చర్మపు చాయని మెరుగు పరిచే పదార్థం** (మరే క్రీములోనూ లేదు యిది). మీ చర్మం లోపలనుంచి ప్రకృతి సహజమైన ఆ మెరుగు మెరుపును పునరుజ్జీవితం చేస్తుంది.

**సూర్యకిరణాలను వడగట్టగల ప్రత్యేకమైన పొర మీకు** రోజంతా రక్షనిస్తుంది, సూర్యకిరణాల నుంచి నల్లబడకుండా.

**సమృద్ధవంతమైన మాయిశ్చరైజర్ మీ చర్మాన్ని అలా** కోమలంగా యవ్వనంలోని నేవళంగా వుండే ఆ లక్షణాన్ని తీసుకొస్తుంది.

**వారాలు తిరిగే సరికల్లా చర్మంపైన మచ్చలలా మాసిపోతాయి.** అలా చూస్తూచూస్తూ ఆరు వారాలు తిరిగేసరికల్లా క్లియర్•టోన్ తెచ్చే ఆ తేడాని మీరే చూస్తారిక-దేశమంతట్లోని వేలకి వేల స్త్రీలూ యిప్పటికే వాడి అనుభవంలోకి తెచ్చుకున్న ఆ అనుభవాన్ని.




క్లియర్•టోన్ తెచ్చే మెరుగైన చాయను మీరూ చేజిక్కించుకోవాలి కదూ?

లండన్•ప్యారిస్•న్యూయార్క్

daCunha/NICL/93/87 TEL



ప్రశాంత నిలయానికి మారుపేరైన ఆ గ్రామ వున్నత పాఠశాల వాతావరణం ఆరోజు పూర్తిగా మారిపోయింది

క్లాసులేవీ జరగటంలేదు పిల్లలంతా అదుపుతప్పిన జంతువుల్లా తిరుగాడుతున్నారు సెకండ్ పిరియడ్ బెల్ అయినా ఏ ఉపాధ్యాయుడూ క్లాసులకు పోకుండా టీచర్స్ రూమ్‌లో కూర్చున్నారు

అందరి హృదయాలు విచ్ఛిన్నం అయినాయి అంతేకాక బీతితో కొట్టుకులాడసాగాయి లాగి వదిలిన స్ప్రింగులా ఎన్ని ఆలోచించినా చివరికి వారి వూహలు మళ్ళా మొదటికేవస్తున్నాయి

ముఖ్యంగా ఆ హైస్కూలుకి స్ట్రిక్టు అండ్ ప్రిన్సిపల్‌గా పేరుపొందిన ప్రధానోపాధ్యాయుడు లోవరాజు మస్తిష్కమంతా మరుభూమిలా బయంకరమైపోయింది

కుర్చీలో కూర్చున్నాడేకాని అనుక్షణం కంటకప్రాయంగా తోస్తోంది ఒళ్ళంతా స్వేదమయం

ఎవరే తప్పుచేసినా పాఠశాల అదికారిగా తనే సంజాయిషీ యిచ్చుకోవాలి!

కానీ ఈ విషయంలో తను ఏమని బదులీయగలడు? జరిగిన తప్పిదాన్ని కప్పిపుచ్చి సాటి ఉపాధ్యాయుడ్ని ఎలా కాపాడుకోగలడు?

ఎంత రూలు మనిషయినాసరే కౌస్తుభం గారికిదేం పోయేకాలం? అయినా కాలం మారింది మనుషులు మారారు అన్న ఒక్క విషయం యోచించక విచక్షణాజ్ఞానం విస్మరించి పశువులా ప్రవర్తిస్తాడా?

ఉత్తమ బోదకుడిగా – విద్యార్థులను మంచిమార్గంలో నడిపించే క్రమశిక్షణాపరుడిగా – మంచి పేరున్న కౌస్తుభం మేస్టారు ఈవిదంగా ఎందుకుచేసాడు?

ఛీ! తన పాఠశాలకి చెడ్డపేరు తెచ్చాడు

ఈ మాయని మచ్చ చెరగనిది!

జరగబోయే విపత్తు వూహించుకొంటున్నకొలదీ గుండెలు బితుకుబితుకులాడసాగాయి లోవరాజుకి

ఇదేసమయంగా కాచుకునివున్న క్రీడాచార్యుడు శ్రీశైలం అయ్యా! అయినాకాని కౌస్తుభంగారికిదేం తెగులండీ? ఇదేమైనా స్కూలనుకున్నాడా? గొడ్లశాలనుకు న్నాడా? పశువును బాదినట్లు బాత్తాడా! సామాన్యమైన మనుషుల పిటీషన్‌లకే ఏడాదికి రెండుసార్లు బదిలీలౌవుతున్న కీలుబొమ్మలం మేస్టర్లం అందువల్ల కాస్త తెలివిగా వ్యవహరించాలి ఏవీ జరక్కముందే కౌస్తుభంగారికి గడ్డిపెట్టి ఆ వచ్చే అతని కాళ్ళు పట్టుకోమనండి అని రాజేయటం ప్రారంబించాడు

క్రీడాచార్యుడు పెట్టిన మంట లోవరాజును చురుక్కుమనిపించింది స్టాపురూమ్‌లోనికి పరిగెట్టించింది

అందరూ తలో చోట కూర్చున్నారు

మూడో పిరియడ్ బెల్ కొట్టడం కూడా మరచి విభ్రాంతిగా తల పట్టుకు కూర్చున్నాడు అటెండర్ పుల్లన్న

ఎడారిలో ఎక్కడోకాని కనిపించని చెట్టులా అందరూ వూహిస్తున్న బావాలకి విరుద్ధంగా కనిపిస్తున్నాడు కౌస్తుభం మేస్టారు

అందరికీ అర్థంకావటం లేదాయన

కౌస్తుభంగారూ! మీకైతే నిమ్మకు నీరెత్తినవాడిలా ధైర్యంగా వుందేమోగాని, చేసినపనికి సిగ్గుతెచ్చుకుని బయంతో చితికిపోవాల్సింది పోయి ఏమీ చెయ్యని నంగనాచిలా కూర్చున్నారు ఏం చెబుదామనుకుంటున్నారు? అయినా ఎంతటి సాహసమయ్యా! అంతటివాడిని కొట్టడానికి మీకు చేతులెలా వచ్చాయి? ఆ కుర్రాడు మీ బందువా? మిత్రుడి కొడుకా? ఎవరి కొడుకనుకున్నారు అని హెడ్మాస్టర్ లోవరాజు పిచ్చరపిడుగులా అరిచాడు

మీ రెంతో విద్వాంసులు కావచ్చు సకలశాస్త్రాలు ఎరిగినవారే కావచ్చు కాని రోజులు మారాయి కౌస్తుభంగారూ! మనచేతిలో విద్యార్థులు కారు వాళ్ళచేతిలోనే మనం అనే రోజులు వచ్చాయి అయినా ఎవర్ని పండితుల్ని చేద్దామని ప్రయత్నించకూడదు అలాచేస్తే మనం ఎన్ని కఠిన సమస్యల్ని చిక్కుల్ని ఎదుర్కోవాల్సివచ్చింది మీరా సమయంలో కాస్త కోపం తగ్గించుకోవలసింది కామ క్రోధ, మద మాత్సర్యాలేకదా మనిషిని తప్పుదారి పట్టిస్తాయి తెలుగు పండితుడు తిరుపతి శాస్త్రి చాలా నెమ్మదిగా శాంతంగా చెప్పాడు

కాని కౌస్తుభంగారు నిశ్శబ్దానికి ప్రతిబింబంలా వున్నారు అలా నెమ్మదిగా చెబితే వినేరకం కాదు! కౌస్తుభంగారూ! తమరు ఈ నీతి నిజాయితి క్రమశిక్షణ, నడవడి అన్న చతుస్సూత్ర పదకం అమలుపరుస్తూ ఎన్ని పూర్లు మారారో మీరు మరచిపోయినట్లున్నారు అదే గుర్తుంటే ఈనాడు ఆ కుర్రాడెవరి తాలూకానో తెలిసి మీ రింత కటువుగా దండించరు ఛీ! ఎంత వయసొస్తేనేం? ఎంత సర్వీసుంటేనేం?" హిందీ మేస్టారు శివానందం తనే పెద్ద మోనార్క్‌లా అంతెత్తున లేచాడు అసలు పుట్టినప్పుడే తనో మొనగాడిలా మీసాలు మెలివేస్తాడు ఇటువంటి సందర్భాలొస్తే మరీను

ఎవరికివారే తలోకరీతిగా కౌస్తుభం మేస్టారుపై దండయాత్ర ప్రకటించారు

మాట్లాడలేనివారు అక్కసునీ నిరసననీ తమ చూపుల్లో ప్రదర్శిస్తున్నారు వారికి కౌస్తుభంగారు – ఎవరికీ లొంగని మొండిఘటంలా సాక్షాత్కరిస్తున్నాడేతప్ప మరే యితర కోణంలోంచి దర్శనం కావటం లేదు

ఆయన చిత్రమైన ప్రవృత్తి నివ్వెరపాటునీ బయాన్ని కూడా కలిగిస్తోంది

లోవరాజుకి ఎలా చెప్పాలో ఈ సమస్యని ఎట్లా పరిష్కరించి ఓ కొలిక్కి తీసుకురావాలో అవగాహన కావట్లేదు తను తప్పుచేసినవాడయితే ఆ వచ్చేవాడి కాళ్ళపైబడి ప్రాదేయపడి క్షమాపణ కోరేవాడు కాని కౌస్తుభం మేస్టారు పట్టుదలకిపోతే తనేం చేయగలడు?

మేస్టారూ! కొరివితో తల గోక్కుంటున్నారు ఇంతమందిమి చెవినిల్లుకట్టుకుని చెబుతున్నాసరే చెవిటివాడి ముందు శంఖంలా అయిపోతూంది మా అభ్యర్థనమేర తప్పు ఒప్పుకుని రాజీకి రండి అని తన క్రోదం అంతా మంచులా కరిగించుకుని ఎలాగయినా అతన్ని దారికితేవాలని హైస్కూలుకి చెడ్డపేరు రాకుండా వుండాలని చెప్పేసి తనే ప్రార్థించాడు లోవరాజు

కౌస్తుభం నుదుటిపైన చేతుల్ని దించి అందరివైపు సాలోచనగా చూసాడు

చెప్పలేనంత వ్యగ్రత అసహ్యం వ్యక్తంచేస్తూ వుండిపోయారు అంతా

తోటి ఉపాధ్యాయులందరికీ నా విన్నపం నీతి నిజాయితీ క్రమశిక్షణ మంటగలసిన అసబ్య సమాజం యిది అనుకుంటామేకాని అవెలా మంటగలుస్తున్నాయో తెలుసుకో ప్రయత్నించరు అంతేగాక ప్రతీవారికీ బయపడుతూ బ్రతుకు ఈడుస్తున్నవారిలో మొట్టమొదటివాడు ఉపాధ్యాయుడు అనటం సత్యదూరం కాదు అయితే ఈ రోజు జరిగిన సంఘటనకి నేను బాద్యుడ్నికాను అంటే అందరికీ నామీద పీకలదాకా కోపం రావచ్చు రావచ్చుకాదు వచ్చే వుంటుంది అయితే ఆనాడు మహారాజు కొడుకయినా మామూలువాడి కొడుకయినా సరే గురుకులాశ్రమాల్లో విద్యార్థులపట్ల గురువుకి ఒకే తరహా దృష్టివుండేది ఈనాడలా కాకపోబట్టే కొందరే పైకిరావటం జరుగుతూంది అయినా ఏం జరిగిందని? నామీద మీకింత ఆవేశం?? ఆ కుర్రాడు ఎవరన్నదీ నా కనవసరం! ఓ వృద్ధిలోకి రావలసినవాడు చెడిపోతున్నప్పుడే అతనిలోని మలినం పోగొట్టి, కల్మషం కడిగి వెలుగులోకి తేవాలి అదే అబిప్రాయంతో నేను ప్రవర్తించాను దీపక్ నేను చెప్పిన వర్కు చేయలేదని మార్కులు హీనంగా వున్నాయని, ఆడపిల్లల్ని అల్లరిపెడుతున్నాడనిచెప్పి



ఓసారి హెచ్చరించాను అయినా తనకేం పట్టనట్టు ప్రవర్తించాడు అలా చెప్పానని తన తండ్రి గొప్ప హోదాలో వున్నాడనిచెప్పి అభిజాత్యంతో నామీదకే చెయ్యెత్తాడు పవిత్రమైన దేవుడిలాంటి ఉపాధ్యాయుడిపైన చేయెత్తినవాడిని ఎలా సహించగలను? అందుకే దండించాను పెదదారి పట్టేవాడ్ని పగ్గాలుపట్టి ఆపాను మీఅందరికీ నేను వ్యవహరించిన తీరుపట్ల విముఖతవుంటే వుండవచ్చు కానీ నాకు కలెక్టర్ కొడుకయినా ఆ దేవుడి కొడుకయినా ఒకటే' అని తనలో సిద్ధించిన వుద్దేశ్యాల్ని బయటపెడుతూ ఆవేదనని వ్యక్తపరిచాడు

కాని అక్కడివారిని ఆయన మాటలు ప్రబావితం చేయలేక పోయాయి మొండిమనిషిగానే ముద్రించుకుపోయారు కౌస్తుభం మేస్టారు

మంచికంటే చెడు త్వరగా రాణిస్తుంది ఒక మనిషిని వున్నత శిఖరాల్లో కూర్చోబెట్టటానికి సహకరించని మనుషులు అతనిలోని మంచి అభిప్రాయాలను సైతం ఏమార్చటానికి చటుక్కున ముందుకొస్తారు

అదే జరిగింది కౌస్తుభం మేష్టారి విషయంలో

అయితే ఆయన ఆయనే అనిపించుకున్నారు

తన జీవితానికో పరిధిని, నిర్దుష్టాభిప్రాయాలను ఏర్పరచుకుని వాటిలోనే - పయనించాలని వువ్విళ్ళూరిన ఆ స్థిత ప్రజ్ఞుడి మనసులో మాత్రం మిగతా మేష్టార్లలా భయచిహ్నాలు లేవు

కౌస్తుభం మేష్టారికి మానసిక విశ్వాసం వుంది

తను చేసిన పని మంచిదేనన్న ప్రగాఢ నమ్మకం అచంచలంగా వుంది ఆ కారణంగానే ఎంతో నిబ్బరంగా వుండగలిగారు

ఆయన సర్వీసులో లేటుగా రావటంగాని దొంగఎత్తులువేసి పెర్మిషను పెట్టి యింటి దగ్గర హాయిగా గుర్రుపెట్టి నిద్రపోడాలుగాని లేవు ఆయన జీవిత గ్రంథంలో ఎక్కువపుటలు నీతి నిజాయితీ అనే అక్షరాల్తోనే నిండాయి

తనకి రానిది రాదని ఒప్పుకోవటం, వచ్చిందాన్ని ఇదమిద్ధంగా, కూలంకషంగా వచ్చునని చెప్పటం ఆయనకు అలవడిన సుగుణం

అయితే యిది చాలామందికి అసూయగా అనిపించటం మామూలే? ఇలా వ్రాస్తూపోతే కౌస్తుభం మేష్టారి మీద ఓ గ్రంథం రాయొచ్చు

ఇంక లోవరాజుగారికి కౌస్తుభంగారి విచిత్ర వైఖరి అసహ్యం కల్గించిందే కాని ఏమాత్రం సబబనిపించలేదు అతనెంతో హీనమైన వాడిగా కళ్ళ కట్టాడు

స్టాఫందరికీ కూడా అదేభావన కదలాడింది

వెంటనే కౌస్తుభంగారిని ఒంటరిగా చే:



లోవరాజుతో పాటు అంతా నిశ్చేష్ఠుడయ్యారు

బరువుగా నిట్టూర్చి ఆలోచనలో పడ్డాడు కౌస్తుభం

వీరంతా తనని ఎందుకిలా అపార్థం చేసుకుంటున్నారు వీళ్ళు కూడా వుపాధ్యాయులేకదా! ఓ విద్యార్థి ప్రవర్తన నికృష్టమై పట్టపగ్గాల్లేకుండా వెర్రి పరుగులు తీస్తుంటే అదుపులో పెట్టవలసిన ఆవశ్యకత ఏర్పడిన తరుణంలో వుపాధ్యాయుడిగా బాధ్యతని ఎరిగి-యిలా తనని దూషిస్తారా!

తను బాధ్యత నిర్వహించాడు వీళ్ళంతా ఆ కుర్రాడి అంతస్తు ఆస్తి, హోదాలే చూడగల్గుతున్నారు కాని తనకేవేవీ తెలీవు తనక్కనిపించింది విద్యార్థి చదువు ప్రవర్తన, మనస్తత్వం

విద్యార్థి ఎవరయితేనేం తనకి నచ్చని నడవడి ఖండించాడు

అదే తను చేసిన తప్పయితే- అందుకు తగిన శిక్షగా ఏటో కొండల్లోకి బదిలీ ఔతాడు

ఆ వచ్చే మనిషి ఎటువంటివాడో తమ దుంపలు తెంపేస్తాడేమోనన్న పిరికితనం వారికి!! కాని తన కదిలేదు

ఆ ధైర్యం తనకుంది!

అది కొందరి దృష్టికి మొండితనం కావచ్చు!!!

అన్నింటికీ సిద్ధపడి తనున్నప్పుడు తనకేం??

## మార్గదర్శి

కౌస్తుభం మాష్టారు ఆలోచనల్లో వుండగా-అక్కడ హెడ్మాస్టర్ రూమ్‌లో- లోవరాజుగారి చుట్టూ నిలబడ్డారు స్టాఫందరూ ఆయన చెప్పే విషయం పట్ల అత్యంత ఆసక్తిని కనబరుస్తూ నిశ్శబ్దంగా వుండిపోయారు

అయ్యా! ఈ స్కూలుకి మంచొచ్చినా, చెడొచ్చినా సరే అది నాకే చెందటం మీకు తెలుసు అయితే కౌస్తుభంగారు చేసిన వెధవ పనికి మనకందరికీ తలవంపులుగా వుంది పోనీ ఆ కుర్రాడు ఏ రైతు కొడుకో కార్మికుడి కొడుకో అయితే సర్దిచెప్పి పంపేసేవాళ్ళం కాని దీపక్ సాక్షాత్తూ ఈ జిల్లాకే కలక్టర్ అయిన కరుణాకరంగారి సుపుత్రుడు అతన్ని కొట్టడానికి ఎంత దమ్ములుండాలి ఎవరికయినా ఆ కలెక్టర్‌గారేమో మన స్కూలు ఈ జిల్లాకంతటికీ మంచి పేరుగలదని చెప్పి యిక్కడ జాయిన్ చేసారాయె కాని ఈ రోజు మన కౌస్తుభంగారేమో యింత నిష్కర్షగా బెత్తంతో కొట్టాడు ఏం చేయటానికీ, పాలుపోవటంలేదు" అని కంగారుగా పలికాడు లోవరాజు

"హెడ్మాస్టర్‌జీ! నాదొక మాట! జరిగిందేదో జరిగింది తోటి టీచర్ కదాని సపోర్ట్ చేద్దామన్నా మన మాట దక్కించలేదు కౌస్తుభంగారు! అందువల్ల మనమంతా కౌస్తుభంగారు కుర్రాడ్ని కొట్టగా చూసినట్లు సాక్ష్యం యిచ్చేస్తే కలెక్టర్‌గారికి మనపై కోపం పోయి కౌస్తుభంగారి ఒక్కరికే శంకరగిరి మాన్యాల భాగ్యం కల్పిస్తారు అని శివానందం సలహా యిచ్చాడు

ఈ మాట అందర్నీ ఆకర్షితుల్ని చేసింది

సరేనంటే సరేనని ఏ విధంగా ప్రవర్తించాల్సిందీ రిహార్సల్స్ వేసుకున్నారు

మధ్యాహ్నం దాటుతున్న కొలదీ ఏ క్షణాన దీపక్ తన తండ్రిని వెంట బెట్టుకుని వస్తాడోనని గుండెలుగ్గ బెట్టుకుని వున్నారు

అనుకున్నట్టే పడవలాంటి ప్లిమత్ కారు హైస్కూలు ఆవరణలోకి ప్రవేశించింది

లోవరాజు గుండెలు పీచు పీచు మనసా గాయి

అయినప్పటికీ లేని ధైర్యం నవ్వురూపాన పులుముకొని ఎదురు వెళ్ళాడు

కలెక్టర్ కరుణాకరంగారు దిగారు ఆయన వెంట దీపక్ వున్నాడు సాదరంగా ఆహ్వానించాడు లోవరాజు

ఆయనకి తనసీటు యిచ్చి ఎదురుగా తను నిలబడ్డాడు మిగతా టీచర్స్ వణికే చేతులెత్తి నమస్కారం పెట్టి వినయంగా ఏదో ఘోరం జరుగుతుంటే కిమ్మనకుండా వున్న వాళ్ళలా అచేతనంగా వుండి పోయారు

"ఏమండీ మా అబ్బాయి దీపక్పై చేయి చేసుకున్న వ్యక్తి నాకింతదాకా ఎదురవలేదు కలెక్టర్‌గారి కొడుకని తెలిసీ అతనలా చేయి చేసుకోవడం

# గడుసులోకం —బాబు







బాగులేదు ఇంతకీ మీలో ఎవరది!'' గద్దించి అడిగాడు

లోవరాజు గతుక్కుమని- వీరెవరూ కాదుసార్!! కౌస్తుభంగారని సోషల్ అసిస్టెంట్ అదిగో ఆ గదిలో వున్నారు పిలుస్తానుండండి అని పరుగెత్తబోతుంటే కౌస్తుభంగారు వస్తూ "అక్కర్లేదు నేనే వస్తున్నాను తమరేనా దీపక్ తండ్రి కరుణాకరంగారు "నమస్తే! అని గౌరవంగా నమస్కరించారు

ఓహో మీరా మేష్టారు రండి రండి మీతోటే పని అన్నాడు కరుణాకరం

స్టాఫందరికీ కొంచెం వూపిరి తీసుకుందికి వీలయింది తమందరి మీద విరుచుకుపడ్తాడన్న అపోహ తొలగింది

మావాడ్ని చేయిచేసుకోవటంలో మీ ఆంతర్యం ఏమిటి?? అడిగాడు సూటిగా కలెక్టర్ కరుణాకరం

దయచేసి మరోలా అనుకోనంటే ఓ మాట మిమ్మల్ని ప్రస్తుతం దీపక్ తండ్రిగా బావించి నేనతని వుపాద్యాయుడిగా మాట్లాడుతున్న మాటలివి కొంచెం స్వేచ్ఛగా ప్రసంగిస్తాను అభ్యంతరమా! నిస్సంశయంగా అడిగాడు కౌస్తుభం

నో అబ్జక్షన్ ఒప్పుకున్నాడు కరుణాకరం

ఒక బాధ్యత గల రైతు తన పొలంలో బంగారంలాంటి పంట పండించాలని వున్నతమైన ఆశయాలతో పైరు వేస్తాడు కాని ఆ పైరుకు తెగులు పడుతుంది అది తన దురదృష్టంగా చింతించి దానిని పోగొట్టడానికి ఎన్నో వుపాయాలు ఆలోచించి చివరికి మందుకొడతాడు ఆ మందు పని చేసి పొలం సస్యశ్యామలం అయితే ఎంతో గర్విస్తాడు తన కష్టానికి ప్రతిఫలం దక్కిందనుకున్న ఆ రైతు అవధిలేని ఆనందంతో మునిగిపోతాడు అట్లాంటి రైతువంటివాడే ఉపాధ్యాయుడు లేత మొక్కల్లాంటివాళ్ళు విద్యార్థులు వారిలో ఏమైనా అవగుణాలు వ్యాపిస్తే వాటిని అణగద్రొక్కడానికి ఎన్నోవిధాల ప్రయత్నిస్తాడు లొంగకపోతే చేయి చేసుకోవడానికి కూడా వెనుకాడడు అతనికి అందరు విద్యార్థులూ ఒక్కటే అంతస్తులూ- తారతమ్యాలు తెలీవు అతని ఆశయమల్లా విద్యార్థి పరిపూర్ణ వ్యక్తిత్వం గలవాడిగా వికాసం పొందాలని అప్పుడే ఆ ఉపాద్యాయుడు తన విద్యాదానం సఫలమైందని అంతులేని తృప్తి చవిచూస్తాడు మొదట దీపక్‌ని నెమ్మదిగా బోధించాను మీరెంతో వున్నతమైన పదవిలో వుంటూ మీ సంతానం పతన దిశలో పయనించకూడదనే సదభిప్రాయంతో నే- అతన్ని సన్మార్గంలోకి నడిపించాలనే ఆ పని చేశాను

అని ముగించాడు కౌస్తుభం

ఆ క్రైదిభై హెడ్మాస్టర్‌గారూ! మీ దగ్గర పని చేస్తున్న ఈ మేస్టారి ప్రవృతిపై మీ అభిప్రాయం?? అడిగాడు కలెక్టర్ కరుణాకరం

ఆ నే చెప్పేదేమంటే తమవంటి హోదాగల వ్యక్తి కొడుకుని కొట్టడం చాలా ఘోరం కౌస్తుభంగారలా చేయటం ముమ్మాటికీ నేరం"అని స్టాఫు వైపు చూసాడు లోవరాజు

జొన్నార్ ముక్తకంఠంతో పలికారు స్టాఫు

స్టాపిట్ అయ్‌సే మీ అందరికీ సిగ్గులేదూ!! విద్యార్థి వెనుక అంతస్తు హోదా వాటినే మీరు చూసారుకాని అతని ప్రవర్తన వైఖరి మీరు గమనించటంలేదు తప్పుడుదారి పట్టిన ఓ విద్యార్థిని సన్మార్గంలో పెట్ట చూపిన మీతోటి వుపాధ్యాయుడు కౌస్తుభంగారినే దోషిగా ఎంచుతారా! అందుకే యిట్లా వుంది విద్యావ్యవస్థ!! అని కౌస్తుభం మేస్టారి దగ్గరగావచ్చి కరచాలనం చేసి- రియల్లీ ఐ ఎప్రిసియేట్ యూ ఇంత కాలం మా కుర్రాడ్ని అంతా కలెక్టర్‌గారి అబ్బాయిగానే ట్రీట్ చేసి వాడి విషయంలో ఏ ఒత్తిడి తెస్తే నేనేం చేస్తానో అన్న భయంతో చాలామంది వుపాద్యాయులు వాడిని వేరుగా చూసి జ్ఞానశూన్యుడ్ని చేసారు చివరికి వాడిలో మేస్టారిపట్ల అలసత్వం తనకంటూ స్వేచ్ఛ ఏర్పడి వాడికి చదువుపట్ల విముఖతం పెంచాయి ఇప్పటికి వాడి సత్ప్రవర్తన కోసం, చదువు నేర్పాలనే వున్నతమైన లక్ష్యం కోసం శ్రమపడిన వ్యక్తిగా మీరు వాడిని దండించటం పట్ల నేనెంతో హర్షం వ్యక్తం చేస్తున్నాను ఇకనుండీ వాడి బాద్యత మీదే మేస్టారూ! అని కౌస్తుభంగారిపట్ల నిండైన గౌరవం, కలెక్టర్‌గారి నేత్రాలలోంచి వెలువడిన మంచు బిందువుల్లాంటి స్వచ్ఛమైన ఆనందబాష్పాలలో ప్రస్ఫుటించింది

దీపక్ చేత మేస్టారికి క్షమాపణ చెప్పించాడు ఆ దృశ్యం చూస్తున్న మిగతా మేస్టార్లందరికీ కూడా ఎందుకో కనులు చెమ్మగిల్లాయి □

## నీటిబొట్టు

శ్రమజీవి శరీరంపై
చెమట బొట్టుగా నిన్ను చూసినపుడు
విశ్వాన్ని గెలిచిన
విజయగర్వం నీలో చూశా!
ఉషోదయంలో
గడ్డి పరకపై కూర్చొని
ఆణిముత్యమై వెలుగుతూ
అందర్నీ ఆకర్షించే నిన్ను చూశా!
కలకంఠి కళ్ళలో
కన్నీరై తొంగి చూసి
కలకంఠి వెతలు
నువ్వు కథలుగా చెప్పడం చూశా!
ఎండిన మొక్క మొదట్లో చేరి
నువ్వు పండిస్తున్నప్పుడు
విశ్వజన శ్రేయస్సుకై
నిరంతర నీ కృషిని చూశా!
నోరెండిన మనిషి నోట్లో చేరి
మరణంలోంచి జీవంలోకి
మనిషి పయనిస్తున్నప్పుడు
కరుణామయమౌ నీ కంట తడిని చూశా!

— అడిగోపుల వెంకటరత్నమ్




**మూర్తి, భద్రాచలం**

★ ఆ మధ్య మీ అమ్మాయి లలితారుద్ర రాసిన ఆంగ్ల కవితా సంకలనం ప్రచురింపబడిందని ఒక ఫ్రెండు చెప్పారు. దానిని పొందుటకు చిరునామా వెల తెలియ చెప్పకలర?

● ఈ రోజే మీకు ఒక కాపీ పోస్టు చేశాను ప్రచురణ కర్త నేనే మంచి పేరొచ్చింది అది ఒక్క ఆంగ్ల కవితా సంకలనం కాదు- తెలుగు కూడా వుంది ఒక ప్రయోగంగా వేశాను

**బి. ఏ. ఆర్. రాయగడ**

★ చట్టానికి కళ్ళు లేవు మరి చట్టం వుండి దేనికి?

● బాగుంది- సాక్షులున్నారు కదా?!

★ నేటి విద్యా విధానం పై మీ అమూల్యమైన అభిప్రాయం!

● అమూల్యమైన మూల్యమైనా నా అభిప్రాయం ఒకటే - ఇది చావడానికీ బ్రతకడానికీ పనికిరాని చదువు

**టి జె. ఆర్ విజయవాడ**

★ మా వీధిలో 'ఉచిత వైద్య శాల' అని ఉంది ఇక్కడికి ఒక్కరు కూడా రోగులు వస్తున్నట్టు లేరు ఎందుకంటారు?

● ఉచిత వైద్యానికి రోగాలు కుదరవు అన్న నమ్మకం అందుకే వైద్య రుణం ఉంచుకోకూడదని- యివ్వ కల్గినంత యిచ్చి రోగం కుదుర్చుకుందుకు తాపత్రయ పడతారు!

**డి ఎస్ ఎస్ బి – చోడవరం**

★ సినిమాలలో దర్శకుని శాడిజం ఎక్కువగా కనబడుతోంది హీరోయిన్ షరో కాళ్ళని కళ్ళకి అద్దుకోడం లాటివి ఎంత రచయిత్రి అయినా ఆడది విమర్శిస్తే ఏడుస్తుందని యింకోసినిమాలో సుహాసిని –దీనివల్ల దర్శకుని ప్రయోజనం నెరవేరింది– నటికి పేరు, దర్శకుని శాడిజానికి నిదర్శన మన దేశంలో మహిళా ఉద్యమ సంఘాలు మండలులు ఉన్నాయి కదా! యిటు వంటి వాటిపై ఉద్యమాలు ఎందుకు లేవ తీయరు?

● ఈ దేశంలో దేనికి భయపడినా భయపడక పోయినా ఆడది మగవాడికి భయపడుతోంది దీనికి కారణం – సంప్రదాయం ఫలితంగా యినుప చట్రం మధ్య బిగింపబడి వూపిరి సలపని వాతావరణంలో – చదువున్న ఆడవాళ్ళు కూడా 'బాండెడ్ స్వేచ్ఛ'ను అనుభవిస్తున్నారు ఎవరి మీద లేవతీయాలి ఉద్యమాలు? సినిమాలు నేడు బలవత్తరమైన ప్రచార సాధనాలు వాటి ద్వారా నిర్మాతలు, దర్శకులు, హీరోలు, కథకులు, రచయితలు – అంతా తమ తమ 'కొత్తరకం చిన్న చూపును' ఆడదానిపై ప్రసాదించడానికి శతధా తాపత్రయ పడుతున్నారు పైగా మహిళా చిత్రం, మహిళలు మెచ్చే చిత్రం– ఆడపడుచులు – హారతి పడుతున్న చిత్రం అంటూ ప్రకటనలు ధైర్యంగా చేస్తున్నారు యీ ప్రకటన వెనుక నిజం ఎంత? బూటకం ఎంత అన్నది అంచనా ఎవరు వేస్తున్నారు?

**ఎన్ ఆర్ బి – హైదరాబాదు**

★ రామలక్ష్మి గారూ ఉగాది నాడు మాలతీ చందూర్ గారికి హైద్రాబాదులో సన్మానం నాడు జరిగిన సంఘటన విన్నారా?

● విన్నాను చాలా సిగ్గుచేటు రాజధానీ నగరం నడి బొడ్డున వున్న ఘరానా హోటల్లో యింతటి దారుణం జరగడం – మా అందరికీ చాలా ఆశ్చర్యాన్నీ, బాధనీ కల్గించింది మాలతి అన్నట్టు ఏమాత్రపు కనీసపు రక్షణ ఏర్పాట్లూ లేని యీ హోటళ్ల కెవరిస్తున్నారు లైసెన్సులు?!

**బి ఏ ఆర్ కోటబొమ్మాళి**

★ విచారంగా వున్నప్పుడు చావాలనిపిస్తుంది విచారం లేనప్పుడు బ్రతకాలనిపిస్తుంది ఈ రెండూ లేనప్పుడు?

● విచారం- విచారం లేకపోవడాల మధ్యనే సాగుతుంది జీవితం అందుకే మనిషి సుఖాలు శాశ్వతంగా వుండాలనీ కష్టాలు త్వరగా గడిచి పోవాలనీ- కోరుకుంటూ జీవించేస్తుంటాడు!

**జి ఆర్ డి – ?**

★ అక్కయ్యా మా వారికంటె పెద్ద వారు ఆడబడుచులు ప్రతిరోజూ కాఫీ టిఫిన్లు కబుర్లు ఆదివారం సినిమాలు ఒకరిపై ఒకరు పంతం పట్టి చీరలూ గట్రా కొనిపించుకుంటారు మావారికి నోరు లేదు ఇప్పటికే తల మునకలుగా వున్నాం అప్పుల్లో నేను చాకిరీ కర్చు చేసినా నేనంటే చులకన వారికి నేనేం చెయ్యాలి?

● నేనైతే ఏం చేస్తానో చెప్పనా- మీరు మీరూ ఒకటి – మీ పన్లు మీరు చేసుకోండి అని ముఖాన చెప్తాను ఎవరో ఒకరు సూటిగా చెప్పక పోతే – యిలాంటి మనుషులు – ఎదుటి వారిని పూర్తిగా తినేస్తారు అయినా తృప్తి పడరు! అంచేత అంత్య నిష్ఠూరం కంటే ఆది నిష్ఠూరం మేలని గ్రహించండి ముందే తేల్చేసుకుంటే తరవాత బాధ తప్పుతుంది తోబుట్టిన వారినిలా చూడగల మనిషికి భార్యకీ చేయాలన్న ఇంగితం వుండాలి

**ఎం ఎస్ ఎన్ – అన్నవరం**

★ దుర్మార్గుడైన స్నేహితుడు గొప్ప వాడా? సన్మార్గుడైన శత్రువు గొప్పవాడా?

● సన్మార్గుడైన శత్రువే నయం – ముంచడు అటో యిటో సూటిగా తేల్చి పారేస్తాడు దుర్మార్గుడైన స్నేహితుడంటారా? స్నేహంగా వుంటూ కాళ్ళ కింద గోతులు తవ్వవచ్చు

★ పూర్వపు చదువులు విజ్ఞానం కోసం గాని యిప్పటివి పొట్ట పోషణ కోసమే నంటాను మీరే మంటారు?

● ఎప్పుడూ చదువు వృత్తి చేపట్టడానికి- తొలి మెట్టుగానే వుంది అప్పుడు దానికి కాస్త విలువ వుండేది ఇప్పుడు లేదు అంతే తేడా ఇక ఉదర పోషణ కోసం – యీనాటి చదువు ఎందుకూ పనికి రావడం లేదని – నిరుద్యోగుల సంఖ్య నిరూపించడం లేదా?!

★ ఏ రచయిత యేనా తన నవలల్లో చూపెట్టే ఆదర్శాన్ని తాను కూడా పాటించడం సాధ్యమవుతుందంటారా?

● రచయిత పెట్టుకున్న ఆదర్శాలని పట్టి వుంటుంది అవి ఆచరించడం ఆచరించ లేక పోవడం అన్నది ఈనాటి క్రౌర్యం, దోపిడీ, దుండగాలు భూత ప్రేత ఆరాధనలు యివన్నీ ఏ రచయితేనా ఆచరించాలని రాస్తారని నేను అనుకోను ఇవన్నీ చదివే మీ లాంటి వారి కోసం ఆదర్శాలు పెట్టుకున్న వాళ్ళు – నేల విడిచి సాము చేయరు చేయలేరు □






# ఆ సున్నితమైన అనుభవం మిమ్మల్నొక్క నిట్టూర్పులో ఆఘమేఘాల మీదుంచుతుంది

పొగమంచుకన్నా పల్చన, ఎగిరే ఈకకన్నా తేలిక, అదే మీరు కోరే నిశ్చింత నిస్తుందిక. డ్యూరెక్స్ ఫెదర్ లైట్ అంతఃరరాష్ట్రీయ కాండోము లిప్పుడు ఇండియాలో లభిస్తున్నాయి.

ప్రపంచానికి తెలిసిన అతి తేలికైన, సున్నితమైన సంరక్షతను తెలిసికొవడానికి మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాము.




MAA (S) LRDF 1A TEL 85

BLACK

# సుందరవనసీమలో శ్రీ చక్ర పెరుమాళ్ళస్వామి

"యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజమ్యహమ్

మతాచార క్షీణావస్థ యందు అధర్మం ప్రబలినప్పుడు నేను నన్ను సృజియించుకొను చున్నాను జ్ఞాన యోగమందు చక్రధారి ప్రబోధితానికి నిదర్శనంగా సుందర ఉద్యానవన తీర ప్రాంతంలో నెలకొనియున్న శ్రీ చక్ర పెరుమాళ్ళ స్వామి ఆలయం ఆంధ్రావనిలో గల అరుదైన ఆలయాలలో నొకటి మనం నిత్యం కొలిచే హరిచందన గోత్రేందుడు శంఖ చక్రధర రాజస్య నేత్రాబ్జుడు ప్రియా సంగమ శ్రీధరుడు నారాయణుడు ప్రతిరూపమే శ్రీ చక్రపెరుమాళ్ళ స్వామి నిజ స్వరూపం

నాటి నుండి నేటి వరకూ ఇతిహాస చారిత్రక సంఘటనలలో తన ప్రత్యేకతను నిలుపుకుంది కళింగసీమ అరుదైన సూర్యదేవాలయాలు కూర్మనాథ దేవాలయం ఈ కళింగసీమలోనే కాంచగలం వాటికి దీటైన ధాటి లోనిదే శ్రీ చక్ర పెరుమాళ్ళ స్వామి ఆలయం ఉద్యాన వనములతో ఈడి కొబ్బరి మున్నగు పచ్చని తోటల సుందర ప్రకృతి శోభతో ప్రకాశించే ప్రశాంత సముద్ర తీరంలో నెలకొని యున్నదీ దేవాలయం


శ్రీ చక్రపెరుమాళ్ళ స్వామి భూదేవి శ్రీదేవి మూల విగ్రహాలు

## స్వామి ఆవిర్భవ, ఆలయనిర్మాణ గాథ

నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః
మాయయా పహృత జ్ఞానా అసురం భావ మాశ్రితాః"

నాదగు మాయచే జ్ఞానహీనులై, మూఢులైన మానవాధములు అసుర భావాలతో హేయ కృత్యములు చేయుదురు"

క్రీ శకం 16వ శతాబ్దంలో కొందరు డచ్ వ్యాపారస్తులు ఎక్కడినుండో దొంగతనంగా పంచలోహలతో చెయ్యబడిన స్వామివారి మూల విరాట్ శ్రీదేవి భూదేవి విగ్రహాలను తమ వాణిజ్య నౌకలో తీసుకుని పోతుండగా అకస్మాత్తుగా ఈ తీర ప్రాంతంలో నౌక కదలిక నిలిచిపోయిందట నాటి రాత్రి నావికుని కలలో స్వామి సాక్షాత్కరించి తనకు నచ్చిన ఆ ప్రాంతంలో తనను వదిలివేయమని ఆదేశించగా స్వామి అభీష్టం ఆ అసుర హృదయులు నెరవేర్చి, నౌక కదలడంతో ఆనందంగా వెడలిపోయిరుట

తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్
దదామి బుద్ధి యోగం తం యేన మాముపయాంతి తే

అలంకార శోభితులైన విగ్రహమూర్తులు


స్వామివారి గరుడ వాహనం




కామదహనోత్సవం



దోలారోహణం. తిరువీది సేవ

నన్ను ప్రేమతో సేవించుట యందు నిరంతరాసక్తులై యుందు వారికి నన్ను చేరుట కుపయోగపడు బుద్ధిని ఒసంగుదును

స్వామి ప్రవచనములకు అనుగుణంగా బెజ్జిపుట్టుగ గ్రామం లోని ఒక కళింగ వైష్ణవ భక్తుడు దేవేరులతో కూడిన చక్రధారి పంచలోహ విగ్రహములను కనుగొని పవిత్ర స్థలంలో ప్రతిష్ఠించి పూజాది కార్యక్రమములు మొదలిడ్చి చరితార్థుడయ్యెను కాలక్రమేణా 1945-50 ప్రాంతంలో శ్రీయుతులు పొందల క్రిష్ణమ్మ నాయుడు ఆలయ నిర్మాణాది కార్యక్రమములు నిర్వహించి ధర్మకర్తయై పునీతుడయ్యెను ప్రస్తుతం వారి వంశస్థులు శ్రీ రామస్వామి నాయుడు ధర్మకర్తగా ఎండోమెంట్సు వారి పర్యవేక్షణలో ఆలయాన్ని వివిధ రీతులలో అభివృద్ధి చేస్తున్నారు

## ఆదాయ వ్యయాలు

మారుమూల గ్రామంలో గల ఈ దేవాలయానికి భక్తులొసగే దానాలే మణిమాణిక్యాలు సుమారు 40 ఎకరాలు భూకామందైన ఈ భూనాథునికి ఉత్సవ రోజులలో భక్తులొసగే భూరి విరాళాలు ఆలయ అభివృద్ధికి తగిన రీతులలో తోడ్పడుతున్నాయి దేవాలయ ప్రాంగణంలో నాట్యపీఠం నిర్మింపబడింది కళ్యాణ మండపం నిర్మాణం ప్రణాళికలలో వుంది

## ఉత్సవ రోజులు

ఫాల్గుణ శుద్ధ పాడ్యమి మొదలు పౌర్ణమి తదుపరి పాడ్యమి వరకూ జరిగే ఉత్సవం ఈ దేవాలయ విశేష ఆకర్షణ నాడు నిత్య పూజలు తిరువీధి ఉత్సవం వసంతోత్సవం దోలారోహణం కామదహనోత్సవం భక్తులకు విందు చేస్తాయి

యస్యసర్వే సమారంభాః కామ సంకల్ప వర్జితాః
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణాం తమాహుః పండితం బుధాః

లోకంలో ప్రతివారూ కామ సంకల్పిత కోర్కెలతో కీర్తి హీనుడుగుట కన్నా జ్ఞానాగ్నిచే విషయ వాంఛలను వర్జించి కామ రహితుడై ప్రకాశింపవలెనని నాటి గీతాచార్యుని భాష్యమే కామదహనోత్సవం

సాక్షాత్ చక్రధారే కామదహనం గావించుతున్నప్పుడు అల్పులం మనమెంత? అన్న ఆత్మావలోక పరిశీలనకే ఆర్యులేర్పరిచిన కామదహన మహోత్సవం మనకందరకూ ఆచరణదాయకం గంధం చెక్కలు కొబ్బరి మట్టలతో చితి నేర్పరచి మూల విరాట్ విగ్రహాల ప్రదక్షిణాంతరం జరిపే దహనోత్సవమే కామదహనం

ఇంకా వైశాఖ మాసంలో జరిగే కళ్యాణోత్సవం ఉగాదినాటి పంచాంగ శ్రవణం చందనోత్సవం శ్రీకృష్ణాష్టమి నాటి విశేషార్చనలు ఈ ఆలయ ప్రత్యేకతలు

గర్భగుడి



## రవాణా సౌకర్యాలు

శ్రీకాకుళం జిల్లా సోంపేట మండలం నుండి బెజ్జిపుట్టుగ గ్రామానికి బస్సు సౌకర్యాలున్నాయి శ్రీ చక్ర పెరుమాళ్ళు స్వామి వారిని ప్రక్కనే గల కవిటి గ్రామంలో వెలసిన స్త్రీ శక్తి స్వరూపిణి చింతామణి అమ్మవారిని ప్రతి నిత్యం భక్తులు సందర్శిస్తారు

ఉత్సవ రోజులలో ప్రత్యేక రవాణా సౌకర్యాలు యేర్పాటు గావింపబడతాయి

## ఉపశ్రుతి

సుందర ప్రకృతి ఒడిలో ఇమిడిన ఇటువంటి అరుదైన ఆలయాభివృద్ధికి టి టి డి వారి నుండి ఎండోమెంట్సు వారి నుండి పూర్తి సహకారాలను ఆశిస్తున్న ధర్మకర్తృత్వ మండలి వారి అభీష్టం గమనింప దగ్గది

విషయ సేకరణకు సహకరించిన ధర్మకర్త శ్రీ రామస్వామి నాయుడు ఎండోమెంట్సు ఇన్స్పెక్టర్ శ్రీ సత్తి రాజులకు కృతజ్ఞతలు

వ్యాసం ఫోటోలు
నిడమర్తి ఆదిలక్ష్మి ప్రసాద్

# సినిమా

చిత్రీకరణ జరపని మేల్ కవటి అనే గ్రామంలో అరవై ఎకరాల పొలం మధ్య ఉన్న ఓ ఇంటిని ఈ చిత్రనాయిక భానుప్రియ గృహంగా మలచి షూటింగ్ జరిపారు సి బి ఐ ఆఫీసర్ విజయ్‌గా కృష్ణ, ఆయన కుమారుడుగా ఆయన ద్వితీయ పుత్రుడు మహేష్‌తో పాటు ఓ నవ్వించే పాత్రలో స్నేహితురాలిగా మహేష్ సోదరి బేబీ ప్రియ ఇన్స్‌పెక్టర్‌గా రజని ఇతర పాత్రలను రంగనాథ్ చరణరాజ్, గిరిబాబు - త్యాగరాజు మిక్కిలినేని మాడా అన్నపూర్ణ మహిజ నిర్వహించారు పరుచూరి సోదరులు కథ మాటలు సమకూర్చారు బప్పీలహరి స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు పుష్పాల గోపీకృష్ణ ఛాయ బి చలం శిల్పం శీను నృత్యాలు సాహుల్ సాహసాలు ఒ ఎస్ ఆర్ ఆంజనేయులు



'పెళ్ళికాని ఇల్లాలు' లో వరలక్ష్మి

## 'పెళ్ళి కాని ఇల్లాలు'

టైటిల్ బట్టే ఊహించుకో వచ్చు ఇదొక విశిష్టమైన కథ అని వివిధ మనస్తత్వాలు గల విచిత్రమైన పాత్రలతో హాస్య శృంగార రసాలు సమపాళ్ళలో మేళవించి రూపొందించాం విజయకృష్ణ అనే చలాకీ హీరోను పరిచయం చేస్తున్నాం అన్నారు కేదారి సూరిబాబు ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో ముంగర లక్ష్మీ నరసమ్మ నిర్మించే హనుమాన్ ఆర్ట్ పిక్చర్స్ వారి పై చిత్రంలో వరలక్ష్మి రాళ్ళపల్లి, మాడా నర్రా వెంకటేశ్వరరావు పి ఆర్ వరలక్ష్మి జయవిజయ శైలజ శ్రీలక్ష్మి నళినీకాంత్ సి హెచ్ వెంకట్రాజు పాత్రధారులు రాజ్‌కోటి స్వరకల్పనలో సి నారాయణ రెడ్డి గీతాలు రాశారు పి లక్ష్మణ్ ఛాయ బాబూ రమేష్ సాహసాలు రవి నృత్యాలు గున్నం మంగయ్య నాయుడు- కేశవరావు నిర్మాణతతో కొరెడ్డి మహేశ్వరరావు సమర్పించే ఈ చిత్రానికి పి వి మోహన్‌రావు ప్రొడక్షన్ కంట్రోలర్ బలే జగన్మోహన రావు జయమంగళ కొండలరావు సహ నిర్మాతలు

## హీరో కృష్ణ దర్శకత్వంలో శంఖారావం

హీరో కృష్ణ చక్కని నటుడేకాక ఉత్తమ దర్శకుడుగా కూడా నిరూపించు కున్నారు "సింహాసనం చిత్రం ద్వారా ఒక పథకం ప్రకారం చిత్రీకరణ జరుపుతారు గనుకే ఎక్కడా కన్‌ఫ్యూషన్ ఉండదు టెన్షన్ ఉండదు ఆర్టిస్టులు ఎంతో కాన్‌సెన్‌ట్రేట్ చేసి నటించడానికి వీలవుతుంది పిక్చర్‌లో ఎంతో క్వాలిటీ ఉంటుంది ఒక భారీ చిత్రాన్ని 25 రోజుల్లో పూర్తి చేయగలిగారంటే మాటలు కాదు ఊటీలో శంఖారావం చిత్రంలో పాల్గొని వచ్చిన నటీనటులు చాలా మంది ఈ విషయం గురించే చెప్పారు కృష్ణ కూర్పు దర్శకత్వ బాధ్యతలు వహిస్తూ సమర్పించే పద్మావతీ ఫిలిమ్స్ వారి పై చిత్రానికి ఊటీలో ఇంతవరకు ఎవరూ



"శంఖారావం"లో భా

# శేషాలు

**_జి.వి.జి.**

సంయుక్త దర్శకత్వం జ్యోతిప్రసాద్ ప్రొడక్షన్‌తో యు సూర్యనారాయణ బాబు నిర్మాత

## రామవేంద్రరావు, చిరంజీవి కాంబినేషన్‌లో దేవీ ఫిలిమ్ ప్రొడక్షన్స్ 6వ చిత్రం

జూన్ 7 నుంచి 20 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది జూలై 1–10 ఆగస్టు 1–10 సెప్టెంబర్ 21–30 షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు దేవీ ఫిలిమ్ ప్రొడక్షన్స్ అధినేత కె దేవీవరప్రసాద్ ఈయన నిర్మిస్తున్న చిత్రంలో మంచి దొంగగా చిరంజీవి అతన్ని ప్రేమించి సజ్జనుడుగా చక్కదిద్దే పోలీస్ ఇన్‌స్పెక్టర్‌గా



ఆంధ్రసచిత్ర వార పత్రికని ఆసక్తితో చదువుతున్న నటి శ్రీదేవి.

విజయశాంతి మరో విశిష్టమైన భూమికలో సుహాసిని ఇంకా – మోహన్‌బాబు జగ్గయ్య రావుగోపాలరావు సత్యనారాయణ రంగనాథ్ చలపతిరావు రాళ్ళపల్లి వేలు నర్రా చిట్టిబాబు శుభ నిర్మల, అన్నపూర్ణ కుయిలీ నటిస్తున్నారు ఎం వి ఎస్ హరనాథరావు కథ మాటలు సమకూర్చారు చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి జొన్నవిత్తుల గీతాలు రాశారు కె ఎస్ ప్రకాష్ ఛాయ భాస్కరరాజు శిల్పం రఘు నృత్యాలు విజయన్ సాహసాలు జె ఆనందకుమార్ సంయుక్త దర్శకత్వం సునీల్‌వర్మ సహకార దర్శకత్వం సత్యం ప్రొడక్షన్ కె బాబ్జీ నిర్వహణతో కె రాఘవేంద్రరావు దర్శకుడు

## మహాలక్ష్మి ఫిలిమ్ కంబైన్స్ "తోబుట్టువులు

దేనినైనా బుద్ధి బలంతో సాధించవచ్చని ఒకరు బాహు బలంతో సాధించవచ్చని ఒకరు ధన బలంతో సాధించ వచ్చని ఒకరు ఆశిస్తారు చిత్రంలోని ముగ్గురు యువకులు తప్పు త్రోవలో పయనించే ఈ సమాజంలో ఈ మూడు బలాలూ ఏకమై తోబుట్టువులుగా వ్యవహరిస్తే మానవతా విలువలతో సంఘం సురక్షితంగా ఉంటుందన్నదే ఈ చిత్ర సారాంశం షూటింగ్ ముగించాం అన్నారు ఎ మోహన్ గాంధి ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఆర్ మహాలక్ష్మీరావు నిర్మించిన మహాలక్ష్మి ఫిలిమ్ కంబైన్స్ వారి తోబుట్టువులు చిత్రంలో అర్జున్ రాధిక రఘువరన్ శరణ్య రాళ్ళపల్లి వేలు డిస్కోశాంతి ఒక విశిష్టమైన పాత్రలో మురళీ మోహన్ నటించారు ఆకెళ్ళ పరుచూరి సోదరులు చక్రవర్తి ప్రసాద్‌బాబు భాస్కరరాజు సాయికృష్ణ సురేష్ కుమార్ రాధాకృష్ణ బత్తుల నాగేశ్వరరావు మురళీకృష్ణ గౌతంరాజు ప్రభృత సాంకేతిక వర్గంతో నంగునూరు శ్రీనివాసరావు ఆధ్వర్యం వహించారు



సుప్రియ, కృష్ణ



రాధామిత్రమండలి 'చైతన్య రథం' విజయోత్సవ సందర్భంగా విజయవాడలో జరిగిన అభినందన సభలో చిత్ర దర్శకులు శ్రీ ధవళ సత్యం ఉపన్యసిస్తున్న దృశ్యం చిత్ర నిర్మాత శ్రీమతి వంగవీటి రత్నకుమారి, సమర్పకులు శ్రీ వంగవీటి మోహన రంగారావు (శాసనసభ్యులు) సభకి అధ్యక్షత వహించిన శ్రీ తుర్లపాటి కుటుంబరావు గార్లని చిత్రంలో చూడవచ్చు

## "సోవియెట్ రష్యా వెళ్తున్న నర్తనశాల"

25 సంవత్సరాలక్రితం రాజ్యం పిక్చర్స్‌వారు నిర్మించిన నర్తనశాల జూలై 5 న ప్రారంభం అయే సోవియెట్ రష్యా చలన చిత్రోత్సవాలకు ప్రభుత్వంచే ఎన్నికైనది శ్రీమతి లక్ష్మీరాజ్యం - శ్రీధర రావు నిర్మించిన యీ చిత్రానికి దర్శకత్వం కమలాకర కామేశ్వరరావు లోగడ నేషనల్ అవార్డులు, ఇంటర్నేషనల్ అవార్డులు ఎన్నో అందుకొని - రజతోత్సవాలు జరుపుకొన్న యీ చిత్రం రష్యా ఉత్సవాలకు వెళ్తున్న సందర్భంగా నిర్మాత శ్రీధరరావు రష్యా వెళ్తున్నట్లు తెలుస్తోంది

* * * * * * * * *

## వివాహం

ప్రముఖ నటి శ్రీమతి లక్ష్మీరాజ్యం - నిర్మాత శ్రీధరరావు దంపతులు తమ మేనల్లుడు, శ్రుతిలయలు నిర్మాత కరుణాకర్ సోదరుడు అయిన చిరంజీవి

## సినిమా

మల్లికార్జునరావుకు సౌభాగ్యవతి భారతి (శ్రీ కె సుబ్రహ్మణ్యం కుమార్తెని యిచ్చి యిటీవల మద్రాసులో వైభవంగా వివాహం చేశారు

ఈ వివాహ మహోత్సవానికి జస్టిస్ మోహన్, శ్రీ ఎల్ వి రామయ్య, మంత్రి శ్రీ శేషశైనారెడ్డి, సవేరా శ్రీ ఎ వి కె రెడ్డి, అంజలీ ఆదినారాయణరావు, జగ్గయ్య దంపతులు, శ్రీ సత్యనారాయణ, శ్రీమతి కె విశ్వనాథ్, శ్రీ నరేష్, శ్రీ విజిద, దర్శకుడు విస్సు, సినిమా రంగానికి చెందిన పలువురు ప్రముఖులు, పంపిణీదారులు విచ్చేసి వధువరులను ఆశీర్వదించారు చిరంజీవి షణ్ముఖ శ్రీనివాస్ గిటారు వినిపించారు

## "ఝాన్సీరాణి" జూలైలో

"రచయిత సత్యానంద్‌కు డైరెక్టర్‌గా మంచి పేరు తెస్తుందీ చిత్రం జూలై రెండవ వారంలో రిలీజ్, అన్నారు శ్రీ రాజలక్ష్మి ఆర్ట్స్ పిక్చర్స్ అధినేత మిద్దే 'రామారావు ఈయన నిర్మించిన పై చిత్రంలో మహిళాభ్యుదయానికి పాటుపడే ఝాన్సీరాణిగా భానుప్రియ, ఇతర పాత్రలలో రాజేంద్రప్రసాద్, దగ్గుబాటి రాజా, పూర్ణిమ, కోట శ్రీనివాసరావు, కాంతారావు, వేలు, వీరభద్రరావు, పి జె శర్మ, ఏచూరి, అరుణ, రాజ్యలక్ష్మి, శ్రీలక్ష్మి నటించారు. మల్లాది వెంకట కృష్ణమూర్తి నవల మిస్టర్ వి' ఆధారంగా సత్యానంద్ సంభాషణలు సమకూర్చి, ప్రతిభావంతంగా దర్శకత్వం నెఱపిన, ఈ సంచలనాత్మక చిత్రానికి చక్రవర్తి సంగీతం, డి. డి ప్రసాద్ ఛాయ, శాయికుమార్ శిల్పం, సాహుల్ సాహసాలు, సలీం- శివశంకర్ నృత్యాలు, ఎస్ వెంకటేశ్వరరావు- ఉదయ్- బాడ్జీ ప్రొడక్షన్స్, వై కాశీ విశ్వనాథ్ సహకార దర్శకత్వం, డి వెంకటరత్నం కూర్పు నిర్వహించారు.

ఇటీవల మద్రాసులో 'కళాసాగర్' 15 వ వార్షికోత్సవ సందర్భంగా ప్రసిద్ధ నటి, పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి వైజయంతిమాల ఉత్తమ నేపథ్య గాయనిగా (స్వాతిముత్యం) 'కళాసాగర్' ఫిలిం అవార్డును శ్రీమతి ఎస్ జానకికి అందజేస్తున్న దృశ్యం





చిత్రసీమ సంక్షోభంలో పడింది – అది తేరుకునే లోపు ఖాళీగా వుండట మెందుకని పెళ్లి చేసుకోవాలను కుంటున్నాను పంతులుగారూ!

## కోటారెడ్డి దర్శకత్వంలో హరీన్ చక్రవర్తి

"హైదరాబాద్‌లో జూన్ నుంచి షూటింగ్,' అన్నారు ఎం ఎస్ కోటారెడ్డి ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఖాదిర్, ఆర్ నరసింహారావు నిర్మించే లిబర్టీ పిక్చర్స్ వారి చిత్రంలో హరీన్ చక్రవర్తి, సాగరిక, సితార, నూతన్‌ప్రసాద్, వేలు, బెనర్జీ, లక్ష్మణ్ ప్రభృత నటవర్గం జలీల్ కథకు కాశీ విశ్వనాథ్ సంభాషణలకర్త, వాసూరావు సంగీతం, శాంతి బాబు ప్రొడక్షన్, కె రామగోపాలరెడ్డి కూర్పుతో వి అనిల్‌కుమార్ సమర్పించే ఈ చిత్రానికి ఉప్పుల నారాయణరెడ్డి సహనిర్మాత

## జూలైలో "ఖైదీ నాగమ్మ"

"ఒక సర్పం ప్రముఖ పాత్ర వహించే మా చిత్రం ఇంత కాలానికి సెన్సార్ వారి పిడికిలిలోంచి ఎ సర్టిఫికేట్‌తో బయట పడింది," అన్నారు పి. చంద్రశేఖర రెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో విజయ రాఘవేంద్ర మూవీస్ అధినేత సహదేవ వెంకటేశ్వరరావు నిర్మించిన పై చిత్రంలో మాధవి, శరత్‌బాబు (ద్విపాత్రలు), వేలు, సాక్షి రంగారావు, సిలోన్ మనోహర్, రాజశేఖర రెడ్డి, ప్రతాప్‌రాజ్, జయశ్రీ, అనూరాధ, లక్ష్మి, జయవిజయ పాల్గొన్నారు. శ్రీమతి రాధికారావ్ కథకు పూసల సంభాషణల కర్త. రాజ్- కోటి సంగీతం, ఎన్. ఎస్. రాజు ఛాయ, లీలాకృష్ణ శిల్పం, మోహన్ ప్రొడక్షన్, వేమూరి రవి కూర్పు నిర్వహించారు

## కళాప్రపూర్ణ దాసరి రూపకల్పన "ప్రజా ప్రతినిధి"లో కృష్ణ

"అనుదినం ప్రజల ముందుండి వారికి సేవ చేయవలసిన వారా, లేక ప్రజల చేత ఎన్నుకోబడ్డాక ఎన్నికల ముందు చేసిన ప్రమాణాలను విస్మరించి సింహాసనాన్ని అధిష్టించడంతో తమ బాధ్యత తీరిందనుకునే స్వార్థపరులా? అసలు ప్రజా ప్రతినిధులంటే ఎవరు- అనే అంశం చుట్టూ అల్లబడిన రాజకీయ కథ. జూన్ 20 నుంచి 30 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది. రెండవ షెడ్యూల్ జూలై 1 నుంచి 10 వరకు విజయవాడలో. ఆఖరి షెడ్యూల్ హైదరాబాద్‌లో జూలై 20 నుంచి 31 వరకు. ఈ షెడ్యూల్‌లో పతాక సన్నివేశాలు నవ్య పంథాలో చిత్రీకరింప బడతాయి," అన్నారు డాక్టర్ దాసరి నారాయణరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు సమకూర్చి స్వీయ దర్శకత్వంలో సమర్పించే చిత్ర సౌభాగ్య చిత్ర వారి "ప్రజా ప్రతినిధి" చిత్రంలో నిజాయితీ గల పోలీస్ అధికారిగా కృష్ణ, జయసుధ, భానుప్రియ, ప్రభాకర రెడ్డి, గుమ్మడి, కోట శ్రీనివాసరావు, రమాప్రభ, త్యాగరాజు, నాగేష్ బాబు, వేలు, గోకిన రామారావు, గృహ శాఖామాత్యులుగా మోహన్‌బాబు నటిస్తున్నారు. చక్రవర్తి, శరత్‌బాబు, హరికృష్ణంరాజు, సలీమ్, సూరపనేని రాధాకృష్ణ, ఉప్పలపాటి సత్యనారాయణ, గోపి, దొండపాటి శ్రీనివాస్ ప్రభృత సాంకేతిక వర్గంతో కొడాలి బోసుబాబు నిర్మాత.

## వి. మధుసూదనరావు చిత్రం "ఆత్మకథ"

"మహేష్‌భట్ కథకుడు జూలై 25 నుంచి ఆగస్టు 10, సెప్టెంబర్ 1 నుంచి 15 వరకు షెడ్యూల్స్ ప్లాన్ చేశాం," అన్నారు వి. మధుసూదనరావు ఈయన స్వీయ దర్శకత్వంలో నిర్మించే శ్వేత ఫిలిమ్స్ వారి "ఆత్మకథ" చిత్రంలో మోహన్, కుష్బూ, జయసుధ, శరత్‌బాబు, శుభలేఖ సుధాకర్‌తో పాటు మధు ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లోని కళాకారులు పాల్గొంటారు. ఆత్రేయ సంభాషణల కర్త. చక్రవర్తి సంగీత దర్శకుడు.

## సినిమా

### ఏ. ఎస్. ఆర్ట్స్ మూవీస్

"నెరకొట్టి- అనే విజయవంతమైన మలయాళ చిత్రం ఆధారం, అన్నారు కె రంగారావు ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో సంగశెట్టి దశరథ్ సమర్పించే ఏ ఎస్ ఆర్ట్స్ మూవీస్ చిత్రంలో డాక్టర్ రాజశేఖర్, జీవిత, మేనక, చిత్ర, మలయాళ నటుడు రమేష్ గోవింద్ ఆదిగా గలవారు పాల్గొంటున్నారు ఆత్రేయ మాటలు రాశారు రాజ్‌కోటి స్వరకల్పనలో ఆత్రేయ, గురుచరణ్ గీతాలు రాశారు ఎం వి రఘు ఛాయ, సూర్యకుమార్ శిల్పం, శివ సుబ్రహ్మణ్యం నృత్యాలు, కె బాపురెడ్డి సహకార దర్శకత్వం బాబూరావు కూర్పుతో జి భిక్షపతి సహ నిర్మాత వి శ్రీనివాసరావు నిర్మాత

### విడుదలకు సిద్ధమవుతోన్న "విజేత విక్రమ్"

'వెంకటేష్, ఫరా ముచ్చటైన జంటగా కనిపిస్తారు వెంకటేశ్ పరిణతి పొందిన హీరో అని అందరి ప్రశంసలు అందుకుంటారు, అన్నారు రవిచంద్ర ఈయన దర్శకత్వంలో డాక్టర్ ఎం తిరుపతి రెడ్డి సమర్పించే సంయుక్తా మూవీస్ వారి ఫై చిత్రంలో రావు గోపాలరావు, రంగనాథ్, సుదాకర్, నూతన్‌ప్రసాద్, వీరభద్రరావు, రాళ్ళపల్లి, వంకాయల, పూర్ణిమ, వై విజయ, సుమిత్ర తెర ముందు, సత్యానంద్, చక్రవర్తి, వేటూరి వెన్నెలగంటి, మహీధర్, రామచంద్రసింగ్, విక్రమ్ ధర్మా, మాధవరావు, రంగవరప్రసాద్, రఘురాం, కోటగిరి వెంకటేశ్వరరావు తెర వెనుక కృషి చేశారు కె నరసారెడ్డి నిర్మాత ☐

"అల్లరి పాండవులు"లో సుమిత్ర



# ఆంధ్రసచిత్రవారపత్రిక



పాఠకులకు

## శతచిత్ర నటి సుమలత సమాధానాలు!

పై వారమే ప్రారంభం!

తెలుగు సినిమా ప్రేక్షకుల అదరాభిమానాలని విశేషంగా చూరగొన్న శత చిత్ర నటి సుమలత ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారని తెలియచేయటానికి సంతోషిస్తున్నాము త్వరలో ప్రారంభం కాబోయే ఈ శీర్షికకి పాఠకులు అర్థవంతమైన ప్రశ్నలని మాత్రమే పంప గోరుతున్నాము వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో ప్రతివారం సుమలత ఎన్నిక చేసిన ఉత్తమ ప్రశ్నని పంపిన వారికి ఆటోగ్రాఫ్‌తో ఉన్న ఆమె అందమైన ఫోటో బహుమతిగా లభిస్తుంది ప్రశ్నలు పంపేవారు తమ ప్రశ్నని ఈ కింది కూపన్‌లో స్పష్టంగా సిరాతో లేదా బాల్ పాయింట్ పెన్‌తో రాసి తమపేరు, పూర్తి చిరునామాతో - సహా " సుమలత సమాధానాలు " శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ -520003 అన్న చిరునామాకి పంపాలి ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాయాలి. విడిగా రాసి పంపినవి పరిశీలింప బడవు.

**పాఠకులు** ఈ అవకాశాన్ని ఉత్సాహంతో వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము

-------- కూపన్ --------

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న ..........................................

..........................................

..........................................

పంపినవారి పేరు ..........................................

పూర్తి చిరునామా ..........................................

# అభిమాన తారలపై అభిప్రాయం

దాసరి 'బ్రహ్మముడి' చిత్రం ద్వారా పరిచయమైన రజని నా అభిమాన నటి చక్కని పలువరుసతో కల్మషం ఎరుగని, అమాయకత గోచరించే చిరునగవులతో చూపరులను కట్టి మంత్రముగ్ధులను కావిస్తుంది అందాల నటి రజని ఈ మధ్యన విడుదలైన మజ్ను', 'కలెక్టరుగారబ్బాయి',



'తాయారమ్మ - తాండవకృష్ణ', 'చిన్నారి దేవత' మొదలైన చిత్రాల్లో మంచి నటనను ప్రదర్శించి, అగ్రశ్రేణి నటీమణుల్లో ఏ-1 స్థాయికి చేరుకోబోతున్నది అలాగే రాజో యే రాము, మరణ మందిరం (అనువాదం), గుండమ్మగారి కృష్ణులు, అగ్నిపుత్రుడు వంటి నూతన చిత్రాల్లో విభిన్నమైన పలు పాత్రలలో, ఆయా పాత్రలకు ప్రాణం పోసి ప్రాణప్రతిష్ఠ గావించగలదని, అటు క్లాస్, మాస్‌ను అలరించే విధంగా అన్ని రకాల పాత్రలను అవధులెరిగి పోషిస్తే చూడాలని, అభిమానిగా ఆశిస్తున్నాను

-కొల్లి శివరామిరెడ్డి, నందివెలుగు

★ ★ ★

సినీ వినీలాకాశంలో వెలుగొందే తారలలో కల్యాణ చక్రవర్తి ఒకరు తెలుగు పరిశ్రమలో కళాత్మక నటులలో వీరు ఒకరని చెప్పవచ్చు అతి తక్కువ కాలంలోనే తన నటనా వైదుష్యంతో సినీ ప్రేక్షకుల హృదయాలలో ముద్రవేసుకున్నారు. తెలుగు చిత్ర పరిశ్రమలో చిరుజ్యోతివలె దూసుకుపోతు అందరి మన్ననలను పొందుతూ, ఎంతో పేరు ప్రఖ్యాతులు తెచ్చుకొని, సమర్థతతో సహజత్వాన్ని చూపగల నైపుణ్యత కలిగిన యువకిశోర చక్రవర్తులలో



కల్యాణ చక్రవర్తి ఒకరని చెప్పవచ్చు.

తన నటనలోని భావప్రకటన సామర్థ్యము ప్రదర్శించుట యందు సిద్ధహస్తుడైన కల్యాణ చక్రవర్తి సూపర్ స్టార్ కావాలని నా కోరిక. కేవలం మాస్ చిత్రాలనే గాక మంచి కథాబలం గల చిత్రాలలో, సెంటిమెంట్‌గల చిత్రాలలో నటించాలని అభిమానిగా నా కోరిక

అత్తగారు స్వాగతం" నుంచి లాయర్ భారతీదేవి వంటి హిట్ చిత్రాలు ఆయన నటనకు తార్కాణాలు ఏ నటుడు పోషించలేని విచిత్రమైన పాత్రలను పోషించి ఉత్తమ నటుడిగా ప్రజానీకం మనస్సులో ముద్ర వేసుకోవాలని, జాతీయ అవార్డులు రావాలని అభిమానిగా నా కోరిక

యం. రాంబాబు, తిరుపతి

★ ★ ★

సినీ రంగుల జగత్తులో "పునాదిరాళ్ళు"తో తన నటనా జీవితాన్ని ప్రారంభించి అనేక జయాపజయాలను చిరునవ్వుతో స్వీకరిస్తూ, అత్యున్నత శిఖరాల నధిరోహించబోతున్న నేటి వెండితెర మేటి హీరో అనిపించుకుంటున్న 'సుప్రీం' చిరంజీవి నా అభిమాన హీరో అని చెప్పడానికి గర్విస్తున్నాను శుభలేఖ, విజేత, చిత్రాలలో 'వండర్‌ఫుల్' హీరోగా, ఖైదీలో యాక్షన్ హీరోగా, 'చంటబ్బాయి' లో 'కామెడీ కింగ్'గా, ఇకనిన్నటి 'ఆరాధన' చిత్రంలో 'సభూతో నభవిష్యతి'గా నటించిన చిరంజీవి అంటే పాలుకారే పసిపాపలనుండి, ముదివగుల వరకు



అభిమానిస్తారనడంలో సందేహంలేదు. నవరసాలను అవలీలగా పోషించే చిరంజీవి 'కళాతపస్వి' విశ్వనాథ్ దర్శకత్వంలో రూపొందుతున్న 'స్వయంకృషి' చిత్రం అతనిలోని నటనాపటిమను మరింత వెలికితీసి కీర్తి శిఖరానికి మరో మెట్టు ఎక్కించగలదని నా ఆకాంక్ష. చిరంజీవి గారికి నేనిచ్చే చిరు సలహా ఏమిటంటే : నేటి రాజకీయాలకు దూరంగా ఉంటూ, కె. బాలచందర్, విశ్వనాథ్, భారతీరాజా వంటిదర్శకుల దర్శకత్వంలో కనీసం సంవత్సరానికి ఒక చిత్రమయినా చెయ్యమని, డాక్టరు పాత్రను పోషిస్తే చూడాలని అభిమానిగా నా కోరిక.

-కె. లలితారాణి, కాశీబుగ్గ

★ ★ ★

నలభై సంవత్సరాలు సినీ జగత్తునేలి నేటికి కూడా ఎవర్‌గ్రీన్ హీరో'గా నిలిచిన 'నటసామ్రాట్' అక్కినేని నాగేశ్వరరావ్ నా అభిమాన నటుడు.

అక్కినేని నటనా చాతుర్యం, డైలాగ్ డెలివరీ అమోఘంగావుంటుంది. నాటి బాటసారి, దేవదాసు, డాక్టర్ చక్రవర్తి, మంచి మనసులు, ఇల్లరికం, ఆత్మబలం, మరో ప్రపంచం, అర్థాంగి, భార్యభర్తలు మొదలుకొని నేటి ప్రేమాభిషేకం బహుదూరపు బాటసారి, ఆదిదంపతులు, అనుబంధం, మేఘసందేశం వరకు అతని నటనా చాతుర్యం అత్యుత్తమంగా నిలిచింది సాంఘిక సినిమాలలోనే కాక పౌరాణిక చిత్రాలలో కూడా



నటించి మెప్పించగలరని మాయాబజార్, చాణక్య చంద్రగుప్త వంటి సినిమాలు నిరూపించాయి

'స్టెప్‌లు' అనే పదానికి జన్మనిచ్చిన ఘనత అక్కినేనికే దక్కుతుంది అక్కినేని నటనకు ప్రాధాన్యత నిచ్చే సినిమాలలోను. 'కళాతపస్వి' విశ్వనాథ్ గారి దర్శకత్వంలో మరలా నటించాలని నా కోరిక

-షేక్ ఇస్మాయిల్ షరీఫ్, అక్కయ్యపాలెం, విశాఖపట్నం

★ ★ ★

అనతి కాలంలో అనితరసాధ్యమైన ప్రతిభ ప్రదర్శించి అశేష ఆంధ్రుల అభిమానమును చూరగొన్న అగ్రశ్రేణి నటి అభినేత్రి విజయశాంతి నా అభిమాన నాయిక. నాటి 'కిలాడి కృష్ణుడు' నుండి నేటి 'పడమటి సంధ్యారాగం' వరకు ఎన్నో ఉత్తమ పాత్రలకు ప్రాణ ప్రతిష్ఠ చేసిన గొప్ప 'కళాజ్యోతి' విజయశాంతి, తెలుగు సినీ చరిత్రలో మైలురాయిగా నిలిచిన 'ప్రతిఘటన' చిత్రానికిగాను రాష్ట్ర ప్రభుత్వ అవార్డు విజేత విజయశాంతి. 'నేటి భారతం', 'ప్రతిఘటన' మరియు 'అరుణ కిరణం' మున్నగు చిత్రాలు ఆమె నటనా ప్రావీణ్యానికి ప్రతిబింబాలు.



రెండుసార్లు 'సూపర్‌స్టార్'గా ఎన్నికై ఇప్పుడు 'గోల్డ్‌స్టార్' అయిన విజయశాంతి మున్ముందు మంచి చిత్రాలలో నటించి జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో అవార్డులు పొందాలన్నదే నా అభిలాష

చక్రధర్, న్యూనల్లకుంట, హైదరాబాద్ □

# “నా కొడుకు పైసదువు సదవాలన్నప్పుడు, నేనాడ్ని సదివించగలిగినందుకు నాకెంతో సంతోసంగుంది... ఇదంతా అద్భుతమైన కొత్త ఎవసాయం, జైకిసాన్ ఎరువుల పనితనం వల్లే!”




**ఆధునిక వ్యవసాయ పద్ధతులకు**
**జైకిసాన్ తోడైతే—బంగారు పంట**

మీ భూమి నుంచి అత్యధికంగా దిగుబడి పొందాలి అంటే ఆధునిక వ్యవసాయ పద్ధతులు అనుసరించడం అతి ముఖ్యం. భూమి పట్ల అవసరమైన శ్రద్ధంతా చూపండి బదులుగా పుష్కలమైన ఫలితాలిస్తుంది మీకు.
ఉదాహరణకు: ఎల్లప్పుడూ అధిక దిగుబడినిచ్చే విత్తనాలే వాడండి. నీటి పారుదలకు ఉత్తమ నీటి యాజమాన్య పద్ధతులు జత చేయండి. సస్యరక్షణ చేకూర్చండి, కలుపు మొక్కల్ని అరికట్టండి.
ఇక బంగారు పంటకోసం ఎల్లప్పుడూ ఏ ఎరువులు వాడాలో తెలివైన రైతుకు తెలుసు. అవి జైకిసాన్—నాణ్యతకూ, పనితనానికీ నమ్మకమైన పేరు.

**జైకిసాన్ సామ్రాట్ 18 : 46 : 0**

పంట ఎదిగే తొలి దశల్లో సరైన మేరకు నత్రజనినీ, అత్యధిక పాలులో ఫాస్ఫేట్ పోషణనీ అందిస్తుంది.

**జైకిసాన్ సంపూర్ణ 19 : 19 : 19**

మన దేశంలో ఇటువంటి తరహా ఎరువు ఇదొక్కటే. పంటలకు అత్యధికంగా ఎన్ పి కె (నత్రజని, భాస్వరం, పొటాష్) పోషక పదార్థాలు అందిస్తుంది... ఫలితంగా మొక్కలు ఆరోగ్యంగా ఎదిగి, పుష్కలంగా దిగుబడి ఇస్తాయి.

**జైకిసాన్ యూరియా 46.4%**

స్వచ్ఛమైన తెల్లని సూక్ష్మ గుళికల రూపంలో వుండే ఈ ఎరువులో నత్రజని పోషక పదార్థాలు వుంటాయి. బైయూరేట్ పాలు అతి తక్కువగా ఉంటుంది. పైపాటుగా వేయటానికి, ఆకుల మీద చల్లటానికి ఆదర్శవంతమైనది.

- సంతులితమైన ఎరువులు అత్యధిక దిగుబడికి హామీ.
- జువారి వారి ఉచిత భూసార పరీక్ష సేవకోసం అడగండి.










# జైకిసాన్
## ఎరువులు

తెలివైన రైతులకు సుఖసంపదల మార్గం.

జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్
జైకిసాన్ భవన్, జువారినగర్, గోవా 403 726.

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు : సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగ్‌పూర్, పుణే, ఇండోర్, ఆగ్రా, ఔరంగాబాద్, జువారినగర్.

LINTAS ZUA 152 2317 TL

# త్యాగమయి

భమిడిపాటి భాస్కర రామారావు

"అమ్మా! ఈ నాయనమ్మను ఎల్లకాలం మనమే ఎందుకు పోషించాలి?" తల్లి లత నడిగాడు కొడుకు శేఖరం.

నూనూగు మీసాల నూత్న యవ్వనంలో అప్పుడే అడుగిడుతున్న కొడుకు అలా అడిగేసరికి దిగ్భ్రాంతురాలయింది లత

"ఎందుకేమిటి? ఆవిడ మీ నాన్నగారిని కన్నతల్లి కాబట్టి."

"కావచ్చు కాని ఆ నాన్న యిప్పుడు లేరు కదమ్మా! మనకేమిటి అవసరం? కాకపోయినా ఆవిడకు నాన్నగారు ఒక్కరే కాదు కదమ్మా కొడుకు. నాకు యింకా ఐదుగురు పెదతండ్రులున్నారు. నాకు కాస్త జ్ఞానం తెలిసిన దగ్గర నుండీ ఈవిడ వాళ్ళ దగ్గరకు వెళ్ళడం గాని, లేదా వాళ్ళు ఈవిడను కనీసం ఒక్కసారయినా తీసుకు వెళ్ళడం గాని ఎప్పుడూ జరగలేదే!

నీ రెక్కల కష్టంతో నన్నూ చెల్లాయినీ పోషించి చదివిస్తున్నావు తరువాత మనం చెల్లాయి పెళ్ళి కూడా చెయ్యాలి. అది ఫరవా లేదనుకో! ఎందుకంటే ఈ ఏటితో నా చదువు పూర్తవుతుంది. నే చదివిన చదువుకు ఉద్యోగం తప్పకుండా వస్తుంది. చెల్లాయి పెళ్ళి నేనే చెయ్యగలను."

కొడుకు ఆత్మవిశ్వాసంతో చెపుతున్న మాటలకు ఆ మాతృ హృదయం గర్వంతో ఉప్పొంగింది. కనిపించని దేవుడికి కృతజ్ఞతలు చెప్పుకుంటోందా అన్నట్టు కళ్ళు మూసుకుని ముఖం ఆకసం వైపుకు తిప్పింది లత.

అక్కడే ఓ మూలగా కూచుని ఉన్న నాయనమ్మ భద్రకాళి అయోమయంగా మనవడి వంకా, కోడలి వంకా మార్చి మార్చి చూస్తోంది. ఆవిడ ముఖంలో కొంచెంగా భయం తాలూకు ఛాయలు గోచరిస్తున్నాయి.

మౌనంగా కళ్ళు మూసుకుని ఉన్న తల్లి నుద్దేశించి, "ఏం అమ్మా! ఏమీ మాట్లాడ వేమిటి?" అని అడిగాడు శేఖరం

శేఖరం హెచ్చరింపుతో ఈ లోకంలో పడింది లత.

చటుక్కున కళ్ళు తెరిచి కొడుకు ముఖం వైపు చూచింది.

"నా ప్రశ్నకు నీ జవాబేమిటి?" అన్నట్టున్నాయి అతడి ముఖ భావాలు.

"నాన్నా! ఆ ప్రశ్నలన్నీ నీ కెందుకురా యిప్పుడు? నీ పెద్ద పరీక్షలు కూడా దగ్గర పడుతున్నాయా, పోయి చదువుకోకుండా!" బుజ్జగింపుగాను లాలింపుగాను అంది లత. ఆమె కనుకొలకులలో నీటి బిందువులు. అవి ఆనంద బాష్పాలో దుఃఖాశ్రువులో అర్థం కాలేదు శేఖరానికి.

"అమ్మా నిన్నెప్పుడు ఈ ప్రశ్న వేసినా ఇలాగే అకును అందకుండా పోకను పొందకుండా జవాబు చెబుతున్నావు. ఇవాళ అసలు సంగతి చెబితే గాని నిన్ను విడిచేది లేదు." మారాం చేస్తున్న చంటి పిల్లాడిలా అన్నాడు శేఖరం.

"ఏమిటి నీ మంకు పట్టు. ఆవిడ నీకు నాయనమ్మ. నాకు అత్తగారు. అంతే!" కాస్త కరుకుదనం ధ్వనించింది లత కంఠంలో.

మనుమడి ప్రశ్నలు వింటూ తన ముందు గతి ఏమవుతుందో అని భీతి చెందుతోంది భద్రకాళి. కాని కోడలి జవాబుతో ఆమె గుండె కుదుట పడింది.

"ఎందుకమ్మా ఆ మమకారం. ప్రాణానికి ప్రాణంలా చూచుకునే వాళ్ళ మీద మమకారం చూపించినా అర్థం ఉంది. లోకమూ హర్షిస్తుంది. ఇవాళ నువ్వు కష్టపడితే గాని మమ్మల్ని పోషించలేని స్థితికి కారణభూతురాలయిన నాయనమ్మ మీద ఎందుకమ్మా యింత అభిమానం. ఈవిడ కారణం గానే కదమ్మా మా నాన్నగారు మాకు లేకుండా పోయింది? ఎందుకమ్మా నన్ను మభ్యపెట్ట జూస్తావు."

కొడుకు మాటలకు నిశ్చేష్టురాలయింది లత.

"శేఖర్! ఏమిటి నువ్వు మాట్లాడుతున్నది?"

"నాన్నగారితో పాటు పని చేసి యిప్పుడు రిటయిరయిన ఓ పెద్దాయన నాకు నిన్న తటస్థ పడ్డారమ్మా. ఆయనా మనం పక్క పక్క వాటాలలో నే కొన్నాళ్ళ పాటు కాపురం కూడా చేశామట. ఆయన మన కథంతా వివరంగా చెప్పారమ్మా."

"ఎవరు? సూర్యనారాయణగారా? ఏమని చెప్పారు రా?" లత కంఠంలో ఆతృత. తాను ఏ విషయం అయితే కొడుక్కు తెలియకుండా పెంచాలని ప్రయత్నించిందో ఆ రహస్యం కొడుక్కు తెలిసిపోయిందన్న ఆవేదన.

"ఏం చెప్పార్రా కన్నా!"

"అంతా పూసగుచ్చినట్టు చెప్పారమ్మా! విను!"

* * * *

ఎర్రంచు తెల్ల చీర తెల్ల జాకెట్టు కట్టుకుని గదిలో అడుగు పెట్టింది లత. ఆమె నుదుట సింధూర తిలకం. తలలోని బొండు మల్లెల సువాసనలు గది నలుమూలలా వ్యాపిస్తున్నాయి. చేతిలోని మంచి నీళ్ళ చెంబు టేబుల్ మీద పెట్టింది. భర్త అప్పటికే మంచం మీద పడుకుని ఉన్నాడు. లత మంచం వైపుగా నడిచింది.

కిరీటి ఆమె రాకతో మంచం మీద లేచి కూచుంటూ, "ఏమిటోయ్ యివాళ విశేషం? అపర రతీదేవిలా మెరిసి పోతున్నావు. ఏమిటి కథ?" అంటూ మంచం దగ్గరగా వచ్చిన లతను భుజాలు పట్టుకుని తన పక్కన కూచుండబెట్టుకున్నాడు.

లత తమలపాకు చిలకలు భర్త నోటి కందిస్తూ, "మన శేఖరానికి తమ్ముడో చెల్లాయో పుట్ట బోతున్నారండీ!" అంది సిగ్గుగా తల వంచుకుంటూ.

ఆమె బుగ్గలు అరుణ రంజితాలయాయి. అధరాలు దరహాస చంద్రికలను వెదజల్లు తున్నాయి.

కిరీటి లతను దగ్గరగా తీసుకుని ఆమె బుగ్గ మీద సున్నితంగా చుంబించి, "ఎంత తియ్యని కబురు చెప్పావు లతా!" అన్నాడు పారవశ్యంతో కన్నులు అరమోడ్పులు కాగా.

లత కిరీటి బాహు పంజరం నుండి విడిపించు కుంటూ, "ఏమండీ!" అంది.

"దేవిగారి కోరిక వెంటనే విన్నవించాలి. క్షణంలో కొండ మీది కోతిని తెమ్మన్నా తేవడానికి సిద్ధంగా ఉన్నాడీ దాసుడు." నవ్వుతూ అన్నాడు కిరీటి.

"కోతులూ అక్కరలేదు కొండముచ్చులూ అక్కరలేదు కాని చిన్న కోరికండి" అంది లత.

"ఆజ్ఞాపించవోయ్!"

"ఇంతటితో మనం సంతానానికి ఫుల్‌స్టాప్ పెడితే బాగుంటుంది కదండీ!"

"నీ ఆలోచన అమోఘం లతా! అమోఘం. అపరిమితమయిన సంతానానికి జన్మనిస్తే అన్నీ అవస్థలే! అదే పరిమిత సంతానం అయితే... ఓహ్! తల్లిదండ్రులకు వారి బిడ్డలకూ కూడా జీవితం నందన వనమే కదూ!" అని, "లతా! నువ్వు చెప్పినట్టే చేద్దాం. నేను వచ్చే నెలలో సెలవు పెట్టి వాసెక్టమీ చేయించుకుంటాను. సరేనా?" అన్నాడు కిరీటి ఉత్సాహంగా.

ఆనందంతో తలమునకలయింది లత. కిరీటిని బాహు వల్లరిలో బంధించి అతడి ముఖం ముద్దులతో నింపి వెయ్యసాగింది.

భడాలున గది తలుపు తెరుచుకుంది.

ఆ చప్పుడుకు బిత్తరపోయిన లత భర్త బాహు బంధం నుండి దూరమయింది. తెరచుకున్న తలుపులకు మధ్య భద్రకాళి!

అలాటి రసవత్తర ఘట్టంలో అత్తగారు అలా గదిలోకి చొరబడటంతో బిక్కచచ్చిపోయింది లత.

తల్లి ప్రవర్తనకు మనసుకు కష్టం తోచిన కిరీటి, "ఏమిటమ్మా..." అని ఇంకా ఏమో అడగబోతున్నాడు.

అతడి నోటి నుండి ఇంకా మాట ఊడి పడలేదు.

"ఒరేయ్ ఒరేయ్! నీ అఘాయిత్యం కూలా! పిల్లలు పుట్టకుండా ఆపరేషను చేయించుకుంటా వటగా! మీ నాన్నగారు కూడా నీలాగే ఆలోచించి ఉంటే నువ్వసలు పుట్టే వాడివేనటరా! హవ్వ! హవ్వ!" అంది భద్రకాళి.

తల్లిదండ్రులకు కిరీటి ఆరవ కొడుకు. తొమ్మిదో సంతానం.

"అమ్మా! ఆ నాటికి ఈ నాటికీ కాలంలో ఎంతో మార్పు వచ్చింది. అలాగే సమాజంలో కూడా. ఆ నాడు మీరు ఎక్కువ మంది సంతతిని కన్నారు. దాని వల్ల ఒరిగిందేమిటి? మా అన్నదమ్ములందరికీ సామాన్యమైన చదువులు చెప్పించడమే కష్టమైంది. అక్కల నిమిత్తం అయినింటి వరుల్ని తేవడమే గగనమైంది."

"ఓరి నీ నోరు పడ! ఎంత మాటన్నావురా! అక్కడికి మీ నాన్నగారు మీకేదో తక్కువ చేసినట్లు మాట్లాడడానికి సిగ్గు లేదురా!" అంది భద్రకాళి.

"అమ్మా! నువ్వు నన్ను అపార్థం చేసుకుంటున్నావు. అవి ఆ రోజులు కావడం చేతనే మావి సామాన్యమైన చదువులైనా గౌరవంగా బ్రతికే ఉద్యోగాలు వచ్చాయి. హాయిగా బ్రతుకుతున్నాం. కాని యిప్పుడు కాలం మారిందమ్మా! ఇప్పుడు పెద్ద పెద్ద చదువులు చదివినవారికే సరియైన ఉద్యోగాలు దొరకటంలేదు. ఇక సామాన్యమైన చదువులే అయితే చెప్పేదేం ఉంది. మన ఆర్థిక స్థితిగతుల్ని బట్టి పరిమిత సంతానం అయితేనే పిల్లల భవిష్యత్తుకు ఇబ్బంది లేని చదువులు చెప్పించగలుగుతాం. పైగా, అమ్మా! ఆ నాడు ఆడపిల్లలకు చదువుతో నిమిత్తం ఉండేది గాదు. మరి నేడో? కనీసం గ్రాడ్యుయేట్ అయినా కాని పిల్లను ఏ వరుడూ చూడడానికి కూడా యిష్టపడడం లేదు. అందుచేత నన్నర్థం చేసుకోవమ్మా!" అర్థింపుగా అన్నాడు కిరీటి.

"అయినా నిన్నని లాభం ఏమిటిలే! ఏదో చదువుకున్న పిల్ల కావాలని ఉబలాట పడ్డావు కదా అని నీ యిష్ట ప్రకారమే చేశాం...."

పెళ్ళినాటికి లత పదో తరగతి పాసయింది. పెళ్ళయ్యాక ఇంటరు కూడా ప్రయివేట్‌గా కట్టి పాసయింది. కాని అత్తగారి పోరు అధికం కావడంతో చదువు అంతటితో ముగించవలసి వచ్చింది.

"... అదేదో ఇంటరు కూడా వెలగ బెట్టిందిగా! ఆ తిప్పుల భామక్కనే అనాలి. ఒరేయ్ వాజమ్మా! అలా పెళ్ళాం మాట కల్లా తాన తందానా అనకూడదురా."

"అమ్మా! అలా దాని మీద విరుచుకు పడతా వెందుకు?"

"అబ్బో సంబడం! లోకంలో వీడి కొక్కడికే ఉందండీ పెళ్ళాం! ఏడు మల్లె పువ్వులెత్తుగా



## త్యాగమయి

"చూస్తున్నావు కదూ! అంచేత మరీ ఆడిస్తుందిలే!" అని, "ఒరేయ్! ఇదిగో చెబుతున్నాను. ఆపరేషనూ గీపరేషనూ అన్నావంటే యిక నువ్వు నన్ను ప్రాణంతో చూడవ్. ఏమనుకుంటున్నావో!"

"అమ్మా! అఘాయిత్యం మాట లాడకు. నేనెందుకు చెబుతున్నానో విను."

"ఒరేయ్! ఆపరేషను చేయించుకుంటా నంటున్నావు. బాగానే ఉంది. ఒక వేళ కర్మ కాలి రేపు అది కనలేక చచ్చిందనుకో. ఇక నీకు పిల్ల నెవరిస్తారా?"

లత మనస్సు ఉండేలు దెబ్బ తిన్న పిట్టలా గిలగిల లాడింది అత్త మాటలకు.

"శుభం పలకరా పెళ్ళికొడకా అంటే... అన్న సామెతలా ఏమిటా మాటలు?" తల్లిని ఉద్దేశించి కటువుగా అన్నాడు కిరీటి.

"అంతే! నా మాటకు యిక తిరుగులేదు. అంతగా యిక పిల్లలు వద్దనుకుంటావా రేపు కాన్పు సమయంలో దానికి చేయించు ఆపరేషను. అంతే కాని నువ్వు చేయించుకుందుకు ఎంత మాత్రం వీలులేదు. నా మాట కాదన్నావో నువ్వు చూసేది నీ తల్లి శవాన్ని మాత్రమే!" అని బయటకు వెళ్ళిపోయింది భద్రకాళి.

లతా, కిరీటి – ఇద్దరూ చేష్టలుడిగిపోయిన వాళ్ళలా కూర్చుండిపోయారు.

ముందుగా లతే తేరుకుంది. "విన్నారుగా అత్తగారి మాటలు" అంది.

"హుం! విన్నాను. ఏళ్ళు ముదిరే కొలదీ మూర్ఖత్వం పెరిగిపోతోంది. ఈవిడ గారి మాటలను పట్టుకు కూచుంటే ఇక బతుకు తెల్లారినట్టే."

"అంటే, ఏమయినా మీరు ఆపరేషను చేయించుకుందుకే నిశ్చయించుకున్నారా?"

"ముమ్మాటికీ."

"ఆవిడ అసలే పట్టుదల మనిషి. ఆ విషయం మీకూ తెలుసు. అన్నంత పనీ చేసినా చెయ్యగలరు."

"అయితే ఏమిటంటావ్? ఆపరేషన్ చేయించు కోవడం మానేసి అద్దూ అపూ లేకుండా పిల్లలను కంటూ పోదామా? ఒక్క బిడ్డకూ కడుపు నిండా తిండీ, ఒంటి నిండా బట్టా లేని అభాగ్యులుగా చేసి వాళ్ళను చూస్తూ అలో లక్ష్మణా అని ఏడుస్తూ కూచుందామా?" ముఖం ఎర్రగా చేసుకుని కోపంగా అడిగాడు కిరీటి.

లత చిరునవ్వు నవ్వి, "ఎందుకండీ అంత కోపం. అత్తగారు మిమ్మల్ని ఆపరేషను చేయించుకో వద్దన్నారే గాని నాకేం ఆంక్ష విధించలేదు కదా? రేపు పురుడయ్యాక ఆపరేషను నాకు చేయిద్దురు గాని. ఏం?" అంది లత.

"లతా! మగవాళ్ళ ఆపరేషను చాలా సులువు. పైగా ఏ యిబ్బందులూ ఉండవు. అదే ఆడవాళ్ళకయితే ... కొన్నాళ్ళ పాటు ఏ పనీ చేయకుండా ఉండాలి. బాగా విశ్రాంతి ఉండాలి. మా అమ్మ ఒంట్లో ఓపిక ఉన్నా యిప్పటికే ఇంటెడు చాకిరీ నీ నెత్తినే రుద్దుతోందా? రేపు మధ్యన చంటి బిడ్డ అడ్డు ఒకటి ఉంటుందాయె. అటు యింటి పనీ, ఇటు బిడ్డ ఆలనాపాలనా మధ్య నీకు విశ్రాంతికి అవకాశం అసలే ఉండదు. ఆరోగ్యం పాడయిందంటే తిరిగి దారిలో పడడం కష్టం." అన్నాడు కిరీటి.

"ఫరవాలేదు లెండి. పెద్దావిడ. ఆవిడకు మాత్రం తెలియదా? పరిస్థితి ఎరిగి పనిలో ఆవిడే సాయం చేస్తారు."

లత మాటలకు , బలవంతాన అంగీక రించాడు కిరీటి.

లతకు నవమాసాలూ నిండాయి. అందాల జాబిల్లిని పరిహసించేటంత అందంతో ఆడపిల్ల పుట్టింది. కలిగిన సంతతి యిద్దరే అయినా ఒకరు మగ మరొకరు ఆడ కావడంతో లతా కిరీటుల ఆనందానికి అవధులు లేకపోయాయి. ఆ ఆనందంలో ఆపరేషను తాలూకు బాధ, కష్టము కూడా మరచిపోయింది లత.

అక్కడ నుండి మొదలయ్యాయి అసలు కష్టాలు.

కిరీటి ఇంటి దగ్గర ఉన్నంత సేపూ లత చేత కనీసం కాఫీ కూడా కాచ నిచ్చేది కాదు భద్రకాళి. కిరీటి అలా ఆఫీసుకు వెళ్ళడం తరువాయి మొదలు పెట్టేది సాధింపులు.

ఓపికలేక లత లేవలేకపోతే పిల్లి మీద ఎలక మీద పెట్టి మంగళాష్టకాలు మొదలు పెట్టేది భద్రకాళి.

భర్తకు చెప్పుకుందుకు బిడియం అడ్డు వచ్చేది లతకు. ఓపిక లేకపోయినా మాటలు పడడం యిష్టం లేక అడ్డమైన చాకిరీకి నడ్డి వంచేది.

దానితో లత ఆరోగ్యం దెబ్బతింది. కిరీటికి లత అంటే ఆరవప్రాణం. డాక్టరును తీసుకు వచ్చాడు.

డాక్టరు ప్రిస్క్రిప్షను రాస్తూ, "చూడండి కిరీటిగారూ! మీ మిసెస్‌కు విశ్రాంతి ముఖ్యం. విశ్రాంతి అనేది ఉంటే యిప్పుడు నేను రాసిన మందులే అక్కరలేదు. అదే విశ్రాంతి కరువైన నాడు ఎన్ని మందులు తిన్నా ఫలితం మాత్రం శూన్యం". అన్నాడు.

అసలు విశ్రాంతి మాటే మరచి శరీరం అలిసి పోయేలా చాకిరీతో మునిగి పోతున్నావని లత మీద విసుక్కున్నాడు కిరీటి ఓ రోజు.

లత యింకా జవాబు చెప్పనే లేదు. మధ్యలో భద్రకాళి కలగ జేసుకుని, "చూడు తల్లీ! నీ మొగుడు నేను నీ చేత ఏదో అడ్డమైన చాకిరీ చేయించేస్తున్నానని ఎగిరెగిరి పడు తున్నాడు. నువ్వేమో నంగనాచిలా ఏమి మాట్లాడవు". అని సాగదీసింది.

లత అప్పుడూ ఏమీ మాట్లాడలేదు.

భద్రకాళి తిరిగి అందుకుని, "అవున్లే నువ్వెందుకు మాట్లాడతావు. నాలిముచ్చులా నీ మొగుడి చేత నాలుగు మాటలూ నన్నే అనిపిస్తావు" – చేతులు తిప్పుకుంటూ అంది.

"అమ్మా! ఎందుకనవసరంగా నోరు పారేసు కుంటావు? అది యిప్పుడేమైనా అందా? దానిని విశ్రాంతి తీసుకోమని మందలించ వలసింది పోయి సూటీ పోటీ మాటలెందుకో?" అంత వరకూ భద్రకాళి జాణ తనానికి మూగ సాక్షిలా నిలబడి ఉన్న కిరీటి అన్నాడు.

దానితో భద్రకాళికోపం తారస్థాయి నందుకుంది. "అనరా నాయనా అను. అందుకేరా పెళ్ళాం బెల్లంముక్క అని పెద్ద ముండా కొడుకులన్నది!" అంది.

లత గుడ్ల నీరు కుక్కుకోవడం మినహా మరేమీ చేయలేక పోయింది.

తల్లిని అంతకన్నా మరేమీ అనలేక కిరీటి విసుక్కుంటూ బయటకు వెళ్ళాడు.

ఒకనాడు –

ఆఫీసు తాళాలు కూడా తీసుకు వెళ్ళడం మరచి పోయిన కిరీటి వెళ్ళిన గంటలోనే తిరిగి యింటికి వచ్చాడు.

గుమ్మంలో అడుగు పెట్టే సరికి చంటి బిడ్డ చంద్రకళ గుక్క పట్టి ఏడుస్తోంది. కిరీటి లోపలకు



వచ్చేసరికి చిన్నారి శేఖరం చెల్లిని ఊరుకో పెట్టడానికి తన చిన్ని బుర్రకు తోచిన ప్రతీ ప్రయత్నమూ చేస్తున్నాడు.

హాల్లో ఓ మూలగా కూచుని ఉంది భద్రకాళి. చంటిబిడ్డ. అందునా తన మనుమరాలు అంతగా గుక్క పట్టి ఏడుస్తున్నా ఆమెకు చీమకుట్టినంత బాధ కూడా వున్నట్టు కనిపించడం లేదు.

కిరీటికి తల్లి మీద భార్య మీద కూడా కోపం ఉప్పెన కెరటంలా తోసుకొచ్చింది.

"లతా!!!" ఇల్లెగిరి పోయేలా కేకపెట్టాడు కిరీటి.

కిరీటి మూడవ మారు పిలువ బోతుండగా ఇంటి వెనుక భాగం నుండి, "వస్తున్నానండీ!" అన్న లత కంఠం వినిపించింది. ఆ స్వరం చాలా నీరసంగా ఉంది.

మెల్లగా తడబడుతున్న అడుగులతో లోపలకు వచ్చింది లత. ఆమె ముంగురులు చెదిరి ఉన్నాయి. బొట్టు చెమటకు నాని నుదుటి నుండి ముక్కు మీదుగా క్రిందకు కారు తోంది. అంట్లగిన్నెలు తోముతోందన్నందుకు గుర్తుగా రెండు అరి చేతులూ మసిపట్టి ఉన్నాయి. కట్టిన కోక మీద కూడా అక్కడ అక్కడ మసి మరకలు.

ఆమెను చూచి, "లతా! ఏమిటి నువ్వు చేస్తున్న పని?" కోపంగా అడిగాడు కిరీటి.

లత మాట్లాడలేదు. నేల చూపులు చూస్తోంది.

"లతా! నువ్వు విశ్రాంతి తీసుకుంటేనే గాని తినే మందుల వల్ల ప్రయోజనం ఉంటదని డాక్టరుగారు చెప్పలేదూ?" ఆర్ద్రంగా అడిగాడు కిరీటి.

లత కంటివెంట నీరు ధారలుగా కారింది.

"చిత్రాంగి! అత్త అరడి పెడుతోందని లోకం అంతా చాటడానికి". సాగదీసుకుంటూ అంది భద్రకాళి.

తల్లి మాటలకు చిర్రెత్తు కొచ్చింది కిరీటికి.

"అమ్మా! అలా మాట్లాడక పోతే నువ్వు అద్దం వెళ్ళి లత చేత కొంతకాలం పాటు ఏపనీ చేయడానికి వీలులేదని చెప్పి ఉంటే?" అన్నాడు కిరీటి.

"నే చెబితే వింటేకదు నాయనా! అత్త ముండను అరడి పెట్టాలని కాకపోతేనూ!"

"మాట మాట్లాడితే యిదీ తంతు నీతో. నువ్వు పని చేయడానికి వీల్లేదని గదమాయిస్తే లత పని చేయడానికి సాహసిస్తుందా? పోనీ, చంటి ముండ గుక్క పట్టి ఏడుస్తోంది కదా! అది నీ మనుమరాలే కదా! ఆగుంట వైధవ తంటాలు పడుతున్నాడు గాని నువ్వు ఓ సారి దానిని సముదాయించలేవూ? నువ్వు మాత్రం తల్లివి కావా?" అని తల్లిని గదమాయించాడు కిరీటి.

దానితో భద్రకాళి రుద్రకాళే అయింది. చెట్టంత కొడుకును పట్టుకుని పెళ్ళాం కొంగు పట్టుకు తిరిగే వాజమ్మ వంది. ఇంకా ఏమేమో అనరాని మాటలంది.

ఆవిడ మాటలతో కిరీటి మనస్సు వికల మయింది. లతనే మరిరెండు కేకలేసి తాళాలు తీసుకుని స్కూటరెక్కాడు. ఇంటి దగ్గర జరిగిన రగడతో అన్య మనస్కంగా స్కూటరు నడుపు తున్నాడు. ఆఫీసుకు వెళ్ళే సందులోకి స్కూటరు తిప్పాడు.

అప్పటికే పెనుభూతంలా వేగంగా వస్తోందో లారీ. చివరిక్షణంలో అపద గ్రహించిన కిరీటి బ్రేకు వేద్దామని చేసిన ప్రయత్నం ఫలించలేదు.

స్కూటరు లారీ ముందు చక్రాల క్రిందకు దూరి పోయింది.

ఆఫీసు నుండి కిరీటి సహ ఉద్యోగులు పంపిన వార్త అందుకుని అదరాబాదరా హాస్పిటలుకు చేరుకుంది లత.

ఆమెకు దక్కినది చివరి చూపు మాత్రమే!

కిరీటి ఆమెకు ఏదో చెప్పాలని ప్రయత్నించాడు. కాని నోట మాటరాలేదు. అతడి కళ్ళ వెంట కన్నీటి ధారలు మాత్రమే రాలి పడ్డాయి.

కర్మకాండలకు కిరీటి అన్నలూ, అక్కలూ అందరూ వచ్చారు. అన్నీ సక్రమంగా పూర్తయి ఎవరి దారిన వారు వెళ్ళబోతున్నారు.

దిక్కుదిబాసులేని లతకు భద్రకాళి బరువును




వదల్చాలనే ఔదార్యం మాత్రం ఎవరి లోనూ చోటు చేసుకోలేదు.

తన భర్త బ్రతికి ఉన్నప్పుడు తనను కాల్చుకు తింది అత్తగారు. కాని ఈనాడు ఏ కొడుకూ ఆమె ఊసు ఎత్తడం లేదు. జాలిగా లత వైపే చూస్తూండి పోయింది భద్రకాళి. లత మనసు ఆర్ద్రమైంది.

పూర్వం అత్త అభీష్టానికి వ్యతిరేకంగా అయినా తాను చదివిన ఇంటర్మీడియట్ సర్టిఫికెట్లు దారీ తెస్తూ కనిపించని ఆ సమయంలో లత పాలిటి వెలుగు రేఖ అయింది.

భర్త పని చేసిన ఆఫీసులో ఆమెకు ఉద్యోగం దొరికింది.

★ ★ ★ ★ ★

"ఆనాడు గుండె రాయి చేసుకుని ఉద్యోగంలో చేరబట్టికదా నన్నీ స్థితికి తేగలిగావు. జీవితం అంతా బాధామయం చేసిన నాయనమ్మ మీద నీకెందుకమ్మా జాలి". అడిగాడు శేఖరం.

"నాయనా! ప్రతీ తల్లీ తన కొడుకు జీవితాంతమూ తన చెప్పు చేతల్లోనే ఉండాలని కోరుకుంటుంది. పెళ్ళయ్యాక అతడి జీవితంలో మార్పు వస్తుందని, దానికి అనుగుణంగా తానూ నడుచుకో వలసి ఉంటుందని గ్రహించదు."

"పెదతండ్రులు ఎవరూ మోయసిద్ధ పడని ఈ భారం మనమే ఎందుకు మోయాలమ్మా?"

"ఆ భారం మీ నాన్నగారు మోశారు. అది నేను అందుకోవలసి వచ్చింది. ఇక ఆవిడ చివరిక్షణం వరకూ నువ్వు మోయాలి". స్థిరంగా చెప్పింది లత.

మనుమడు మాటాడిన తీరు విన్న భద్రకాళి అప్పటికే ఓ చేతి సంచిలో తన చీరలు రెండూ కుక్కుకుని ప్రయాణం అవడానికి సిద్ధమయి అక్కడకు వచ్చింది.

లత అది చూచి, "అదేమిటత్తయ్యా!" అని అడిగింది.

"అమ్మా లతా! బ్రతి కుంది యిన్నాళ్ళూ నిన్ను బాధలు పెట్టి నీ బ్రతుకు బంధఖ పాలు చేశాను. అయినా నువ్వు నన్నెప్పుడూ పల్లెత్తు మాట అనలేదు. నీ కొడుకూ ప్రాజ్ఞుడయ్యాడు. నువ్వు యిక నుండి వాడి మాట ప్రకారం నడుచు కోవడం న్యాయం. నన్ను పోనీయి" అంది

శేఖర్ పకపకా నవ్వి, "భలే నాయనమ్మా! భలే! అరవయి ఏళ్ళకు అక్కంభట్లు అటకెక్కాడన్నట్టు ఇప్పుడొచ్చిందా నీకు పశ్చాత్తాపం? ఎక్కడికి వెడదామని నీ ప్రయాణం?

కన్ను ఆనదు. కాలు ఆడదు.

నిన్ను మా అమ్మ ఏమీ పొమ్మన లేదుకదా!

నాయనమ్మా! ఊరు నిన్ను పొమ్మనే దాకా ఓ మూల కూర్చుని కృష్ణా రామా అని జపం చెయ్యి.

కనీసం ఈ వయసులో నయినా నువ్వు చేసిన పనులకు పశ్చాత్తాపం పడు". అన్నాడు శేఖర్ ఎగతాళిగా.

"తప్పు నాయనా! ఎన్ని అనుకున్నా ఆవిడ నీకు నాయనమ్మ". అంది లత కొడుకుతో మందలింపుగా. □

సీరియల్

(గత సంచిక తరువాయి)

ప్రేమా లేక పెళ్ళీ లేక కళ్ళకు కమ్ముకున్న సినీమా నవలల ప్రబావం కరిగిపోయి అసలు తన జీవిత మేమిటో తన పరిస్థితి ఏమిటో తెలిసొచ్చింది పద్మకు–

ఆ క్షణంలో ఆమెకు మళ్ళీ సినీమా నవలల ముగింపులే కళ్ళ ముందు మెదిలాయి–

చావే సమస్యకు పరిష్కారమన్న తెలివి తక్కువ ఆలోచనని అమలు జరపాలనుకుంది

సత్యం చూడకుంటే ఆమె ఈపాటికి శవంగా మారేదే

ఏడాదిన్నర క్రితం అప్పడాల వ్యాపారం చేసే బుచ్చమ్మ కూతురు శ్యామల చావు కూడ యిటువంటిదేనా అని అనుమాన మొచ్చింది సత్యానికి

చీకటి పడేవేళ నీళ్ళకెళ్ళి కాలు జారి నేల నూతిలో పడిపోయిందన్నారంతా– కానీ యిప్పు డాలోచిస్తే అదీ ఆత్మహత్యేమో ననిపిస్తోంది ఏ పంచాయితీ లేకుండానే కేవలం ప్రమాదంగా బావించి ఆ విషయాన్ని తేలిగ్గా కొట్టి పారేశారా వూరువాళ్ళు–

అదే నిజమైతే?

నిన్న శ్యామల ఈ రోజు పద్మ

మరి రేపు ?

ఈ అన్యాయాలకీ ఆగడాలకీ అంతులేదా?

సత్యం బాగా ఆలోచించి ఒక నిర్ణయాని కొచ్చాడు అనసూయమ్మని [illegible] విషయాన్ని వివరించాడు ఆమె లబోదిబోమని కూతుర్ని [illegible] ఎడవడం తప్పితే మారుమూట మాట్లాడలేదు ఆమె కాస్త స్థిమితపడ్డాక తన అనుమానాన్ని తన నిర్ణయాన్నీ అనసూయమ్మకీ అక్కడ చేరిన వారికి వివరించేడు సత్యం

ఈ ఆత్మహత్యలకి అంతు మనం కనుక్కోవాలి మన వూరి ఆడబడుచుల్ని మనం రక్షించుకోవాలి అని, ప్రస్తుత సమస్యను తనెట్లా పరిష్కరించాలనుకుంటున్నాడో చెప్పేడు–

అంతా సరేనంటే సరే నన్నారు–

అనసూయమ్మ మాత్రం తన బ్రతుకు బయాన్ని వ్యక్తం చేసింది

వాళ్ళు డబ్బున్న మారాజులు– పైగా వాళ్ళదో కులం, మాదో కులం అనుకున్నది జరక్కపోగా వున్న జీవనోపాది కూడ కరువైపోతుంది మా బతుకు బజార్న పడుతుంది అని వాపోయింది–

ఆ పరిస్థితే ఎదురైతే నీ బతుక్కొచ్చిన బయమేం లేదు మేమంతా వున్నాం మీ యిద్దరికీ తిండి పెట్టలేక పోం యీ వూళ్ళో యింకా మంచితనం బతికే వుంది ఈ రోజు జరిగిందానికి చేతగాని దద్దమ్మల్లా వూరుకుంటే రేపు యిటువంటి చావులకు హద్దూ పద్దూ వుండదు అన్నాడు సత్యం

అందరి మాటలూ వింటూ మౌనంగా వూరుకుంది పద్మ యీ సమస్య మీదే కాని నాది కానట్టు

మొత్తానికి ఎలాగైతేనేం సత్యం చెప్పిందానికే అంగీకరించింది అనసూయమ్మ–

ఆ రాత్రే ముఖ్యమైన నలుగుర్నీ తీసుకుని బుచ్చిశెట్టి తలుపు తట్టేడు సత్యం తలుపు తీసిన బుచ్చిశెట్టి ముందు ఆశ్చర్యపోయాడు తర్వాత కంగారు పడ్డాడు– విషయం తెల్సుకుని బయపడ్డాడు– కానీ అవేవీ బయటకు కన్పించకుండా జాగ్రత్తపడి ధైర్యంగా నిలబడ్డాడు ప్రతాప్ అటువంటి మనిషి కాదన్నాడు– అసలు అతనీమధ్య యిక్కడ వుండటమే లేదన్నాడు మీ అనుమానాలకి సాక్ష్యాదారా లేమి టన్నాడు తమ డబ్బు చూసి నంగనాచి పద్మ యీ విదంగా ప్రతాప్‌ని వలలో వేసుకోవాలని చూస్తోందన్నాడు– ఇంకా ఏవేవో అన్నాడు– కానీ ప్రతాపే దీనికి కారణమంటే ఒప్పుకో నన్నాడు బుచ్చిశెట్టి బార్య కూడ తమ్ముడి మంచితనాన్ని వర్ణించింది– అనసూయమ్మ లాంటి విషసర్పాల్ని యిన్నాళ్ళూ పాలు పోసి పెంచానని బాదపడింది జరిగిందానితో మాకేం

జరిగిన కద –6 సంగమయ్య కుటుంబానికీ ఊళ్ళో పేదలందరి కుటుంబాలకూ అప్పుడిగా ఉంటాడు దేవుడు కరణం మోసాన్ని అదికారులకు తెలియజేసి పట్టించినందుకు హత్య చేయబడతాడు తరం మారి దేవుడి కొడుకు దేవుడి లాగానే ప్రజల తలలో నాలుకవుతాడు రైతుల పంచదార కార్డుల విషయంలో పీల్డ్‌మేన్ చేసిన అన్యాయాన్ని మేనేజర్‌తో చెప్పి పీల్డ్‌మేన్‌ను ఉద్యోగం నుంచి సస్పెండ్ చేయిస్తాడు ఉద్యోగం కోసం పంతులు బతిమిలాడుతాడు సత్యం కరిగి పోతాడు బుచ్చిశెట్టిగారి బావమరిది చేసిన అన్యాయం వల్ల ఆత్మహత్య చేసుకోబోతున్న పద్మను రక్షిస్తాడు

సంబంధం లేదంది.

వాళ్ళు చెప్పిందంతా చెప్పనిచ్చి సత్యం ఒక్కటే అన్నాడు–

దీనిక్కారకుడు ప్రతాపే అని మేమంతా నమ్మేం. కొన్నిటికి సాక్ష్యాలు వెంటనే చూపించ లేం– ఈ సమస్యకు పరిష్కారం వారం రోజుల్లోగా తేలని పక్షంలో తను వూరంతటికీ యీ విషయం చాటింపు వేయిస్తాననీ పద్మకు న్యాయం చేకూరేవరకూ నిద్రపోననీ తేల్చి చెప్పి వెనుదిరిగి వచ్చేసేడు సత్యం.

అంతే!

ఆ మూడో నాడే అనసూయమ్మా, పద్మా ఆ వూరి నుంచి మకాం ఎత్తేశారు.

డబ్బు చూపించి బుచ్చిశెట్టి వాళ్ళను వదిలించు కున్నాడు అన్నారంతా–

డబ్బు చాల సమస్యల్ని పరిష్కరిస్తుంది. తను అనుకున్నది జరక్కపోయినా పోనీ మరో వూళ్ళో గుట్టుగా బ్రతుకుతారు అని సంతృప్తి పడ్డాడు సత్యం.

* * * * * *

పంచాయితీ ప్రెసిడెంటు అకాల మరణంవల్ల ఎన్నికల గొడవ ఆరంభమైంది– ఈ మారు ఎవరంటే ఎవరన్న సందేహం ఏర్పడింది–

ఎన్నికల తేదీ నిర్ణయమైంది–

నామినేషన్లు దాఖలు చేయడానికి యింకా ఐదు రోజు లుండనగా ఆ రాత్రి బోగేసు ఓ వార్తను మోసుకొచ్చి రైతు లందరి మధ్యా సత్యం వున్న సమయంలో అతని చెవిన వేసేడు

అది.... బుచ్చిశెట్టి తన బావమరిది ప్రతాప్‌చేత నామినేషన్ వేయించాడు– ఆ సంగతిని సత్యం తనలోనే గుట్టుగా దాచుకోలేదు– అక్కడ వున్న రైతులందరితోనూ ఆ సంగతి చెప్పేడు– అందరికీ అది ఆశ్చర్యకరమైన విషయమే అయింది– నిజానికా వూళ్ళో రాజకీయాల గురించి తెల్సింది చాల తక్కువ మందికే– అయితే ఎన్నిక లొస్తున్నాయి– ఓట్లేస్తున్నారు– గ్రామ పెద్ద లనుకున్నవాళ్ళు ఎవరికి వెయ్యమంటే వాళ్ళకి వెయ్యడమే– వాళ్ళే మేలు చేస్తారంటే నమ్మడమే– అంతేగాని స్వయంగా ఆలోచించి ఓటేసేవారు తక్కువ.

కానీ యీ మారు యీ విషయం ఆశ్చర్యాన్ని కలుగజేసి నందుకు కారణం అంతకు కొద్ది రోజుల క్రితమే ప్రతాప్ చెడ్డ వ్యక్తిగా పేరు బడటం– అనసూయమ్మ కూతురు పద్మ విషయంలో అతని పాత్ర చాల మంది రైతులకు తెలిసిందే– అయితే ఆడకూతురి గుట్టు బజార్నెందుకు పెట్టడమని ఎవరి మట్టుకు వారే మనసులో వుంచుకున్నారా విషయాన్ని– ఆ ప్రతాపే యిప్పుడు నామినేషన్ వేశాడని తెల్సి అందరికీ అతనిపై అయిష్టత లాంటి భావం కలిగింది.

ఆ మర్నాడు ఆ వార్త ధృవపడి; మరెవ్వరూ నామినేషన్లు దాఖలు చేయకుండా బుచ్చిశెట్టి జాగ్రత్త పడ్డట్టు కూడ తెలియడంతో సత్యం తోక తొక్కిన త్రాచే అయ్యేడు.

ఆ రాత్రి తన యింటి ముంగిట్లో నలుగురి రైతుల సమక్షంలో తన అభిప్రాయాన్ని బయట పెట్టేడు.

"ఊరి పెద్దంటే వయసుచేత, బుద్ధిచేత గొప్పవాడు కావాలి. నలుగురికీ ఉపకారం చేసి గౌరవింప బడాలి– ప్రతాప్‌కి ఏవిధంగా చూసినా ఆ అర్హత లేదు– అతను గుణంచేత నీచుడు– స్త్రీలపట్ల పరమ శత్రువు. అంచేత అతనిపైన



పోటీగా మరొకర్ని నిలబెట్టాల. మనకీ రాజకీయా లొద్దు- మన బతుకులు బాగుపడితే మన కదేచాలు- కానీ మనూళ్ళో మూడొంతుల జనం రైతాంగమే- అంచేత ఏ కొద్దిమందికో కావల్సిన వ్యక్తిగాడు మనకి పెద్దగా వుండాల్సింది- మనకీ ఎన్నుకునే హక్కుంది గాబట్టి మన జనాభాయే అధికం కాబట్టి మనూరి పెద్దగా ఎవరుంటే.బావుంటుందో మనమే నిర్ణయించి నిలబెడదాం- ఈ తడవ బుచ్చిశెట్టికి బుద్ధి చెబుదాం"- సత్యం యీ మాటలు చెప్పేసరికి అంతా ఆలోచించడం మొదలు పెట్టేరు- ఆ తర్వాత అవునంటే అవునన్నారు. అలాగే చెయ్యాలని నిశ్చయించుకున్నారు- అయితే ఎవర్ని ఎన్నుకోవాలీ అన్న సమస్య ఎదురైంది-

కొందరు సత్యాన్నే నిలబడ మన్నారు. కానీ సత్య మందుకు ఒప్పుకోలేదు-

"మనం శ్రమించే వాళ్ళం- ఆవేశమే గాని ఆలోచన లేనోళ్ళం- పెద్దగా వుండాల్సిన వారికి కొద్దో గొప్పో చదువు, సంస్కారం, ఆలోచనా కావాలి. నేనందుకు తగను" అన్నాడు-

ఆ తర్వాత అతనే మాధవయ్య గారి పేరు సూచించేడు-

అందరికీ మాధవయ్య పేరు ఆమోదమే అయింది- మంచివాడు, ఉపకారసుడు, కాసింత చదువు, ఆలోచన వున్నవాడూ- అందరికీ కావల్సిన వాడు- అందర్నీ గౌరవించ గలిగిన వాడు- అజాత శత్రువు. బాగుందంటే బాగుందన్నారంతా- అయితే మాధవయ్య అందు కొప్పుకుంటాడా అనే సందేహ మొచ్చింది- ఆయనే నిలబడితే బుచ్చిశెట్టికీ, కరణానికీ మరికొంత మంది వూరి పెద్దలకి చెడ్డయి పోతాడు- అలా ఒకరి చేత చెడ్డనిపించుకునే మనిషి కాదు మాధవయ్య- అందుకనే అతనీ పనికి ఒప్పుకోడు అన్పించింది.

అయితే అతనుగాక వేరు మరెవ్వరూ లేరు. అందుకే ఆయనను ఒప్పించే మార్గం గురించి బాగా ఆలోచించేడు సత్యం. చివరికి అతనికో మార్గం దొరకనే దొరికింది.

మాధవయ్య గారి పెద్ద కూతురు శేషు స్కాలర్‌షిప్పుల మీద పట్నం కాలేజీలో చదివి వచ్చింది- ఆలోచనా, ఆధునిక భావాలూ కల అమ్మాయి- పేదోళ్ళ కష్ట నష్టాలూ, రాజకీయవేత్తల ఎత్తులూ, కుయుక్తులూ ఆమెకు బాగానే తెల్సుండాలి- అంచేత ముందామెకి సమస్యను వివరించి ఆమెచేత ఒప్పిస్తే, ఆమె తన తండ్రిని సులభంగా ఒప్పించ గలదు- ఆపైన రైతుల్లంతా కల్సి ఎలాగూ ఆయన్ను బతిమాలతారు.

ఆ ఆలోచనే బావుందన్నారంతా-



అంతే! ఆ మర్నాడుదయమే ఒకరిద్దర్ని తీసుకుని వెళ్ళి శేషుని కలిసేడు సత్యం- పరిస్థితిని వివరించాడు- తమ నిర్ణయాన్ని విప్పి చెప్పేడు- అంతా విని ఆశ్చర్య పోయిందామె- వారిలో కలిగిన మార్పు ఆమెను నమ్మలేనిదిగా చేసింది-

"మీరంతా ఒక్కమాటపై వుంటే మా నాన్న నొప్పించే భారం నాది. అయితే యింతవరకూ ఆయన గౌరవంగానే బతుకుతూ వచ్చాడు- ఆ గౌరవానికి భంగం కలగకుండా చూసుకునే బాధ్యత మీది. నలుగురితోనూ చెప్పి గెలిపించుకునే బాధ్యతా మీదే" అందామె చివరిగా.

అంతా ఒప్పుకున్నారు-

ఆ రోజే తండ్రితో ప్రస్తావించింది శేషు. "మనకీ రాజకీయా లెందుకమ్మా- అదొక సుడిగుండం- అందులో పడితే బయట పడ్డం కష్టం. పైగా ఆ పదవులూ అవీ నాకు నచ్చనివి" అంటూ తప్పించుకో జూసేరు మాధవయ్యగారు.

"ఆ పదవుల మీద నాకూ మోజుల్లేవు నాన్నా- కానీ ఊరు బాగుకోసమే నా యీ ప్రయత్నం. ఊరి ప్రజలంతా కలిసి వచ్చి తమ అభిప్రాయాన్ని చెప్పారు- వారి కోరికను మన్నించాల్సిన అవసరమూ ఏర్పడింది- ఎంత అమాయక ప్రజలైనా మంచేదో చెడేదో వాళ్ళూ గుర్తించ గలుగు తున్నారు- అంతలా వారు మిమ్మల్ని యిష్టపడుతూంటే కాదనడం సబబు కాదు- ఓ దుష్టుడికీ, కామాంధుడికీ పీఠం వేయడం మంచిదీ కాదు- మరేం ఆలోచించకు నాన్నా- మీ రెప్పుడూ ప్రజల మనిషే- ఈనాడు వాళ్ళూ మిమ్మల్ని గుర్తించి గౌరవించాలను కుంటున్నారు. అంతే." అంది శేషు-

మాధవయ్య గారేం మాట్లాడలేక పోయారు- ఆలోచిస్తే కూతురి మాటల్లోనూ నిజముందని పించింది- నిండు మనసుతో కాకపోయినా ఒప్పుకోక తప్పలే దాయనకు-

మాధవయ్య నామినేషన్ వేశాడనే వార్త తెల్సి కోపంతో మండి పడ్డాడు బుచ్చిశెట్టి- ఇది అతనికి పుట్టిన బుద్ధి కాదని తెల్సుకొని ఎలాగైనా అతన్ని తన దగ్గరకు రప్పించుకుని నచ్చ జెప్పి విరమింప చేయాలను కున్నాడు- కానీ అదీ వీలు కాలేదు-

"చూస్తానుగా- ఎలా గెలుస్తాడు- ఆయనగారికి మద్దతిచ్చే ఆ అలగా జనం సంగతీ చూస్తాను-" అనుకున్నాడు బుచ్చిశెట్టి-

ఆ అలగా జనమనుకున్న రైతులు అప్పుకోసం తన దగ్గరకు రాక మానరు- అప్పుడు వారి భరతం పట్టాలి. అదీ అతని ఉద్దేశం-

ఎన్నికల ప్రచారాలు మొదలయ్యేయి. ప్రతాప్ తరపున ప్రచారం చెయ్యడానికి చాల మంది పైవూరి యువకులను నియమించేడు బుచ్చిశెట్టి-

మాధవయ్యగారి తరపున కొద్ది మంది సాయంతో సత్యమే ప్రచారం చేయడం ప్రారంభించేడు- రైతాంగమంతా ఒక్కటయ్యేరు. వారికి మరీ మరీ చెప్పే అవసరం లేదు- మిగిలిన కొద్ది జనాభాకీ స్వయంగా వెళ్ళి చెప్పడం మొదలు పెట్టేడు- కొందరు చదువుకున్న వాళ్ళ దగ్గరికి శేషును కూడ ప్రచారానికి తీసుకు వెళ్ళేడు- మాధవయ్య గారి మంచితనాన్ని పరోపకార బుద్ధినీ వర్ణిస్తూ ఆయన కాలి గోటికి కూడ ప్రతాప్ సరిపో డన్నాడు-

నిజానికా ఎలక్షన్లు కొత్త చరిత్రనే సృష్టించాయా వూరికి. రాజకీయాల జోలికి పోని అమాయకులంతా కలిసి కట్టుగా పని చేశారు-

పోలింగు ముమ్మరంగా సాగింది- ముందు రోజు రాత్రి కల్లు కుండలతోనూ, సారా సీసాలతోనూ బంధుత్వాన్ని కలుపుకుని విజయాన్ని సాధిద్దా మనుకున్న బుచ్చిశెట్టి ప్రయత్నం వృధాయే అయిపోయింది.

విజయం మాధవయ్యనే వరించిందని తెల్సి అతనిలోని కోపానికి అవధి లేక పోయింది. అతని విజయం వెనుకనున్న సత్యంపైకి బుచ్చిశెట్టి దృష్టి మళ్ళింది-

తన బావమరది పరాజయ మొకటీ తన పరాజయ మొకటీ కాదు- అంచేత వూరు వూరంతా తనను అవమానించినట్టే భావించాడు బుచ్చిశెట్టి.

తన నవమానించిన వారిపై పగ తీర్చుకోవాలను కున్నాడు-

డబ్బుకోసం తన గుమ్మం తొక్కి తన కాళ్ళు పట్టుకునే వాళ్ళా తన నవమానించి ఎదురు తిరిగిన వాళ్ళు!

"అదీ చూద్దాం" అనుకుని పళ్ళు నూరేడతను. (ఇంకావుంది)

# విజయ్ మిక్సి

**55 నిమిషాలు నిర్విరామంగా పనిచేయుగలదు.**

**ఉచితం!**

"ప్రతీ విజయ్ మిక్సితో ఒక విజయ్ స్విచ్ ఐరన్ ఉచితం."






ఈ అవకాశం
కొద్ది రోజులు మాత్రమే

**Vijay®** - a friend of your family

JAISONS AMA 687

# పందెం

## విశ్వనాథ గణపతిరాజు

"ఒరేయ్! రంధి. ఈయాల మనమంతా బేగెల్లాలిరా, బడికి!... మాష్టేరుగారు సెప్పారు" అన్నాడు చెరువు గట్టు దగ్గర కూర్చుని పందుల్ని కాస్తున్న రంధిగాడితో రామిగాడు.

"ఏం?" అని అడిగాడు రంధిగాడు.

"మనకి సొతంత్ర మొచ్చిందట!... అందుకని ఆటలు ఆడిత్తారట మాష్టేరుగారు. పందేలు పెట్టి బగుమతులు కూడా ఇత్తారట!..."

"నిన్ననేమిరా బడికి రానేదు?..." మరో కుర్రోడు అడిగాడు రంధిగాడ్ని.

"మా అయ్యకి ఉష్న మొచ్చినాదిరా. అందుకని నేను పందుల్ని కాయాల్సొచ్చింది."

"అయితే ఈయాలా రావేటి?.."

"వత్తాను. మా అయ్య కాసేపట్లో వత్తాడు. అప్పుడెలిపొత్తాను." అన్నాడు.

"సరే!.. బేగిరా! మేమంతా బడికాడే ఉంతాం!.." అంటూ తనతో వచ్చిన కుర్రోళ్ళతో వెళ్ళిపోయాడు రామిగాడు. వాళ్ళు వెళ్ళిపోయిన తరువాత మూపురాలతో చెరువు ఒడ్డున బురదలో పొడుస్తూ తిరుగుతున్న పందుల్ని లెక్క పెట్టుకున్నాడు రంధిగాడు. అటూ ఇటూ వెళ్ళిపోకుండా లెక్కకు సరిగ్గా ఉన్నాయనుకుని, తండ్రి రాగానే విషయం చెప్పి లగెత్తుక వెళ్ళాడు బడి వైపుకి! ..

బడంటే భారీ బిల్డింగులో లేదది. కనీసం కమ్మలపాకలో కూడా లేదు. ప్రకృతి సహజంగా పుట్టి, కొమ్మలు బార చాచుకుని, మెడకు "బడి" అన్న చిన్న బోర్డు తగిలించుకుని ఉన్న, మర్రి చెట్టు క్రింద ఉంది.

ఆ చెట్టు క్రింద ఒకటి నుండి మూడో క్లాసు వరకూ జరుగుతుంటే, ప్రక్కనే ఉన్న వేప చెట్టు క్రింద నాలుగో క్లాసు, సీమ చింత చెట్టు క్రింద ఐదో క్లాసు నడిపేస్తున్నారు.

(గమనిక :– ఈ మధ్యే మంత్రిగారు నాటి వెళ్ళిన మొక్కలను ఊరి జనం పెంచుతున్నారు గనుక అవి త్వరలో చెట్లుగా మారితే వాటి క్రింద మరికొన్ని క్లాసులు పెట్టవచ్చు!...)

అది ఆ బడి పరిస్థితి.

* * * *

పిల్లలకు పరుగు పందెం పెట్టారు శంకరం మాష్టారు.

వరుసగా పరిగెడుతున్న వాళ్ళలో రంధిగాడి పరుగు చూసి ఆశ్చర్యంతో నోరు తెరిచారాయన.

పిల్లలందర్ని ఆరు బేచీ లుగా విడదీసి పెట్టిన పరుగు పందెంలో ఆరుగురు ఫస్టుగా వస్తే, ఆ ఆరుగురికీ పందెం పెడితే రంధిగాడు ఫస్టువాడిగా వచ్చాడు.

వాడి భుజం తట్టి మెచ్చుకున్నారు శంకరం మాష్టారు.

వేప చెట్టు క్రింద నిలుచుని చూస్తున్న సాంబాబు వడివడిగా అడుగు లేస్తూ వచ్చి, పౌరుషంగా తల ఎగుర వేసి, "ఏమిటి మాష్టారు. నన్నెందుకు వీళ్ళతో పందెం వెయ్యించలేదు?..." అని నిలదీసి అడిగాడు

ఉలిక్కిపడి వాడి వైపు చూసిన శంకరం మాష్టారు, "అమ్మమ్మ! ఆ మాటనకు బాబూ! నిన్ను కూడా వీళ్ళతో పరుగు పెట్టిస్తే... ఆ విషయం మీ మావయ్య గారికి తెలిస్తే నన్ను ఈ ఊరు నుండే పరుగు పెట్టిస్తారు.."

"ఎందుకూ?..." అర్థంకాక అడిగాడు.

"ఎందుకంటావేమిటి బాబూ!... నీవు పరిగెడితే నీ కాళ్ళు నొప్పి పుడతాయి. ఆ విషయం మీ మావయ్య గారికి చెపుతావు. అప్పుడు నా పని సరి!... చూడు బాబూ! నీకు కావలసింది బహుమతేగా? నీకా బహుమతి వచ్చే ఏర్పాటు నేను చేస్తానుగా! నువ్వింక ఇంటి కెళ్ళిపో బాబూ!..." అంటూ సాంబాబు చిన్ని గెడ్డం పుచ్చుకుని బ్రతిమలాడారు మాష్టారుగారు.

ఆయన చేతిని దూరంగా నెట్టేస్తూ, "అలా ఇచ్చిన బహుమతి నా కొద్దు! నేను పరుగులో వాళ్ళతో గెలుకగలిగితేనే తీసుకుంటాను" అన్నాడు.

"ఇంతటి నిజాయితీ నీలో ఉండకూడదు నాయనా!" అని అనబోయి, ఆ మాటను బలవంతంగా గొంతులో దిగమింగుకున్నారు మాష్టారు గారు.

"ఏమిటి మాష్టారు?.. మాట్లాడరు!" మరలా అడిగాడు, సాంబాబు!

మాష్టారుగారి మౌనమే సమాధానమయింది ఈ సారి కూడా!

'సరే!..' అంటూ అక్కడి నుండి వెళ్ళిపోయాడు సాంబాబు! శంకరం మాష్టారుగారి గుండె దడదడా కొట్టుకోసాగింది, ఏ ముపద్రవం వస్తుందోనని!...

అనుకున్నట్టే, పది నిముషాల్లో వెంట బెట్టు కొచ్చాడు సాంబాబు, వాళ్ళ మావయ్య బంగార్రాజుని. ఆయన వస్తూనే, "ఏమిటి మాష్టారు? మా వాడు చెపుతుంది..." అని అడిగారు.

అంతా వివరించి చెప్పారు శంకరం మాష్టారు.

"ఏమిరా! మాష్టారుగారు చెప్పింది బాగానే ఉందిగా! నీ కంతగా కావలిస్తే బహుమతి ఇప్పిస్తానంటున్నారు కదా?..." అన్నారు మేనల్లుడితో.

"నా కొద్దు!..." తల విసురుగా విసిరాడు సాంబాబు!

"సరే!... మాష్టారూ! వీడు మొండి వెదవ. మన మాట వినడు గాని, ఓ సారి వాళ్ళతో పరిగెత్తించు!..."

అది విని సాంబాబు ముఖం వెలిగిపోతే, మాష్టారు గారి ముఖం వివర్ణమయింది. ఆయన మరికాస్త ఇరుకులో పడ్డారు.

"అయ్యా! ఇప్పుడు ఫైనల్‌గా మిగిలింది రంధిగాడు. వాడితోనే మనవాడ్ని పందెం వెయ్యించాలి!..."

"వెయ్యించు!.." వేయిస్తేనేం అన్నట్టు అడిగారు బంగార్రాజు.

మాష్టారుగారు ఇబ్బందిగా ముఖం పెట్టి, "వెయ్యొచ్చనుకోండి! కాని వాడిది లేడి పరుగు. మన సాంబాబు ఓడిపోయే ప్రమాదముంది!..."

ఆ మాటలు విని బంగార్రాజు ఒంటి కాలు మీద లేచాడు.

"అదంతా నా కనవసరం. నువ్వేం చేస్తావో నీ ఇష్టం. మా వాడే గెలవాలి.." అంటూ కోపంగా అక్కడి నుండి వెళ్ళిపోయారు ప్రెసిడెంటు!

తల పట్టుకుని కాలు విరిగిన కుర్చీలో కూర్చుండిపోయారు, మాష్టారు గారు. ఓ రెండు నిముషాలు ఆలోచించి పందెం మరుసటి రోజుకి వాయిదా వేసి, సాంబాబుని బ్రతిమలాడి పంపించేసారు.

* * * *

మరుసటి రోజు ప్రెసిడెంటుగారు, ఊరి జనం చూస్తుండగా పందెం ప్రారంభమయింది.

రంధిగాడు, సాంబాబూ ప్రక్క ప్రక్కనే నించున్నారు, పరుగు పెట్టడానికి సిద్ధంగా!....

రంధిగాడ్ని చూడగానే కాస్త అనుమానమొచ్చింది ప్రెసిడెంటు గారికి వెంటనే మాష్టారు గారిని పిలిచి అడిగారు.

"వాడా?... వాడు దాసరయ్య కొడుకండి!..." అన్నాడు.

అంతే!... ప్రెసిడెంటుగారు షాక్ తిన్నట్టయ్యారు. గతంలో వాడి వెనుక నున్న కథ ఆయన కళ్ళ ముందు కదలాడింది.

* * * *

"శారదా! పిలుస్తున్నది నిన్నే!...!" ఈ సారి గర్జించాడు బంగార్రాజు.

అయినా శారద వినిపించుకోలేదు. కూర్చున్న కుర్చీలోంచి లేచి బయటకు వెళ్ళిపోబోయింది.

గబుక్కున ఆమె చెయ్యి పట్టుకుని ఆపాడు బంగార్రాజు.

పట్టుకున్న చేతిని విసురుగా విదిలించి,

గిరుక్కున అటు తిరిగి కోపంగా చూసింది అతని వైపు శారద.

"పిలుస్తుంటే వినిపించుకోకుండా వెళ్ళిపోతున్నావేం?..."

"నీ పిలుపు విని ఆగాల్సిన అవుసరం నాకేంలేదు" నిర్లక్ష్యంగా చెప్పింది ఆమె!

"ఉంది .."

"లేదు!.."

"నేను నీకు కాబోయే భర్తను ..." మీసాలు మెలేస్తూ అన్నాడు.

ఆ మాటలకు మరింత కోపంగా చూసింది శారద, అతని వైపు.

"ఎవరన్నారు?.." సూటిగా అడిగింది.

"మన పెద్దలు..."

"పెద్దల మాటలతో పెళ్ళిళ్ళు జరిగిపోవు! .."

"నీ వెందుకిలా మాట్లాడుతున్నావో నాకు తెలుసు!..."

"నీకు తెలిసిందేమిటో నాకూ తెలుసు! .."

"ఏమిటి నీకు తెలిసింది?..."

"నేను దాసరితో తిరుగుతున్నానని నీ కెవరో చెప్పారు. చెప్పినా అది అబద్ధం మాత్రం కాదు. నేను అతడ్ని ప్రేమిస్తున్నాను. అందుకే అతని వెంట తిరుగుతున్నాను..."

"కులభ్రష్టురాలి వవుతావు..."

"దాని వల్ల ప్రాణం పోదు. ప్రేమ నశించదు..."

"ప్రేమ కోసం ప్రాణం పోగొట్టుకోవల్సి వస్తే!..."

"అలా ఎన్నటికీ జరుగదు. ఒకవేళ జరిగినా నేను భయపడను. నాకు కావలసింది ఆ దాసరి ప్రేమే!..."

"అది మాత్రం నీకు దక్కదు... నీకు పెళ్ళంటూ జరిగితే నాతో నే!..."

"అది నీ భ్రమ మాత్రమే!.... బావవైనంత మాత్రాన పెళ్ళి చేసుకోవాలని ఎక్కడా లేదు."

"ఉంది. చచ్చినట్టు నువ్వు నన్నే పెళ్ళి చేసుకుంటావు. ఆ స్థితికి నిన్ను నేన తీసుకొస్తాను."

"అయితే పందెం కట్టగలవా?..." ఛాలెంజ్ చేస్తూ కుడి చేతిని విసురుగా గాలిలోకి ఎత్తి అడిగింది శారద.

"పందెమా?.. ఎలా?.. " అర్థం కానట్టు అడిగాడు బంగార్రాజు.



"నీవే గెలిస్తే .... అంటే దాసరి నుండి నన్ను విడదీసి నీవు పెళ్ళి చేసుకోగలిగితే, నాపై పగతో నన్ను నీవు స్వీకరించకపోయినా నీకు ఊడిగం చేస్తూ నీ కాళ్ళ దగ్గరే బానిసలా బ్రతుకుతాను. అదే నేను గాని గెలిస్తే, నీవు జీవితాంతం నా ఎదురు తల ఎత్తుకుని తిరక్కూడదు."

ఆ మాటలు వింటూంటే బంగార్రాజు ఒంటికి నిప్పు పెట్టినట్టు మండిపోసాగాడు. పిడికిలి బిగించి ఎదురుగా ఉన్న రాతి స్తంభాన్ని ఒక్క గుద్దు గుద్దాడు.

"ఏం, ఓడి పోతానేమోనన్న భయమేస్తుందా?..." శారద, హేళనగా అతని వైపు చూస్తూ అంది.

"ఆ భయం నీకుండాలి!... సరే! నీ పందెంకి నేను ఒప్పుకుంటున్నాను." అంటూ విసురుగా అక్కడి నుండి వెళ్ళిపోయాడు బంగార్రాజు.

తరువాత, బంగార్రాజు ఎంత ప్రయత్నించినా శారదను ఆపలేకపోయాడు.

ఓ రోజు రాత్రి సమయంలో శారద, దాసరిని లేపుకుపోయింది. వాళ్ళ గురించి ఎంక్వేరీ చేసి చూసాడు బంగార్రాజు. ఎక్కడో పెళ్ళి చేసుకుని, ప్రక్కనే ఉన్న చేట పఱ్రులో కాపురం పెట్టారని తెలిసింది.

తను ఓడిపోయినందుకు మండిపోయాడు బంగార్రాజు. ఎలాగైనా ఆమెపై కక్ష కట్టి దెబ్బ తియ్యాలనుకున్నాడు. కాని అనుకోని సంఘటనలు, మార్పులూ జరగడంతో ఏమీ చెయ్యలేకపోయాడు.

బంగార్రాజు తల్లిదండ్రులు యాక్సిడెంటులో చనిపోయారు. తరువాత తండ్రి వారసుడిగా ఊరి ప్రెసిడెంటయ్యాడు. చెల్లెలి బలవంతం మీద దూరపు బంధువుల అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. ఇన్ని మార్పులతో తన కక్ష సాధింపు చర్యని, శారద మీద అమలుపరచ లేకపోయాడు. అలా అని పూర్తిగా మర్చిపోనూ లేదు. తన పాషాణ హృదయపు పొరలలో ఓ మూల దాచే ఉంచాడు.

రెండేళ్ళు గడిచి పోయాయి.

శారద, దాసరయ్యా ఓ బిడ్డతో తిరిగి ఈ ఊరొచ్చారు. వాళ్ళతో పాటు ప్రెసిడెంటు ఎలక్షన్లూ

# పందెం

వచ్చాయి. అందుకని వాళ్ళు వచ్చినట్టు తెలిసినా బంగార్రాజు కిమ్మనకుండా ఊరుకున్నాడు. దానికి కారణం లేకపోలేదు. ఏం చేసినా ఫలితం దక్కితే ఫరవాలేదు. ఒకవేళ బెడిసి కొడితే గుట్టు బయట పడుతుంది. అట్టడుగు వర్గాల నుండి వచ్చే అరవై శాతం ఓట్లు పోయే ప్రమాదం ఉంది. అందుకని కొన్నాళ్ళు మౌనం వహించడమే మంచిదని ఉరుకున్నాడు.

ఊళ్ళో ఎక్కడైనా శారద ఎదురైతే, ముఖం చాటు చేసుకుని వెళ్ళిపోవడం మొదలు పెట్టాడు., బంగార్రాజు. దానికి శారద నవ్వుకునేది.

ఎలక్షన్లయ్యి, బంగార్రాజు మరలా ప్రెసిడెంటయ్యాడు. అప్పటి వరకూ మౌనం వహించిన బంగార్రాజు తన కక్ష సాధింపు చర్య మొదలు పెట్టాడు.

పోలమ్మ జాతరలో బిడ్డడ్ని చంక నేసుకుని తిరుగుతున్న శారదను, బంగార్రాజు మనుషులు ఆమె తిరుగుతున్న ఏరియాలో పెద్ద గొడవ పెట్టి... గందరగోళంగా తయారైన ఆ గుంపు మధ్యలో ఇరుక్కుపోయిన శారదను నిర్దాక్షిణ్యంగా కత్తిపోటుకి గురి చేసారు. వెన్నులోంచి దూసుకుపోయిన పదునైన కత్తి శారదను క్రింద పడి, గిలగిలా తన్నుకుని చనిపోయేలా చేసింది!....

అంత దూరంలో చంక నుండి జారి పడిపోయిన ఆమె కొడుకు రంధిగాడు బంగురుకుంటూ వచ్చి శారద గుండె పైకి ఎగబ్రాకి ఏడవసాగాడు.

మరుసటి రోజు పంచాయతీ జరిపే సమయంలో శారద శవాన్ని చూసిన బంగార్రాజుకు రాక్షసానందం కలిగింది. కాని ఆమె ముఖంలో విజయ గర్వం ప్రస్ఫుటంగా కనిపిస్తుందతనికి!... 'నా ప్రాణాన్ని తీయగలిగావు గాని నా ప్రేమను మాత్రం భంగపరచలేకపోయావు నీవు!' అని!

★ ★ ★ ★

"అయ్యా! పందెం మొదలు పెట్టించ మంటారా?"... అన్న మాష్టారి గారిమాటలతో ఉలిక్కిపడ్డాడు బంగార్రాజు. మరొకసారి రంధిగాడి వైపు చూసాడు. వాడు తన వైపేచూస్తున్నాడు. శారదే వాడి రూపంలో నిలుచుని, ఒకసారి పందెంలో ఓడావు. ఇంకా సిగ్గు రాలేదా నీకు. మరలా ఓడాలని ఉందా?..." అంటున్నట్టనిపించింది.

బంగార్రాజు కుర్చీలోంచి దిగ్గున లేచి నిలుచున్నాడు. మాష్టారు గారిని దగ్గరగా పిలిచి, "మాష్టారూ! ఏది ఏమైనా మా సాంబాబే గెలవాలి! ఆ రంధిగాడు ఎట్టి పరిస్థితిలోనూ గెలవడానికి వీలులేదు" అన్నాడు మెల్లగా!....

"అల్లాగేనండి!... నేనా ఏర్పాటు చేసానులెండి." అన్నాడు, అంతే మెల్లగా!.... అని లైను దగ్గరికి వెళ్ళి మాష్టారుగారు విజిల్ కొట్టారు.

రంధిగాడు, సాంబాబు పరుగు లంకించుకున్నారు. చూస్తున్న పిల్లలు కేకలు పెట్టసాగారు. పెద్దలు ఉత్సుకతతో చూస్తున్నారు.

పరిగెడుతున్న ఇద్దరిలో సాంబాబు ముందుకు వెళ్ళాడు. తరువాత రంధిగాడు, వాడ్ని దాటేసాడు.

రంధిగాడు!....

సాంబాబు!.....

రంధిగాడు.

రంధిగాడు

రంధిగాడు.

రంధిగాడిది ఒకటే పరుగు! లేడి పరుగు.

శంకరం మాష్టారు గారికి గుండె దడదడా కొట్టుకోసాగింది. 'ఒకవేళ రాత్రి ఇచ్చిన మాట గాని మర్చిపోలేదు కదా వీడు?' అన్న అనుమానం కలిగిందాయనకు.

ముందు రోజు పందెం వాయిదా వేసినపుడు రాత్రి పది గంటల సమయంలో మెల్లగా రంధిగాడి ఇంటికి కెళ్ళారు మాష్టారుగారు. వెళ్ళి వాడి చేతులు పట్టుకుని, "ఒరేయ్ రంధి. ఇవి చేతులు కావురా!... నన్ను మరో ఊరు ట్రాన్సుఫరై పోయేలా చెయ్యకురా!... రేపు పందెంలో నువ్వు ఓడిపోరా!..." అంటూ రంధిగాడి చేతులు పట్టుకున్నారు మాష్టారుగారు.

"ఏమిటి మాష్టారు?... నన్ను బాగా పరిగెడతావురా






# ధర్మపథం భగవదర్చన



భగవత్సేవలో, భగవదర్చన ప్రధానమైనదిగా భక్తులు భావిస్తారు. అష్టోత్తర నామ పూజకంటే సహస్రనామ పూజ ముఖ్యమనీ, అంతకంటే లక్షార్చనకు విలువ ఎక్కువ అనీ వారి భావన. పుష్పాలలో కొన్ని అందంగా ఉంటాయి. కాని వాటికి సువాసన ఉండదు. కొన్ని అందంగా కానరాక పోయినా మంచి పరిమళం 'కలిగి ఉంటాయి. కొన్ని అందంగానూ, సువాసన కలవిగానూ కూడా ఉంటాయి. అందువల్ల ఈ' మూడో రకం పువ్వులను సంపాదించి, వాటినే భగవ దర్చనకు ఉపయోగించ డానికి ప్రయత్నించడం జరుగుతుంది. ఎక్కువ ఖర్చు చేస్తే గాని అవి లభించవు. విలువగల పూలతో పూజిస్తే భగవంతునికి అనుగ్రహం కలుగుతుందనే అభిప్రాయంతో ఇలా అర్చన జరుగుతుంది. భక్తి ప్రధానం కాని పూవులు దేవునికి ముఖ్యం కావు. రాజుగారు పూజించిన సువర్ణ పుష్పాల కంటె భక్తితో కుమ్మరి చేసి తెచ్చిన మట్టి పూవులే భగవంతుడు ప్రీతితో స్వీకరించిన గాథ అందరూ ఎరిగినదే!

ఇతర పుష్పాలకంటె ఎక్కువ విలువైనది హృదయ కుసుమమే! అచంచల భక్తితో హృదయంలో భగవంతుణ్ణి ధ్యానించడమే ఉత్తమమైన భగవదర్చన. ఆ అర్చనకు ఏ సహస్ర నామార్చనా, ఏ లక్షార్చనా సాటిరావు. అట్టి భక్తుణ్ణి భగవంతుడు, అన్ని వేళలా గమనిస్తూ, ఆపదలు వచ్చినపుడు అడ్డుపడి రక్షిస్తాడు. భక్తునికి అట్టి విశ్వాసం కూడా ఉంటుంది.

ఒకప్పుడు ఎడతెగని వర్షాలవల్ల ఒక గ్రామానికి దగ్గరగా ఉన్న ఒక యేటికి వరద వచ్చింది. ఆ యేటికి అంత వరద రావడం గ్రామస్థులలో ఎవ్వరూ కనీ వినీ ఎరుగరు. వాన వెలియగానే నదీ ప్రవాహాన్ని వేడుకగా చూడడానికి కొందరు అక్కడికి వెళ్లారు. వారిలో పరమ భక్తాగ్రణి ఒకడు ఉన్నాడు. అందరూ నది ఒడ్డున నిలిచి, ప్రవాహాన్ని ఆశ్చర్యంతో చూస్తున్నారు. ఆ భక్తుడు కొంత ముందుకు వచ్చి నీటి వడి ఎంత ఉందో అని నీటిలో కాలు పెట్టాడు. వెంటనే ప్రవాహం అతన్ని లోపలికి లాగుకొని పోతున్నది. అతనికి ఈత తెలియదు. ప్రవాహం నుంచి తప్పించుకొని ఒడ్డు చేరడానికి అతను ఎంతో యత్నిస్తున్నాడు. కాని లాభం లేకపోయింది. ఒడ్డున ఉన్నవారు "ఇతడిని నీటిలో ఎవరు దిగమన్నారు? ఈదడం చేతకానివాడలా చెయ్య వచ్చునా?" అని విమర్శిస్తున్నారే కాని, ఒక్కరూ అతనికి సహాయం చెయ్యడానికి సిద్ధపడలేదు. ఆ భక్తుడికి దైవ ధ్యానం తప్ప గత్యంతరం లేకపోయింది. ఇంతలో ఎక్కడి నుంచో ఒక జాలరి వచ్చి ప్రవాహంలో దిగి, ఆభక్తుని చెయ్యి పట్టుకుని లాగుతూ, అతి కష్టం మీద ఒడ్డు చేరి అతని ప్రాణాలను రక్షించాడు. సమయానికి భగవంతుడు తన భక్తుణ్ణి రక్షించ డానికి ఆ జాలరిని పంపాడని మనం గ్రహించాలి. ఆడంబరంగా ప్రచారం కోసం చేసే భగవదర్చన కంటే నిరాడంబరంగా హృదయ కుసుమంతో పూజించడమే ఉత్తమం. అదే భక్తునికి శ్రీరామ రక్ష.

–బులుసు వేంకటరమణయ్య

---

అన్న మీరే ఓడి పొమ్మంటున్నారు?" అని అడిగాడు 'వాడు, మాష్టారుగారు చెపుతున్నదేమిటో అర్థంకాక!

"నా పరిస్థితి అటువంటిదిరా!..." అంటూ అంతా వివరించి ఒప్పించారు మాష్టారుగారు.

మరి ఇప్పుడు సాంబాబుని వదిలేసి రంధిగాడు అలా పారిపోతుంటే అనుమానం కలిగింది, మాష్టారు గారికి!

అంతే!...

ఒక్క క్షణంలో మార్పు జరిగిపోయింది.

మెరుపులా పరుగు తీసిన రంధిగాడు దబ్బున క్రింద పడిపోయాడు. మరి లేవలేనట్టు నటించసాగాడు. అది చూసిన మాష్టారు గారి గుండెలో ఒక్క సారిగా దడ తగ్గిపోయింది.

బంగార్రాజు మీసాలు మెలేస్తూ లేచి నిలుచున్నాడు.

అంతే!...

మరో హటాత్ సంఘటన!...

ఎవరూ ఊహించని సంఘటన... చివరికి రంధిగాడు కూడా అలా జరుగుతుందనుకో లేదు.

రంధిగాడి కన్నా ఓ రెండు గజాలకు ఇవతలే సాంబాబు పడిపోయాడు. మాష్టారుగారు పరుగున వాడి దగ్గరికి వెళ్ళారు. వాడిక పరుగెత్త లేనన్నాడు. అది విని బంగార్రాజు తల బాదుకున్నాడు.

శారద నవ్వుతుంది.

బంగార్రాజు చేతి కర్రను నేలకేసి కొట్టి చరచరా వెళ్ళిపోయాడు, ఈ ఓటమిని భరించలేనన్నట్టు!...

రంధిగాడు మెల్లగా సాంబాబు దగ్గరికి వచ్చాడు. సాంబాబు వాడి భుజం మీద చెయ్యి వేసి, "ఒరేయ్! నువ్వే గెలిచావురా!... నీతో పరిగెత్తడం ఎవడి తరం కాదు. నీవు పడిపోవడం చూస్తేనే నాకు అర్థమయిపోయింది. నువ్వు నిజంగా పడిపోలేదని, నిన్ను కావాలని ఎవరో పడిపొమ్మన్నారని. అందుకే న్యాయంగా నీకు రావలసిన బహుమతిని నేను తీసుకోవడం మంచిది కాదని, నీలాగే పడిపోయినట్లు నటించాను... ఇంకెప్పుడూ నీ పరుగును వెనుకపడనివ్వకు! పరిగెడుతూనే ఉండు.

నీ పరుగును అడ్డే వాళ్ళను నెట్టుకుని పరిగెత్తు!.. పందెంలో గెలుపునీ చేతికి దక్కించుకోడానికే చూడు!..."

విజ్ఞాని లా మాట్లాడుతున్న సాంబాబు మాటలు మౌనంగా రంధిగాడు వింటుంటే, మాష్టారుగారు నోరు తెరిచి ఆశ్చర్యంగా వినసాగారు.

శారద ఆనందాశ్రువులు రాలుస్తుంది. □

సీరియల్

# ప్రత్యూష పవనాలు

జి. భవానీ కృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

కాసులయ్యాక కాసేపు అలవాటు ప్రకారంగా లైబ్రరీలో కూర్చుని రిఫరెన్సు పని ముగించుకుని బయట పడింది ప్రత్యూష. ఒక ఫ్రెండుతో కలిసి కబుర్లు చెప్తూ కాస్త దూరం నడిచాక ఆ ఫ్రెండు బస్‌స్టాండ్‌కి వెళ్ళిపోతే తను మెల్లగా నడుస్తూ ఆటో కోసం చూస్తోంది.

"మున్నీ!" అన్న పిలుపు విని చివ్వున తల తిప్పి చూసింది. కాస్త పక్కగా నిలబడి ఉన్న మనోజ్‌ని చూసి బెదురు తగ్గడంతో చిన్నగా నవ్వుతూ, "మీరా? ఇంట్లో తప్ప బయట ఎవరూ అలా పిలవరు, నన్ను అల్లరి పెట్టడానికి ఎవరైనా అలా పిలుస్తున్నారేమో నని భలే భయపడ్డాను" అంది మనోజ్ దగ్గరికి వచ్చే వరకూ ఆగి.

"సారీ! మీ అసలు పేరుకంటే అలా పిలవడమే తేలిక అందుకని....."

"ఫరవాలేదు లెండి. ఏమిటిలా వచ్చారు?" అడిగింది అడుగులో అడుగు వేసి నడుస్తూ.

"నేను వచ్చిన పని నిన్ననే పూర్తయిపోయింది. అసలు నిన్ననే వెళ్ళిపోవాల్సిన వాడిని కానీ, ఆంటీ, ప్రహ్లాద్ బలవంతం చెయ్యడంతో ఆగిపోయాను. అఫ్‌కోర్స్! ఎన్నాళ్ళు ఉన్నా మరో రెండు రోజులు ఉండి వెళ్ళమనడం మన సాంప్రదాయం కదా! అందుకని వాళ్ళు అలా అని ఉంటారు. అందుకే ప్రయాణాన్ని ఇవాల్టికి వాయిదా వేసుకున్నాను. సాయంకాలం బండికి అమ్మ, నాన్న, నేను వైజాగ్ వెళ్ళి పోతున్నాము. వెళ్ళేలోగా మీతో రెండు మాటలు మాట్లాడదా మనిపించింది, ఇదిగో ఇక్కడ మకాం పెట్టి గంట నుంచీ ఎదురు చూస్తున్నాను. ఇంటి దగ్గర అయితే అందరూ ఉంటారు. మీ మాట ఎలా ఉన్నా అందరి ముందు నేనే ఇబ్బందిగా ఫీలవుతాను. అందుకే– మీకభ్యంతరం లేకపోతే ఎటైనా వెళ్ళి కాసేపు కూర్చుందాము?"

పెదవి కొరుకుతూ అతని మాటలు విన్న ప్రత్యూష, "అభ్యంతరం అంటే..... పెద్ద అభ్యంతరం ఏమీ లేదనుకోండి. కానీ....." సంకోచంతో ఆగిపోయింది.

జరిగిన కథ –16 : తీర్థయాత్రలకు వెళ్ళిన మారుతీరావు గంగలో ఆత్మత్యాగం చేసుకుంటాడు. ఆయన భార్య దుర్గమ్మ, కూతుళ్ళు ఆస్తి కోసం దారుణంగా ప్రవర్తిస్తారు. క్రమక్రమంగా దుర్గమ్మలో మార్పు వస్తుంది. ఆమె ఒక కూతురిని కని మరణిస్తుంది. ఆడబిడ్డల మాటలను తోసివేసి మాలతి ఆ పాపను తన కూతురితో సమానంగా పెంచుకోవడం మొదలెడుతుంది. ప్రకాశరావు చనిపోతాడు. లారీ ప్రమాదంలో వేణుగోపాల్ మరణిస్తాడు. పిల్లలను పెంచి పెద్ద జేయడమే పరమావధిగా మాలతి వ్యాపారాలు నిర్వహిస్తుంది. మనోజ్ తిరిగి వచ్చి తల్లిదండ్రుల ముందు నాటకం ఆడి వాళ్ళను పెళ్ళికి ఒప్పిస్తాడు. వాళ్ళ తప్పులను గుర్తింప జేస్తాడు.

"అహ..... అనవసరంగా మిమ్మల్నేమీ ఇబ్బంది పెట్టను."

"అబ్బే! నా ఉద్దేశ్యం అదికాదు. ఇంటిదగ్గర అమ్మ ఎదురు చూస్తూ ఉంటుందని...." నసిగింది.

అతను మాట్లాడబోయే దేమిటో తనకి చూచాయగా తెలుసు. రానని తిరస్కరించ డానికీ మనస్సొప్పడం లేదు. అలా అని అతని వెంట వెళ్ళడానికీ ధైర్యం చాలడం లేదు.

సందిగ్ధావస్థలో కొట్టు మిట్టాడు తుండగానే అతను ఖాళీ ఆటోని ఆపి ఎక్కి కూర్చుని "ప్లీజ్ కమ్" అన్నాడు ఆమె వైపు చూస్తూ.

యాంత్రికంగా వెళ్ళి ఆటో ఎక్కింది ప్రత్యూష.

"ఫ్రెండ్సుతో ఎన్నోసార్లు ఎన్నో చోట్లకి వెళ్ళాను, ఇప్పుడిలా సంకోచిస్తున్నా నేమిటి? ఒక్కసారికే నాకిలా అనిపిస్తోంది. చిన్ని ధీరజ్‌తో అలా నిర్భయంగా ఎలా తిరిగేదో?" అనుకుని, "ఎలాగైనా అది నాకంటే చొరవ కలది" అనుకుంది.

"ఎక్కడికి వెడదాం?" మనోజ్ రెట్టించే సరికి ఆలోచనల నుంచి బయట పడి, "మీఇష్టం" అంది.

మరికాసేపట్లో ఆటో టాంక్‌బండ్ మీద ఆగింది.

కాస్త దూరం ఫుట్‌పాత్ మీద నడిచి ఒక సిమెంటు బెంచీ మీద కూర్చున్నా రిద్దరూ.

మనోజ్ వెళ్ళి రెండు ఐస్ క్రీములు కొనుక్కొచ్చాడు.

సాయంకాలపు నీరెండ పడి హుసేన్ సాగర్ నీళ్ళు బంగారు రంగులో మిలమిలా మెరుస్తున్నాయి.

చల్లని గాలి గిలిగింతలు పెడుతూ, కవ్విస్తోంది ఆ యువక హృదయాల్ని.

గాలికి చెదిరి ముఖమ్మీద పడుతున్న ముంగురుల్ని వెనక్కి తోసుకోవాలని విఫల ప్రయత్నం చేస్తూ, "నన్ను తీసుకొచ్చి మీరు మౌనం భోంచేస్తున్నారు" అంది.

"లేదు, ఐస్‌క్రీమ్ తింటున్నాను" అన్నాడు నవ్వుతూ. ప్రత్యూష కూడా గట్టిగా నవ్వేసింది.

పలువరస తళుక్కుమంది.

ఆ నవ్వు చూసి ముగ్ధుడై తన్మయత్వంతో తదేకంగా చూస్తుండి పోయాడు మనోజ్.

నవ్వాపేసి, తడబడుతూ తల దించేసుకుంది.

రెండు క్షణాలు మౌనంగా గడిచి పోయాయి.

"మున్నీ..... అయామ్ సారీ.... మీ వాళ్ళందరూ అలా పిలుస్తుంటే వింటూండడం వల్ల నాకు తెలియకుండానే నేను కూడా అలాగే పిలిచేస్తున్నాను." అన్నాడు నొచ్చుకుంటూ.

"ఫరవాలేదు లెండి".

"థాంక్యూ! నిన్న నేను ఆంటీతో చెప్పిన మాటలు మీరు వినే ఉంటారు. ఆంటీ అందుకు సుముఖంగా లేరని ప్రహ్లాద్ నాకు ముందే చెప్పాడు. మన మధ్య కేవలం స్నేహమే కాక, కొత్తగా బయటపడిన బంధుత్వాన్ని పురస్కరించుకుని అయినా ఆంటీ అంగీకరిస్తారన్న ధైర్యంతో, నమ్మకంతో అడిగాను. అమ్మ అప్పుడేదో అలా చేసినా ఇప్పుడు పూర్తిగా మారిపోయింది.. తను పొందిన అనుభవాల దృష్ట్యా ఆంటీ భయపడడం కూడా సమంజసమే ననుకోండి. ఇప్పుడు..... మీ విషయంలో అటువంటి పరిస్థితులు ఎదురు కావని మాత్రం నేను హామీ ఇవ్వగలను. ఆ విషయం గురించి మీరు ఏమాలోచించారో తెలుసుకుందా మనే మిమ్మల్ని ఇప్పుడిలా తీసుకొచ్చాను."

"మీకు తెలియనిదేముంది? అమ్మ ఇష్టాయిష్టాలకి వ్యతిరేకంగా ఎటువంటి నిర్ణయాలు తీసుకోవడం మొదటి నుంచీ మాకు అలవాటులేదు. ఇంత వయస్సు వచ్చినా అన్నయ్య కూడా ఎప్పుడూ ఏ విషయంలోనూ అమ్మ నిర్ణయాన్ని వ్యతిరేకించలేదు. అమ్మ నిర్ణయం ప్రకారమే ఇంత వరకూ అన్నీ జరుగుతూ వస్తున్నాయి. అలా అని ఏ విషయం లోను మా మనసులు కష్ట పెట్టుకునే పరిస్థితి ఎప్పుడూ రాలేదు. అమ్మ ఆలోచనల మీద, నిర్ణయాల మీద మాకు అంత నమ్మకం ఉంది. ఆ విషయం మీరు ఎప్పుడో గ్రహించే ఉంటారు. ఇక నా అభిప్రాయమంటారా? మీకు ఇదివరకే చెప్పాను. అమ్మ మనసు కష్టపెట్టుకోని విధంగా ఆమె నిర్ణయాలకి తల వంచి అమ్మని పూర్తిగా సంతోష పెట్టాలన్నదే నా అభిప్రాయం. అమ్మ నిర్ణయం ఎప్పుడూ నేను సుఖంగా, సంతోషంగా ఉండేలాగే ఉంటుందనే నమ్మకం కూడా నాకుంది" అంది మనోజ్ మాటలు విన్న ప్రత్యూష.

"మొత్తానికి కర్ర విరగకుండా, పాము చావకుండా చెప్పారు. అబ్బా! మిమ్మల్ని ఇంకా ఒత్తిడి చేసి ఇబ్బంది పెట్టను. ఆంటీకి మనస్ఫూర్తిగా ఇష్టం అయితేనే తప్ప, ఒత్తిడి చేసి బలవంతంగా ఒప్పించడం నాకూ ఇష్టంలేదు. కేవలం నా అదృష్టాన్ని పరీక్షించు కుందామని అర్జీ పెట్టుకున్నాను అంతే.

అమ్మమ్మ, తాతయ్య, మావయ్య బ్రతికి ఉండి ఉంటే మన బంధుత్వాలు మురుగున పడేవీకాదు. ఈ పెళ్ళి గురించి ఇంత తర్జన భర్జనలు, ఈ గొడవలు ఏమీ ఉండేవి కాదు. మనపెళ్ళి ఎప్పుడో జరిగి పోయి ఉండేది. ఆంటీ అభిప్రాయం కనుక్కుని ప్రహ్లాద్ ఉత్తరం రాస్తానన్నాడు. నేను మళ్ళీ ఈ ఊరు రావడం అన్నది ఆ ఉత్తరం మీద ఆధారపడి ఉంటుంది. నేను అనుకున్నది జరక్క పోతే అసలు రాననికాదు ఏదో పనుంటే తప్ప తరచుగా రావడం పడదు కదా! మన బంధుత్వం విషయం తెలిసి, మన కుటుంబాల మధ్య రాక పోకలు పునరుద్ధరించాలని ఇంత నాటకం ఆడాను. అమ్మని అందరి ముందు అలా మాట్లాడవలసి వచ్చింది."

"నిజమే. మీరలా మాట్లాడాల్సింది కాదు. అఫ్‌కోర్స్! ఆవిడ చేసింది పొరపాటే అనుకోండి. కానీ అందరిముందు కన్న కొడుకే అలా ఇన్సల్ట్ చేస్తే బాధగా ఉంటుంది కదా!"

"కరక్టే, ప్రస్తుతం ఇక్కడ మీ కుటుంబ సభ్యులు మాత్రమే ఉన్నారు. మా అమ్మమ్మ, అమ్మ, పిన్నిలు కలిసి ఆంటీని ఇంటికి వచ్చిన బంధువులు, స్నేహితులందరి ముందు కూడా అవమాన కరంగా మాట్లాడారని తెలిసింది. అప్పుడు ఆంటీ ఎంతగా బాధ పడి ఉంటారో అమ్మకి అర్థం అవడం కోసమే ఇలాచేశానుతప్ప, మా అమ్మ మీద నాకు ద్వేషమా చెప్పండి"?

"నిజమే ననుకోండి. కానీ, దొంగలు పడ్డ ఆరు నెలలకి కుక్కలు మొరిగినట్లు అప్పుడెప్పుడో మనం పుట్టకముందు జరిగిన దానికి ఇప్పుడిలా చెయ్యడం వల్ల ప్రయోజనం ఏముంది చెప్పకోతగినంతగా. అయిపోయిన పెళ్ళికి బాజాలు వాయించినట్లుంది తప్ప."

"అంతే నంటారా?" తను చేసిన పనికి అభినందించక పోగా అలా అనే సరికి నిరాశ చెందాడు మనోజ్.

నిజంగా చెప్పాలంటే బంధుత్వాన్ని ఏదో విధంగా బయట పెట్టేస్తే తమ పెళ్ళి జరగడానికి ఏవిధమైన ఆటంకం ఉండదని భావించి అన్ని తిప్పలు పడ్డాడు. తీరా చేసి కథ అడ్డం తిరిగింది. "పూర్ మనోజ్! ఐ పిటీయూ" తన మీద తనే జాలిపడ్డాడు.

సంధ్య చీకట్లు ముసురుకుంటున్నాయి.

బంగారు రంగు నీళ్ళు కెంపురంగులోకి మారి చివరికి వెన్నెల వానలో తడిసి వెండి రేకు తాపడం చేసి నట్లు తళతళలాడు తున్నాయి.

చిన్నబోయినట్లున్న అతని ముఖాన్ని చూసి తన మాటలు అతన్ని నిరాశ పరిచాయని గ్రహించింది ప్రత్యూష.

"ఒక విధంగా చూస్తే మిమ్మల్ని అభినందించక తప్పదు. మీకు బంధుప్రీతి ఎక్కువని, అన్యాయాన్ని సహించలేరని, మంచి కోసం పాటు పడే ప్రయత్నంలో స్వపరభేదాలు పాటించరని నాకనిపించింది, నిన్నటి సంఘటన తరువాత."

ఆ మాటలు టానిక్కులా పనిచేసి అతని ముఖంలో పూర్వపు కాంతులు చోటు చేసుకున్నాయి.

ప్రత్యూష తృప్తిగా నిట్టూర్చింది.

"ఇంక వెడదామా?" అంది వాచీ చూసుకుంటూ.

"అప్పుడేనా?" దిగులుగా ఉంది అతనికి.

"ఇప్పటికే ఆలస్యం అయింది. ఇంకా లేటయితే అమ్మ కంగారు పడుతుంది. అదీకాక, ఇంకాసేపట్లో మీరు ప్రయాణం కావాలి కాబోలు".

"ఆ! అవును కదూ! మీతో కబుర్లు చెప్తూంటే నేనా మాటే మరచి పోయాను" కంగారుగా లేచాడు మనోజ్.

"మీరనుకున్న సమాధానం నానుంచి పొందలేక పోయారేమో? మిమ్మల్ని నిరాశ పరిచినందుకు అయామ్ సారీ" అంది.

"నో నో! అదేం లేదు. అన్నీ తెలిసి అలా ఎందుకు అనుకుంటాను? ఎందుకో కాసేపు ప్రశాంతంగా మీతో గడపాలనిపించింది. నా కోరిక మన్నించి మీ అమూల్య



# ప్రత్యూష పవనాలు

మైన కాలాన్ని నా కోసం వెచ్చించి నందుకు కృతజ్ఞతలు."

"భలేవారే! అయినా ఏమిటిది ఇద్దరి కిద్దరం పరాయి వాళ్ళలాగ ఇలా మాట్లాడు కుంటున్నాము" అంది.

"అవును కదూ! మనం ఇప్పుడు బావా మరదళ్ళం కాబట్టి మన్నింపులు, సంజాయిషీలు, క్షమార్పణలు, కృతజ్ఞతలు చెప్పుకోడం వగైరా ఫార్మాలిటీస్ అన్నిటికీ స్వస్తి చెప్పాలి." అన్నాడు ఆమె పక్కనే నడుస్తూ. ముసి ముసిగా నవ్వింది ప్రత్యూష.

* * * * * * * *

"అమ్మా! నిద్రపోయావా?" కొడుకు గొంతు విని కళ్ళు తెరిచి చూసింది మాలతీదేవి.

"లేదు నాన్నా. ఏం? ఇంకా నిద్రపోలేదూ?"

లోపలి కొచ్చి లైటు వేసి తల్లి పక్కన కూర్చున్నాడు.

"వత్సల ఏం చేస్తోంది? పిల్లలిద్దరూ పడుకున్నారా?"

"పడుకున్నారమ్మా. వత్సల ఏదో చదువు కుంటోంది. నాకప్పుడే నిద్రరావడం లేదు. నీతో కాసేపు మాట్లాడదామని ఇలా వచ్చాను".

"దేని గురించి బాబూ?"

"అదేనమ్మా. చెల్లాయిల పెళ్ళిళ్ళ విషయం. నిన్ను కనుక్కుని రెండు మూడు రోజుల్లో ఏ విషయం ఉత్తరం రాస్తానని మనూకి చెప్పాను. అప్పుడే వాళ్ళు వెళ్ళి వారం రోజులు అయిపోయింది. ఏ సంగతి ఇంకా రాయకపోతే బాగుండదు. ఏం ఆలోచించావమ్మా?"

"ఎటూ తెల్చుకో లేక పోతున్నాను బాబూ. నువ్వు ఏమనుకుంటున్నావు?" ఎదురు అడిగింది.

"నాకయితే అభ్యంతరం ఏమీ కనిపించడం లేదమ్మా! మనోజ్ చాలా యోగ్యుడు. బుద్ధిమంతుడు. చెల్లి ఎంతో సుఖపడుతుందనే నమ్మకం నాకుంది."

"మరి...... ఆ సావిత్రి...... పూర్తిగా మారిపోయిందనడానికి లేదు. నేను పడిన బాధలు తరువాయి నీ చెల్లి పడాల్సి వస్తుందేమో నని బెంగ నన్ను ఏ నిర్ణయం తీసుకోనివ్వడం లేదు".

"అమ్మా! కోరలు పీకేసిన పాము బుసకొట్టడం తప్ప అంతకు మించి ఏం చేయగలుగుతుంది చెప్పు? అదీ కాక మనం మున్నీని వదిలిపెట్టి ఉండలేమని వాడికి తెలుసు. ఈ ఊరికి మకాం మార్చేమన్నా వాడు అభ్యంతరం చెప్పడు. చదువుంది. ఆ ఉద్యోగం వదిలి వచ్చేసినంత మాత్రాన ఈ ఊళ్ళో ఉద్యోగం దొరక్క పోతుందా?"

"నీకంత నమ్మకం ఉంటే అలాగే కానీ బాబూ. ఎవరిని పెళ్ళి చేసుకున్నా అది సుఖంగా, సంతోషంగా ఉండడమే నాకు కావాల్సింది. ఓ మాట దాన్ని కూడా అడిగి చూడు."

"అలాగే నమ్మా. అది ఇంకా పడుకోలేదు. పిలుస్తాను. నువ్వే అడుగు" అంటూ లేచి వెళ్ళి చదువు కుంటున్న ప్రత్యూషని పిలుచు కొచ్చాడు ప్రహ్లాద్.

"ఏమిటమ్మా". తల్లి పక్కన కూర్చుని తల్లి భుజాన్ని గట్టిగా పట్టుకుని, ఆ చేతుల మీద తలానించుకుంది.

"తల్లీ! మనోజ్ గురించి నీ అభిప్రాయం ఏమిటమ్మా" ప్రేమగా చెంపలు నిమురుతూ అడిగింది మాలతీదేవి.

"అమ్మా! నువ్వు, అన్నయ్య ఆలోచించి ఎలా మంచిదని తోస్తే అలా జరిపించండి. అన్నయ్య స్నేహితుడుగా తప్ప అతనిపట్ల ప్రత్యేకమైన అభిప్రాయమూ లేదు. అలాగని వ్యతిరేక భావమూ లేదు. మీరిద్దరూ కలిసి బాగా ఆలోచించుకుని అతన్ని చేసుకోమన్నా సంతోషంగా చేసుకుంటాను. లేదా, మరొకరి నెవరినైనా తీసుకొచ్చి అతన్ని చేసుకోమన్నా చేసుకుంటాను".

"నాకు తెలుసమ్మా ఆ విషయం. కానీ, అన్నింటికీ ఈ అమ్మ మీద ఆధారపడడానికి నువ్వింకా చిన్న పిల్లవి కాదమ్మా".

"నేనెంత ఎదిగినా నీ కూతుర్నే నమ్మా. నా మంచి చెడ్డలు నా కన్నా నీకే బాగా తెలుసు."

"పిచ్చితల్లి" చెక్కిలి మీద ముద్దు పెట్టుకుని "బాబూ! అయితే అలా రాసేయరా. నువ్వన్నట్లు ఈ ఊరికి మకాం మార్చేయమని స్పష్టంగా ఇప్పుడే చెప్పు. నా తల్లిని చూడకుండా నేను ఒక్కరోజు కూడా ఉండలేను" అంది ప్రహ్లాద్‌తో.

"ఏమ్మా! మనూకి అలా ఉత్తరం రాసేయమంటావా"? ప్రత్యూషని అడిగాడు.

"ఫో! అమ్మ చెప్పిందిగా. మళ్ళీ నన్నెందుకడుగుతావ్?" సిగ్గుతో తల్లి గుండెల్లో ముఖం దాచుకుంది ప్రత్యూష.

"రేపే వాడికి ఉత్తరం రాసి పడేస్తానమ్మా. ధీరజ్ విషయంలో నీ అభిప్రాయం ఏమిటమ్మా. చిన్నీని అతనికి ఇచ్చి చేస్తే ఎలా ఉంటుంది?" అడిగాడు.

"బాబూ! మంచి సంబంధాల కోసం చూస్తున్నా న్నావు ఇంతకంటే ఏం దొరకలేదా?" అయిష్టంగా అంది మాలతీదేవి.

"అందులో అన్నయ్య తప్పేం లేదమ్మా. ఆ సంబంధం సెటిల్ చెయ్యమని నేనే అన్నయ్యకి చెప్పాను" అంది ప్రత్యూష.

"ఏమ్మా! అది నీకు తోడబుట్టిన చెల్లెలు కాదని తెలిసిన తరువాత దానికి అంతకంటే మంచి సంబంధం అక్కరలేదనుకున్నావా?" నిష్ఠూరంగా అంది.

"అమ్మా!" ఇద్దరూ ఒకేసారి బాధగా అరిచారు.

"క్షమించమ్మా. నువ్వు...... నన్నిలా అపార్థం చేసుకుంటావనుకోలేదు. నువ్వు బాధపడతావని ఇంత వరకూ నీకు చెప్పలేదు. చిన్ని ఈ మధ్య ధీరజ్‌తో సినిమాలకీ షికార్లకీ తిరుగుతోంది. ఫ్రెండు ఇంటికి అని చెప్తే నువ్వు నమ్మి అది ఎప్పుడు అడిగితే అప్పుడు బయటికి పంపించే దానివి. చిన్న చిన్న విషయాలకి కూడా అది ఇంట్లో అంత గొడవ చెయ్యడం, పోట్లాడడం, ఎక్కువగా అలా బయట తిరగడం చూసి దానిలో ఏదో మార్పు వచ్చినట్లు అనిపించి దానికి తెలియకుండా కాలేజీకి వెళ్ళి దాని ఫ్రెండ్సుని అడిగితే అది ఒక్కొక్కసారి కాలేజీ కూడా ఎగ్గొట్టి బాయ్ ఫ్రెండుతో తిరుగుతోందని చెప్పారు. నీకు గుర్తుండే ఉంటుంది. ఆ రోజు అది ఫ్రెండు ఇంటికెడుతున్నానంటే అది వద్దంటున్నా, ఏడుస్తున్నా మొండిగా దాని వెనుకే వెళ్ళాను అది ఎక్కడి కెడుతుందో తెలుసుకోవాలని. ట్రాఫిక్ సిగ్నల్స్ అనుకూలించక పోవడం వల్ల నేనెక్కిన ఆటో కాస్త వెనక పడింది. ఇందిరాపార్కు ముందు ఆటో దిగి లోపలికెళ్ళడం దూరం నుంచే చూశాను. నేను వెళ్ళేసరికి అక్కడ అది, ధీరజ్‌తో కబుర్లు చెప్తూ, అది పబ్లిక్ ప్లేసు అనే ధ్యాస కూడా మరచి పోయి పగలబడి నవ్వుతోంది." అంటూ వారి మధ్య జరిగిన సంభాషణ కూడా అక్షరం పొల్లు పోకుండా చెప్పింది ప్రత్యూష.

"అమ్మా! ఆ విషయం తెలిస్తే నీ గుండె బద్దలై పోతుందని ఆ రాత్రి నువ్వు అడిగితే ఏమీ లేదని అబద్ధం ఆడాను. ఆ తరువాత వదినకి చెప్పాలనుకుంటే



వై. హరికృష్ణ సారథ్యంలో
కృష్ణచిత్ర (హైదరాబాద్)

నవోదయానికి రహదారి

# ఇదా ప్రపంచం

ముత్యాల సుబ్బయ్య
వై. అనిల్ బాబు

చక్రవర్తి: యం.వి.యస్. హరనాథరావు * ఆర్. రామారావు * గౌతంరాజు
ఫోటో: వి.యం.సి.

---

రవికిషోర్ సమర్పించు

బాలుమహేంద్ర

స్రవంతి మూవీస్

# రెండు తోకల పిట్ట

కె. శారదాదేవి
వేమూరి సత్యనారాయణ
ఇళయరాజా
రాజశ్రీ

# ప్రత్యూష పవనాలు

నువ్వు వదినతో ఆస్పత్రికి వెళ్ళినప్పుడు దాన్ని నిలదీసి అడిగితే తను అతన్ని ప్రేమిస్తున్నానని చెప్పింది." అంటూ అప్పుడు తమిద్దరి మధ్యా, జరిగిన సంభాషణని కూడా తు. చ. తప్పకుండా చెప్పింది ప్రత్యూష.

"అమ్మా! చిన్ని అతన్ని తప్ప మరొకర్ని పెళ్ళి చేసుకోనంటోంది. పెళ్ళి జరిగేవరకయినా అతనితో అలా విచ్చలవిడిగా తిరగ వద్దని దానిని బ్రతిమాలి ఒప్పించాను. అమ్మా! ఆ ధీరజ్ మంచివాడు కనుకనే చిన్ని అదృష్టం బాగుంది. ఈపిచ్చి మొద్దు అందరినీ తొందరగా నమ్మేస్తుంది. అతనేమో వేరే మంచి ఉద్యోగం వచ్చాక గానీ పెళ్ళి చేసుకోనంటున్నాడు. అంత వరకూ తమ ప్రేమ విషయం రహస్యంగా ఉంచమంటే ఇది గంగిరెద్దులా తలూపిందట. అందుకే పరిస్థితి విషమించకుండానే అతనికేదో వేరే మంచి ఉద్యోగం ఇప్పించి వెంటనే ముహూర్తం పెట్టించి, త్వరగా పెళ్ళి చేసేయమని నేనే అన్నయ్యకి చెప్పాను. అంతేకానీ.... నువ్వనుకున్నట్లు చిన్నీ పట్ల చిన్న చూపు లేదమ్మా నాకు. నీకు తెలిస్తే నువ్వు బాధపడతావని, ఆరాటపడతావని, తట్టుకోలేక మానసికంగా కుమిలి పోతావని ఈ విషయాలన్నీ నీకు చెప్పలేదమ్మా. చిన్ని విషయం నాకు తెలిసి వారం రోజులేగా అయింది. కానీ, నేను ఆ విషయం అన్నయ్యకి చెప్పి నెలరోజులైందమ్మా. నిజం అమ్మా" అంది వెక్కి వెక్కి ఏడుస్తూ.

కూతుర్ని అక్కున చేర్చుకుని, "పాపిష్టి దాన్ని, నీ మనసు తెలుసుకోలేకుండా ఏమేమో అన్నానమ్మా. ఏడవకు తల్లీ...." అనవసరంగా కూతురి మనసు నొప్పించినందుకు బాధ పడుతూ అంది.

"అవునమ్మా. తెలిస్తే నువ్వు తట్టుకోలేవని ఈ విషయాలన్నీ నీకు చెప్పవద్దని నేనూ మున్నీని హెచ్చరించాను. ధీరజ్‌కు వేరే ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాను. అన్నీ మన చేతుల్లో లేవుగా. కాస్త ఆలస్యం అవుతోంది. అమ్మా! చిన్ని అంతగా ఇష్టపడుతున్న ధీరజ్‌తో నే దాని పెళ్ళి జరిపిస్తే మంచిదని పించి నీ దగ్గర ఈ ప్రస్తావన తెచ్చాను. నువ్వు అనవసరంగా మున్నీని అపార్థం చేసుకున్నావు గానీ, ఇందులో మున్నీ తప్పేమీ లేదు."

"అవును కన్నా! నా బంగారు తల్లిని అనవసరంగా నిందించాను. తల్లీ! ఈ అమ్మని మన్నించమ్మా".

"అలా అనకమ్మా. అమ్మా! చిన్నీ అంటే నాకు ప్రాణం. దాని జీవితం పాడవ కూడదనే, దాని మనసుకి కష్టం కలుగ కూడదనే నేను ఆరాటపడ్డాను. చిన్నప్పటి నుంచీ మాతో సమానంగా .... ఇంకా చెప్పాలంటే మా యిద్దరి కంటే ముద్దుగా అది ఈ ఇంట్లో పెరిగింది. అది ఎప్పటికీ మాచెల్లెలే. మరో ఆలోచనకి నీమనసులో చోటు ఇవ్వకమ్మా. మా కంఠంలో ప్రాణం ఉన్నంతవరకూ దాని గురించి ఆలోచించాకే అప్పుడు మా గురించి ఆలోచించు కుంటాము నేను, అన్నయ్య కూడా." తల్లి చేతిలో చెయ్యి వేసి ప్రమాణం చేసింది ప్రత్యూష.

"అవునమ్మా. నువ్వు అనవసరంగా ఏవేవో ఊహించుకుని మనసు పాడు చేసుకుంటున్నావు. అదే వద్దని మేము చెప్పేది. అమ్మా! అత్తయ్యలు ముగ్గురికీ ఉన్న ఆస్తిలో తనకి తోచినదేదో పంచి ఇచ్చేశాడు తాతయ్య. మిగిలినదేదో మనకే ఇచ్చాడు. గుంటూరులో ఉన్న మిల్లు, ఇల్లు కూడా బామ్మ తదనంతరం కొడుకు పిల్లలమైన మాకు చెందేటట్లు రాసేశాడు అప్పుడే. చిన్నీనీ కూతురిగా నువ్వు, చెల్లిలిగా మేము భావిస్తాము కానీ, చట్టం ససేమిరా ఒప్పుకోదు. పుట్టింటి వారిచ్చిన ఆస్తి అని చెప్పుకోడానికి చిన్నీకి ఏమీ ఉండదు. మనం ఇచ్చేదేదో మున్నీతో సమానంగా దానికీ ఇస్తాం. అది వేరే విషయం అనుకో. అందుచేత, నువ్వు సరేనంటే మున్నీ, నేనూ కూడా ఇష్టపూర్వకంగా ఆ మిల్లు, ఇల్లు కూడా చిన్నీకి చెందేటట్లు రాసిచ్చేస్తాము. ఇన్నాళ్ళ నుంచీ మిల్లు మీద వచ్చే ఆదాయం, ఇంటిమీద వచ్చే అద్దె కొంత ఏదో మనం వాడినా మిగిలినది బ్యాంకులో అలాగే ఉంది. వారానికి, పది రోజులకి తిరగడం శ్రమతప్ప ఆ మిల్లు వల్ల పెద్దగా ఆదాయం ఏమీ రావడం లేదు. రావడం లేదు అంటే మనం దగ్గర లేక పోవడం వల్ల ఆ మేనేజర్లు కొంత, వర్కర్లు కొంత స్వాహా చేసేస్తుండడంతో మన దగ్గరికి వచ్చే సరికి బేలన్సు నీరస పడిపోతోంది. ఇల్లూ పాత బడి పోయింది. అవి రెండూ అమ్మేస్తే మంచిదని నా అభిప్రాయం. ఈమాట ఎప్పటి నుంచో నీతో చెప్పాలని.... కానీ, తాతయ్య పట్ల నీకున్న అభిమానం, గౌరవం ఎటువంటివో నాకు తెలిసి ఉండడం చేత ఈ సాహసం చెయ్యలేక పోయాను. మనం అక్కడికి వెళ్ళి ఉండేదిలేదు. అటువంటప్పుడు ఎందుకవి అక్కడ? అమ్మేస్తే ఆ వచ్చిన డబ్బుని చిన్నికి ఇచ్చెయ్యవచ్చు. అమ్మా! ఇదంతా కేవలం నా అభిప్రాయం మాత్రమే. దీనిని అమలు పరచాలో, అక్కర లేదో నీ నిర్ణయం మీద ఆధారపడి ఉంటుంది " ఆగి ఊపిరి పీల్చుకున్నాడు ప్రహ్లాద్.

"ఒరే నాన్నా! మీరు నన్ను మించి పోయారురా. ఆ విషయం నాకసలు తోచనే లేదు. మీరిద్దరూ నా బిడ్డలైనందుకు నా కిప్పుడు ఎంత గర్వంగా, సంతోషంగా ఉందో తెలుసా? మీ నాన్నే కనుక బ్రతికి ఉంటే మిమ్మల్ని చూసి ఎంత పొంగిపోయే వారో తెలుసా? ఆయనకి ఆ అదృష్టం లేదు. "బొటబొటా కన్నీరు కార్చింది మాలతీదేవి.

"అమ్మా! నీ కళ్ళలో.... మాటల్లో నాన్న మాకు కనిపిస్తున్నారమ్మా. ప్రతిక్షణం మమ్మల్ని గమనిస్తూ పైనుంచి దీవిస్తూనే ఉంటారమ్మా. నువ్విలా బాధ పడకూడదు. అన్నీ నేను చూసుకుంటాను. నువ్వు నిశ్చింతగా ఉండమ్మా" తల్లిని ఓదార్చి, "మున్నీ! నువ్విక్కడే అమ్మ దగ్గరే పడుకోమ్మా. లేక పోతే అమ్మ రాత్రి తెల్లవార్లూ ఏడుస్తూ కూర్చుంటుంది." చెల్లెల్ని హెచ్చరించి, భారంగా బయటికి నడిచాడు ప్రహ్లాద్.

తల్లి పక్కలో పడుకుని ఏవేవో కబుర్లు చెప్తూ అలాగే నిద్రలోకి జారుకుంది ప్రత్యూష.

(ఇంకా ఉంది)






# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

**ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ, యితర రచనలు పంపదలచుకున్న వారు**

**సంపాదకుడు,**

**ఆంధ్రసచిత్ర వారపత్రిక,**

**గాంధీనగరం, విజయవాడ-520 003.**

**అన్న చిరునామాకి వ్రాయాలి.**

★ కవరుమీద శీర్షికపేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి – హామీపత్రం జతచెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు – వారి స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనేగాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటి పై నిర్ణయంకోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు. కాని– తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు – రచన పేరు – అది పంపినతేదీ, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్లలంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్‌లు పంపేవారుకూడా ఎనిమిది వారాలలోగా మా మీద ఉత్తరాలదాడి చెయ్యకూడదు ... ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్‌ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలువెంబడి జరుగుతుంది.

★ రచయితలకు, కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికి] అవి పడ్డ ''ప్రతు''లను – కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు.

సం॥

## పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## ఓ శీనుగాడి కథ!

ఆడుతూ పాడుతూ తిరగ వలసిన లేత వయస్సులో ఎందరో పసి పిల్లలు బాధ్యతలు భుజాన వేసుకొని ఆ భారంతో కృంగి పోతున్నారు. ప్రభుత్వం బాల కార్మికుల చట్టాలను చేసి పద్నాలుగు సంవత్సరాల లోపున ఉన్న బాల బాలికలు కార్మికులుగా పని చేయకూడదు అనే నిబంధన పెట్టి నప్పటికి మనకు కనిపించే వారిలో సగానికి పైగా బాల కార్మికులే నికృష్టంగా బ్రతుకుతున్న తమ కుటుంబాలకు ఓ తోడుగా యాచకవృత్తి మొదలు ప్రమాదకరమైన అనేక సంస్థల దాకా ఈ పసి పిల్లలు నేడు పని చేస్తున్నారు. ప్రతి పల్లె మొదలు పట్టణం వరకు ఇట్లాంటి అనాథ బాలలు అనేకం. ప్రస్తుత కాకినాడ పట్టణంలో నా ఎదురుగా కనిపించిన ఓ ముక్కుపచ్చ లారని "శీను" జీవితం తీసుకొంటే....

అదిగో ఆ పసివాడి పేరు "శీనుగాడు." అసలు పేరు ఏమిటో గాని అక్కడి వాళ్ళందరూ అలానే పిలుస్తారు. ఓటుహక్కు పొందడానికి ఇంకా పదేళ్ళు గడవాలి. కాని సంపాదన మొదలుపెట్టి ఏడాది అయ్యింది. సినిమారోడ్‌లో ఉన్న ఓ లేత్‌మిషన్ షాపులో నిజంగా యంత్ర భూతాల కోరలకు మెరుగు పట్టడమే వాడి పని.

తండ్రి ఎవరో తెలీదన్నాడు. తల్లి మాత్రం ఇళ్ళల్లో పాచి పని చేస్తుంది. శీనుగాడి యజమాని, తోటి పెద్దవాళ్ళ మొట్టికాయలు, తరచు లెంప కాయలతో కలసి నెలకు నలభై రూపాయిలు జీతంగా లభిస్తుందట. చిరిగి పీలికలై పోయిన లాగు, చొక్కా వేసుకొని ఉదయం ఎనిమిది గంటల కల్లా డ్యూటీకి వచ్చేస్తాడట. మధ్యాహ్నం పన్నెండు గంటల దాకా వంచిన నడుం ఎత్తకుండా తనకంటే ఎంతో ఎత్తుగా ఉన్న మిషన్‌లను తుడవటం, చిన్న, చిన్న మిషన్ స్పేర్ పార్ట్‌ల్ని కడగడం, షాపులో వాళ్ళకి టీలు, సిగరెట్లు వగైరాలు తేవడమే వాడి పని.

భోజనానికి సుమారు కిలోమీటరు దూరం నడిచి వెళ్ళాలి. నిప్పులు చెరిగే ఎండలో కనీసం కాళ్ళకు తెగిపోయిన చెప్పులు కూడా లేకుండా మైలు దూరం నడిచి అమ్మ అందరిండ్లలోనూ మిగిలిపోయిన కూడును తెస్తే తినేసి రావాలి. ఉదయం రావడానికి ఆలస్యం అయితే యజమాని ఊరుకోడు గాని ఇంటికి వెళ్ళేటప్పుడు మాత్రం టైమంటూ ఉండదు. ఒక్కొక్కసారి రాత్రి పది పదకొండు అయిపోతుంది. అంతదూరం నడిచి వెళ్ళడానికి భయం కదా! అందుకనే అమ్మ వచ్చి దగ్గరుండి తీసుకెళుతుందని చెప్పాడు.

యజమానికి, ఇతరులకు కోపం వస్తే



బూతులు తిడుతుంటారట. "అమ్మనడిగితే నాన్న ఎక్కడో ఉన్నాడంటుంది ఏమిటో" అంటూ బుర్ర గోక్కున్నాడు శీనుగాడు.

రోజుకి పావలా బేటాగా కొనుక్కోమని ఇస్తారట. "ఆ డబ్బులు కొనుక్కోను. పండక్కి మా అమ్మ కొత్త బట్టలు కొంటానంది. అమ్మ దగ్గరే దాచు కొంటున్నాను" అని చెబుతున్నప్పుడు శీనుగాడి కళ్ళల్లో మేం కూడా పండుగ చేసుకొంటాం తెల్సిందా? అనే అర్థం గర్వంగా మెరిసింది. "ఒకసారి ఇత్తడిది ఏదో పోయింది. నేనే తీసాననుకొని మా యజమాని గట్టిగా బెల్టుతో కొట్టాడు. నాకు జ్వరం వచ్చేసింది. నేను తీయలేదంటే నమ్మలేదు...." అబ్బా.... అమ్మ లేని వెధవలు ఇలాంటి దొంగ పనులే చేస్తారు... పనిలోకి రావద్దు పో...!" అన్నాడు మా యజమాని. మా అమ్మ వచ్చి బ్రతిమాలు కొంటే మళ్ళీ రమ్మన్నారు అంటూ ఆ సన్నివేశం నాడు జరిగిన దెబ్బల యొక్క మచ్చలను చొక్కా సందులలో నుండి చూపించాడు. అనాథ బాలలంటే అందరికీ లోకువే.... అనే భావం ఆ మచ్చలు చూస్తుంటే అర్థం అవుతోంది.

"చదువుకో వచ్చు కదా" అని అడిగిన ప్రశ్నకు "చదువు కొన్నాను మూడో తరగతి... ఇంకా చదువుకొన్నా దండగే.... డబ్బులు రావంది అమ్మ...." అందుకే ఉద్యోగం చేస్తున్నాను." అమ్మ చెప్పిన అబద్ధం నమ్మాడో లేకపోతే తప్పనిసరి అనుకున్నాడో కాని లక్షలాది బాల కార్మికుల జాబితాలో ఒకడిగా చేరి పోయాడు. ఒకవేళ చదువు కోవాలని ఆశ ఉన్నా చదివించే దిక్కులేని శీనుగాడు....

ఎముకల గూడులా ఉన్న "శీనుగాడు" సాక్షాత్తు శివ ధనస్సును ఎత్తిన శ్రీరామచంద్రుడిలా పెద్ద పెద్ద పార్టుల్ని సైతం గెడకర్రల్లా ఉన్న చేతులతో ఇక్కడ నుండి అక్కడకు, అక్కడ నుండి ఇక్కడకు మోస్తున్నాడు. ఈ కర్మ భూమిలో ఇటువంటి అనాథ "శీనులు" ఎందరో ఉన్నారు. "అనాథ బాలల రక్షణ" అంటూ వేదికలెక్కి ఉపన్యాసాలు దంచే పెద్దలు ఏమి చేస్తున్నారు? కనీస వేతనాలు, అనాథ బాలల రక్షణ, కార్మిక చట్టాలు ఈ అనాథ బాలల విషయంలో ఇటువంటి "శీనుగాళ్ళని" రక్షించకుండా కాగితాల కట్టల్లో నిద్ర పోతున్నాయా! నిత్యం ప్రాణ - గండంతో బ్రతుకుతున్న ఇటువంటి ముక్కుపచ్చ లారని అనాథ బాలల శృంఖలాలు ఛేదించడానికి నలభై ఏళ్ళ స్వాతంత్ర్య పుణ్యం చాలదే....

– కె. వి. మధుసూదనరావు,
కాకినాడ.

★ ★ ★




## కనికరించే దెవరు?

రేపటి పౌరులు మాటేమో కాని రేపటి భవితవ్యం కోసం వివిధ రంగాలలో నేడు చాలా వరకు పని పాటలు చేసుకుంటూ బాల కార్మికులు మనకు దర్శన మిస్తున్నారు.

ఏ ఒక్క బాలుని జీవిత చరిత్ర చూసినా, పరిశీలించినా, పరిశో ధించినా దీనాతి దీనమైన గాథలే దర్శన మిస్తున్నాయి. దీనికంతటికి కారణ మేమిటి అని ప్రశ్నించుకుంటే ఆర్థిక




పరమైన కారణాలు, ఆర్థిక పరమైన ఇబ్బందులు, వీటికి మించి నిరక్షరాస్యత. ఇవే మూలం

ఉదాహరణకు ఒక అతిసామాన్యమైన కుటుంబంలో నలుగురు అంతకు మించి పిల్లలు వున్నారనుకుందాం. వారందరికి తిండి, బట్ట సమకూర్చ వల్సిన బాధ్యత ఆ ఇంటి యజమానిదే ఆర్థిక పరమైన కారణాలవల్ల వారికి సరైన తిండి, బట్ట సమకూర్చలేక చిరుత ప్రాయంలో నే– చిరునవ్వులు చిందించే వయసులో నే



వారు వివిధ రంగాలలో పనిపాటలకు గురౌతున్నారు ఆ లేత వయసులో నే వయసుకు మించి పనులు చేస్తున్న ఆ పసిడి మొగ్గలను కనికరించే దెవరు?

నాకు తెలిసిన ఒక ఇంట్లో ఓ పాప పెళ్ళి చెదారం దగ్గర నుంచి బట్టలు ఉతకడం వరకు దాదాపు అన్ని పనులు చేసేది ఆ యింటి వాళ్ళు ఏ పనికి ఆ పాపకు సహాయ పడేవారు కాదు తోడ్పడే వారు కాదు ఆ పాప చేసే పనులు చూసే సరికి నాకు కళ్ళు చెమర్చాయి ఇంత చిన్న వయస్సులోనే ఇన్ని పనులు చేస్తున్నావే భారం అనిపించడం లేదూ అన్నాను ఓ రోజు కడుపు మీద చెయ్యి వేసుకుని "కూటి కోసం ఏ పనైనా చెయ్యాలి మరి" అంది. అంత చిరుత ప్రాయంలో నే ఆ పాప మాట్లాడే వేదాంత ధోరణికి ఆశ్చర్య పోయాను. ఇలాంటి సంఘటనలు నేడు ఎన్నో జరుగుతున్నాయి. ఆ పనులకు ఆ పిల్లలు కట్టుబడి పోయారు

ఇలాంటి బాలలే కాక ఇంక కొంత మంది బాలురు సైకిలు షాపులలో ను, హోటల్సులో ను, బొగ్గు గనులలో ను వివిధ రంగాలలో తమ శ్రమను ధార పోస్తున్నారు ఇది చాలా శోచనీయమైన విషయం

బాలల విషయంలో ప్రభుత్వం చట్టం తెచ్చినా వారిని ఆదరించి, వారిపై పోషణ చేసేంది తక్కువే వ్యక్తిగత శ్రద్ధ వారిపై తీసుకోవాలి

కేవలం ప్రభుత్వమే కాకుండ వివిధ స్వచ్ఛంద సంస్థలు ముందుకు వచ్చి బాలుర సంక్షేమానికి పాటు పడాలి అనాడే చిన్నారి బాలల జీవితాలలో వెలుగు రేకలు విరజిమ్ముతాయి

–కనుమ ఎల్లారెడ్డి, కర్నూలు

* * *

# అమ్మకోసం

అది బ్లడ్ బ్యాంక్ సమయం ఉదయం పదకొండు ఓ ఎనిమిదేళ్ళ కుర్రాడు అక్కడకు వచ్చాడు– తను రక్తం అమ్ముతానంటూ! అక్కడున్న వారు ఆశ్చర్యంగా చూశారు ఆ కుర్రాడి కేసి ఓ వ్యక్తి అతగనే అడిగాడు

చిన్న పిల్లల రక్తాన్ని తీసికోరు ఇంతకీ నీరక్తం అమ్మాల్సిన పరిస్థితి ఏమొచ్చింది?" ఆ అబ్బాయి మొహంలో విచార రేఖలు ప్రత్యక్షమైనాయి



ఫొటో మాస్టర్ రమణ.

దిగులుగా, బాధగా చుట్టూ చూసి, చిన్నగా చెప్పాడు" నాకు అమ్మ తప్ప ఎవరూ లేరండీ అమ్మకు వారం రోజుల్నుంచీ ఒకటే జ్వరం డాక్టరు గారి దగ్గరికెళ్తే– ఫీజిస్తేనే వచ్చి చూస్తానన్నాడు మేం చాల పేదోళ్ళం సార్ ఎవరో పెద్దాయన అనుకుంటూండగా విన్నాను. రక్తం కూడా అమ్ముకోవచ్చుని తెల్సింది! అందుకేవచ్చాను సార్

చిరిగిన దుస్తులు ధరించి, దీనంగా చెబుతున్న ఆ కుర్రాడ్ని అంతా జాలిగా చూసారు. కొందరి హృదయాల్లోకి ఆ బాలుడి మాటలు సూటిగా దూసుకు పోయాయ్. తన తల్లి ఆరోగ్యం కోసం ఆ చిన్నారి తన రక్తాన్ని అమ్ముకోడాని క్కూడా సిద్ధమయ్యాడు! ఆ కుర్రాడి త్యాగనిరతికి అందరి కళ్ళు చెమర్చాయి. వెంటనే అందరూ కలిసి ఓ పాతిక రూపాయలు చందా వసూలు చేసి, ఆ కుర్రాడికిచ్చి పంపించారు – ఆ బాలుడి తల్లి త్వరగా కోలుకోవాలని ఆశిస్తూ!

నేడు ప్రపంచ వ్యాప్తంగా కొన్ని లక్షల మంది బాలబాలికలు అనాథలుగా, అన్నార్తులుగా, దీనంగా తమ జీవితాలను కడు దయనీయంగా గడుపుతున్నారు.

క్వారీల్లో కొండరాళ్ళను, బండలను పగలకొట్టి, తట్టలో మోసే చిన్నారులున్నారు! వెట్టి చాకిరి క్రింద పెత్తందార్ల కర్కశ, కర్కోటక ఉక్కు పాదాల అడుగున బానిసలుగా నలుగుతున్న చిరంజీవు లున్నారు! వికలాంగులుగా రోడ్డు ప్రక్కన – ఎండావానల్లో తమ జీవితాలను వెళ్ళబుచ్చే చిన్నారి అభాగ్యులున్నారు! తల్లిదండ్రులున్నా వారి ప్రేమాదరణలకు నోచుకోని చిన్నారులున్నారు! పరిస్థితుల ప్రాబల్యంతో జేబుదొంగలుగా మారిన బాలబాలికలూ ఉన్నారు! బిక్షాటనే వృత్తిగా జీవించే చిన్నారులున్నారు!

అయితే అనాథాశ్రయాలూ వున్నాయి, చిన్నారుల సంక్షేమ నిధులను ఆరగించే ప్రబుద్ధులూ మన మధ్యే ఉన్నారు మరి!

దేవతల ప్రతిరూపాలు, నిష్కల్మష, కపట రహిత, నిస్వార్థ జీవులు. రేపటి భావి సమాజ పౌరులు – ఈ చిన్నారి చిరంజీవుల భవిష్యత్తు గురించి మేధావులంతా ఆలోచించి, ఓ దృఢ నిర్ణయం తీసికోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది

గోలి గురుప్రసాదరావు,
రామవరం.□

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు :
పూర్తి చిరునామా :

పిన్‌కోడ్ :




ఎలిమెంటరీ స్కూలులోని ఒక్లాసురూమది. మాష్టరు గారు ఇంకారాలేదు. లీడరు క్లాసును ఓ కొలిక్కి తేవాలని ప్రయత్నిస్తున్నాడు. బుద్ధిగా తలొంచుకుని క్లాసు పుస్తకం పుచ్చుకున్న ఓ అబ్బాయి దగ్గరసా వచ్చాడు.

"ఒరేయ్! మురళిగాడు ఈరోజు స్కూలు కొచ్చాడు. మీ దగ్గర చిల్లర డబ్బులు జాగ్రత్త అని అందరికీ చెప్పాను. నువ్వోబుద్ధావతారంవి. మళ్ళీ హెచ్చరిస్తున్నాను. రోజూ ఏదో కొనుక్కొస్తావు. నీ దర్పా అంతా స్కూలులోనే చూపాలా!"

ఇంతలో మాష్టారు క్లాసురూములోకి వచ్చారు. కబుర్లు చెప్పుకుంటున్నవారు సహితం గప్‌చుప్ అయారు. ఇంతలో ఒక్కబ్బాయి బిక్కముఖం వేసుకుని బితుకూ బితుకూ మని వచ్చాడు. భయం భయంగా అడుగులో అడుగేసుకుంటూ వచ్చాడు.

"ఏరా! నీకెన్ని సార్లు చెప్పాలి. ఏమైనా అంటే నీ తండ్రి తాగుడుగురించి చెప్తావు. మీపిన్ని పెట్టే బాధలు ఏకరువు పెడ్తావు" అని మాష్టారు ముందు తిట్టారు. మళ్ళీ ఆయనే చనువుగా ముందు బెంచీలో కూర్చోబెట్టారు. ఆ అబ్బాయి మాష్టరు అడిగిన వాటికి టకటక సమాధానాలు చెప్పాడు.

స్కూలు వదిలాక మురళి ఆ అబ్బాయి దగ్గర చేరాడు.

"ఏరా! రాజూ, ఇంట్లో అన్ని గొడవలంటావు! నీకు శుభ్రమైన బట్టలులేవు. కడుపునిండా తిండి ఉండదు. నాకైతే మా అమ్మ లేదూలేదూ అంటోంటే బలేకచ్చుగా ఉంటుంది."

రాజు మాటాడలేదు. మురళి స్నేహం ఎవరూ చెయ్యరు. రాజుకి కూడా భయమే! ఎందుకంటే తన దగ్గరెటూ డబ్బులుండవు. తీయడం అలవాటు చేస్తాడని అసలు భయం. ఇంతలో ఓ అమ్మాయి వచ్చింది.

"రాజా! రా, నాతో మాఇంటికి." అని పిలిచింది. ఇందాక బుద్ధిగా తలొంచుకుని చదివే అబ్బాయి అక్కడికి వచ్చాడు.

ఆ అమ్మాయి సంబరంగా ఎదురెళ్ళింది.

"అరె! మోహన్ నువ్వింకా ఉన్నావా? స్కూలువదిలాక నీకింక ఎవరితో పలకడం అలవాటు లేదుగా?" అంటూ ఇంకా ఏదో చెప్పబోతే కసిరాడు.

"నీలా స్కూలు నుండి దారి పొడుగునా ఏవో తలతిక్క పనులు చేస్తావా? నీకు టెక్కు ఎక్కువ."

మురళీ ఆ అమ్మాయి వైపు జాలిగా చూశాడు.

"పాపా! వాడికి తలపొగరు జాస్తి". అన్నాడు నిర్లక్ష్యంగా మోహన్ కేసి చూస్తూ. ఆ అబ్బాయి పట్టించుకోలేదు. ఆ అమ్మాయిని చూసి "వస్తావా! ఇంకాఏమైనా చక్కబెట్టాలా!" అన్నాడు.

"రాజు చూడు పాపం! ఈ రోజు మా ఇంటికి....."

అంటూంటే

"నాకు కథ చెప్తానన్నావు. నేను అదినమ్మి, నీకోసం అమ్మ చేసిన మిఠాయి తెచ్చాను. నన్ను పిలవ్వేం?" అన్నాడు.

"పాపం వాహినిని ఏం అనకు మోహన్!" అని రాజు వాహిని పక్షం మాట్లాడాడు.

"ఈ అబ్బాయెవరు?" అంది మురళిని చూపుతూ!

"నేను మంచాడ్ని కానంటారు. ఎవరూ నాతో మాటాడరు" అన్నాడు మురళి.

"నువ్వు రా! మోహన్ పద!" అంది.

వాహిని ఇంట్లో చిన్నతోట ఉంది. కొబ్బరి చెట్లున్నాయి. వాటి నీడలో అప్పటికే ఆమె ఆట నేస్తాలు కూర్చున్నారు. వాళ్ళమ్మగారు వీధిగుమ్మంలో ఈమె కోసం ఎదురు చూస్తున్నారు. వాహిని పరుగున తల్లికి ఎదురెళ్ళింది. ఆవిడ వాహిని చేతుల్లోని పుస్తకాలు అందుకుని ముద్దు పెట్టుకుంది.

"అమ్మా! నేను వీళ్ళకి మామిస్ చెప్పిన స్టోరీ చెప్పాలి. మరే చూడు మోహన్ నాకోసం మిఠాయి తెచ్చాడు...." అంటూంటే తల్లినవ్వింది, మోహన్ వారి బంధువుల అబ్బాయి.

"సరేలే! నీ సంగతినాకు తెలియదా? వాళ్ళకి నువ్వు పెట్టు. ముందు ముఖం కడుక్కునేది ఉందా?" అని చేయిపుచ్చుకు వాహినికి ముఖంకడిగి, పౌడరద్ది, బొట్టు పెట్టింది.

అందరినీ చెట్టుక్రింద చాపవేసి సమావేశ పరిచి వాహిని దర్పాగా అడిగింది. అప్పటి వరకూ కబుర్లలో ఉన్నవాళ్ళు గప్‌చుప్ అయారు.

"క్రిందటి వారం నేనెక్కడ ఆపాను?" మోహన్‌కి ఆ బెట్టుసరి చూస్తే వొళ్ళు మండింది.

"అసలు నువ్వు చెప్పిందేంటిట! ఆ సిండరెల్లా కథ మురిపించి, నీ స్వంత కవిత్వం జోడించి చంపుతున్నావు". మోహన్ కసురుకున్నాడు.

"ఎస్! మనం పిల్లలం పెద్ద పెద్ద కథలు మనకెందుకు. పాపం మురళికి ఈ రోజే కొత్త. మళ్ళీ బిగినింగు నుండి స్టార్టు చేస్తాను." అంది.

"తెలుగులో అఘోరించు. నువ్వు కాన్వెంటులో చదివినంత మాత్రాన తెలుగు రానట్లుంటావేం!" మోహన్ వాహినీల సంగతి అందరికీ తెలుసు. వాళ్ళ పోట్లాట సరదాగా చూస్తారు.

"నువ్వెందు కొచ్చావు? మిఠాయి తెచ్చి దాచేసుకున్నావు. కుళ్ళుబోతువి." వాహిని కయ్యానికి కాలుదువ్వింది. మురళికి ముచ్చటగా ఉంది. చక్కగా వాళ్ళమ్మగారు ముద్దు చేస్తారు. దర్పాగా ఉందా పాప. అందరితో ఒకేలా మాట్లాడుతుంది. క్లాసులో ఒక్కమాటకూడా మాటాడని మోహన్ కెందుకు వాహినిని చూస్తే కోపం? వాడికి గర్వం. హు! పొగరు.

"ముందు తినిగానీ చెప్పవు. అది ఇంత డొంక తిరుగుడుగా చెప్పాలా! ఈ సారి నీ కేది తెచ్చినా కావిడేసుకుని తేవాలి." అని రాజు వాహినికిచ్చాడు. వాహిని వాళ్ళమ్మ గారు కూడా తినుబండారాలు తెచ్చారు. అందరికీ ఇచ్చి వర్ణించి వర్ణించి కథ కొంత చెప్పి ఆపేసింది. పిల్లలంతా చక్కగా తిన్నారు. వాహిని తమ స్కూలులో మిస్ గారు ఎలా చెప్తారో యాక్షన్‌తో చెప్తుంది. అసలు కథకంటె అవే బాగుంటాయి అందరికీ! వెళ్తూ వెళ్తూ మళ్ళీ వారం కలుద్దామని అందరికీ టాటా చెప్తోంది. మురళి నెమ్మదిగా వాహిని దగ్గర చేరాడు.

"నేను ఇక్కడెవరివీ దొంగతనం చెయ్యను. నన్ను ప్రతీవారం రానిస్తావా వాహినీ!" అన్నాడు.

"అరె! నువ్వు దొంగతనం చేస్తావా? తప్పుకదూ! రాజు చూడు ఎంత మంచివాడో! అలాగుండాలి" అంది వాహిని.

"అవును! మాఅమ్మ నేను అల్లరి చేస్తానంటుంది. అన్నీ కావాలని గొడవ చేస్తానుట. నేనేది అడిగినా తిడుతుంది." అని మురళి వాహినికి తనగురించి చెప్పాడు.

"పెద్దవాళ్ళని మనం ఏం అనకూడదు. షోన్లే! ఈరోజు నువ్వే నా ఫ్రెండ్సందరిలోకి మంచాడవిట. ఏదుంటే అదే సర్దుకోవాలి. మోహన్ చూడు ఏమీ అడగడు. రాజు చూడు వాళ్ళ పిన్ని కొట్టినా ఎదురు చెప్పడు." అని వాహిని ఆరిందాలా మురళికి నీతులు చెప్పింది. మురళి అంటే ఆమె కెంతో జాలి. అభిమానం ఏర్పడ్డాయి,

"నువ్వెప్పుడూ నాతో స్నేహంగా ఉంటే అలాగే వాహినీ!" అన్నాడు మురళి.

★ ★ ★ ★ ★

కాలగతిలో సంవత్సరాలు గడిచాయి. అదే ఇల్లు. అవే కొబ్బరిచెట్లు. పిల్లలు చక్కగా అలాగే ముచ్చటగా కబుర్లు చెప్పుకుంటున్నారు. అయితే వారు వాహినీ. రాజు, మురళికారు. వేరే పిల్లలు. ఈసారి లీడర్‌గా ఓ బాబు కబుర్లు చెప్తున్నాడు అందరూ వింటున్నారు.

గేటు తీసుకుని ఓ యువకుడు వచ్చాడు. చకచకా ఇంట్లోకి వెళ్తోంటే, కబుర్లు చెప్పే అబ్బాయి గబగబా వచ్చాడు.

"ఎవరు కావాలి. వాహిని అత్తయ్య లేవట్లేదు. మాటాడలేదు. ఇంట్లో అమ్మా నాన్నా, నాయనమ్మ లేరు."

ఆయువకుడు ఆ అబ్బాయి ముఖ భంగిమ, పెదవుల కదలిక చూస్తూ, చిరునవ్వు నవ్వాడు.

"మీ అత్తయ్య బలే ట్రయినింగిచ్చిందిలే! వెళ్ళి మోహన్ వచ్చాడని చెప్పు."

తుర్రుమని వెళ్ళిన అబ్బాయి తూనీగలా ఇట్టే ఎగురుకుంటూ వచ్చాడు.

"అత్తయ్య రమ్మంది. మరే! అత్తయ్యను ఎక్కువ మాట్లాడించకండి. డాక్టరు చెప్పారు"

అన్నాడు.

"మీ అత్తయ్య ముందు నా ఫ్రెండు తర్వాతేనోయ్ నువ్వు పుట్టింది." అని అతడు లోపలికి వెళ్ళాడు.

గదిలో మంచాని కంటుకుని పాలిపోయి ఉందో యువతి.

"వాహినీ!" మోహన్ చనువుగా వాహిని పక్కనే కూర్చున్నాడు.

ఆ అమ్మాయి వెలిసిన బట్టలాంటి పేలవమైన నవ్వు నవ్వింది.

ఆ యువకుడు మాటాడలేదు. వాహిని అరచేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. రక్త విహీనంగా ఉన్న ఆ చేయి స్పర్శజ్ఞానం తెలియనట్లే ఉంది.

కొంచెం సేపు నిశ్శబ్దమే రాజ్య మేలింది.

"పేపరు చూశాను" అన్నాడు గొంతు పెగిల్చుకుని.

ఆ అమ్మాయి హృదయవిదారకంగా అరచేతుల్లో ముఖం పెట్టుకుని రోదించింది. అయితే ఏడవడానికి ఆ గుండె కన్నీళ్ళు కార్చి కార్చి, ఇంకిపోయిందేమో! •విచారంతో నిండిన మనసు మూగబోయిందేమో! అన్నట్లు నిశ్శబ్దంగా ఉందా రోదన.

"మురళి! మురళి!" అంది పొడారిపోతున్న గొంతు పెగుల్చుకుని.

"అవును. నాకు తెలుసు. నువ్వు మురళి మంచివాడిగా మారిపోతాడని. అపురూపమైన వరంలాంటి నీ జీవితకాలమంతా ఎదురు చూడగలవు. మాటలని చేతలలో ఒక్కనాడూ చూపడానికి ప్రయత్నించలేదు." మోహన్ కళ్లముందు మురళి పరిచయమైన దగ్గర్నుండీ వాహిని ఎలా మారిపోయిందో జరిగిన సంఘటనలు కదిలాయి. ఆఖరికి రాజా ఆణిముత్యంలాంటి రాజా

మరణించాడు. మురళి స్నేహం అయిన వరకూ వాహినికి రాజా ఎంతో ఆప్తుడు. ఈ మోహన్‌తో గిల్లికజ్జాలు ఎంతో ఇష్టం. రోజా స్కూలుకి



వచ్చేప్పుడు వాహినికి తాయిలం లేకుండా రాలేదు. అమ్మ చేయక పోతే పిప్పరమెంట్లో, బిళ్ళలో కొనేవాడు. అటువంటిది తనని కూడా పట్టించు కొనేది కాదు. 'అయినా తనెప్పుడూ వాహినినీ 'ఆమె సహవాసాన్నీ వదలలేదు. ఎప్పుడూ మురళి గొడవే! ఆమె ఆడనేస్తాలు కూడా మురళి స్నేహం వదలమనేవారు

"వాహినీ! ఆ మురళి నా చిల్లర కాజేశాడు. పైగా ఉత్త పోకిరి. నీ దగ్గర కుదురుగా 'ఉంటాడు. మోహన్ కంటే , రాజుకంటే నీతో తనే స్నేహంగా ఉండాలని నీతో మాయమాటలు చెప్తాడు. అతడిని రానివ్వకు." అని వాహినికి నచ్చజెప్పేవారు. వాహిని వినలేదు. మురళి మారాలి. అదే ఆమె కోరిక.

ఇంక రాజు, పాపం ఇంకో సంవత్సరం అయితే స్కాలరుషిప్పుతో చదివే ఇంజనీరింగు అయిపోవల్సింది. అటువంటి సమయంలో ప్రేమ వ్యవహారంలో దెబ్బతిన్నాడు. ఏమైందో ఎవరికీ చెప్పలేదు. ఆత్మహత్య చేసుకున్నాడు. వాహినిని ఓదార్చగలనా అనుకున్నాడు మోహన్! ఆమె విచారించి, విచారించి ఓ నిట్టూర్పు వదిలింది

"పాపం! రాజు ఉత్త పిరికివాడు. ఎందుకు ప్రాణం తీసుకోవాలి' అంది. తను మంచి ఉద్యోగం అయిందని సంబరంగా చెప్తే!

"నీకేం మోహన్! తెలివి ఉంది. జీవితంలో ఒడుపు తెలుసు" అంది. తను పొల్చగలిగాడు. ఆమె పసితనంలో మురళిని నమ్మింది. ఆ మనసు విరగని పాలలా ఈ నాటికీ అలాగే ఉంది. పేపరులో నీలిచిత్రాలలో లావాదేవీలున్న వ్యక్తులలో మురళి నిర్ధారణఅయాడు. అతడికి కారాగారవాసం. ముందు తను ఆలోచించింది వాహినీ గురించే! ఇంతలో వాహినిలో నెమ్మదిగా చలనం వచ్చింది. మంచం మీద నుండి లేచింది. మోహన్‌కి అతిథిమర్యాదలు చేసింది.

"వాహినీ! నువ్వేమైపోయావోనని దిగులు పడ్డాను. పిచ్చిపిల్లా! పసి తనం ఎంత స్వచ్ఛమైనదో, దాన్ని వెన్నంటి వచ్చే యవ్వనం అతి భయంకరమైనది. వాళ్ళు నీ మాటలు, నీ కబుర్లు వినే స్థితి దాటి పోయారు. అందుకే రాజు అంతస్థులు, అన్నీ మరచి ప్రేమలో పడ్డాడు. మురళి వల్ల నువ్వు బాల్యంలో మా అందరి చేత మాటలు పడ్డావు. యవ్వనం వచ్చిన దగ్గర్నుండీ అతనిని మారమని నువ్వు పెట్టే పోరు నీకు నిందలే మిగిల్చింది. అతడి తల్లి, ఆఖరికి నిన్ను నేలమీద నడిస్తే కందిపోతావని చూసే నీ తల్లి కూడా అనుమానించింది. అయితే మురళి మారి పోతాడా మోహన్! నీలాగ మంచబ్బాయిలా ఉంటాడా! అనే నీమాటల్లో నిజాయితీ నాకు కూడా కనిపించలేదంటే నమ్ముతావా? నాకిష్టమైన బొమ్మని మురళి లాక్కుని విరిచేసేడేమో నన్నంత బాధగా ఉండేది. వాహినీ, మురళి తప్పులు ఒకటయితే కదా లెక్క బెట్టడానికి. చిన్న తనంలో చిల్లర, పెద్దయాక తండ్రి జేబులో నోట్లు తీశేవాడు. ఎక్కడ చిన్న ఉద్యోగం దొరికితే అక్కడే మోసం దొంగతనం. మొదలు పెట్టేవాడు ఆడపిల్లలను పాడు చేసి, వాళ్ళే తన వెంట పడ్డారని తప్పు వాళ్ల మీదికి నెట్టేవాడు. అందరితో ఏమనేవాడో తెలుసా! "వాహినీ మొండిది. పెంకెది. నన్ను మోహన్‌లా ఉండమంటుంది. ఆ మోహన్ గాడికి వాహినిని దక్కనివ్వను. అందుకే వాహినిని ఇంకా నమ్మిస్తాను. పిచ్చిది ఆ భ్రమలోనే ఉంటుంది. వాడే వాడి దోవ చూసుకుంటాడు." అనేవాడు.

వాహినీ అలా మోహన్ వైపే చూసింది. ఏమనుకున్నా మురళి ఇంక మంచిదారికి రాడు. అతి జుగుప్సాకరమైన వ్యవహారం నడిపాడు. ఇన్నాళ్ళూ అతడెలా తిరిగినా, "వాహినీ నేను మారదామంటే పరిస్థితులు అనుకూలంగా లేవు. కొంచెం డబ్బు సంపాదించాక ఇంకేం తప్పు చెయ్యను." అంటే ఆశ మినుకు మినుకు మనేది. తప్పు అతడిదిగా తోచేది కాదు ఇప్పుడు అతికఠిన శిక్ష వేశారు. ఎప్పుడూ ఎంతగానో నచ్చ జెప్పేది.

"మురళీ! నువుమంచాడివి. ఈబలహీనతలను విడిచిపెట్టు" అనేది. చదువున్నా, ఉద్యోగమున్నా, తనకోగుర్తింపున్నా మురళిని మంచిగా మార్చడమే వాహినికి గమ్యంగా ఉండేది

"మురళి నన్ను ప్రత్యేకంగా చూస్తాడు నేనంటె ఎంతో అభిమానం" అని మురిసిపోయేది. స్నేహితులు, స్నేహితురాండ్రు వాహిని సలహాలు వినేవారు. ఆమె గుర్తించి వాపోయేవారు . దేనికి మనసు వికసించలేదు. ఆ మురళి బాగుపడడం ఇది తన ఆశయం తీరిందని తృప్తిపడడం ఈ జన్మలో జరగదు. పోనీ అతగాడిని ప్రేమించిందా? అంటే అదీలేదంటుంది. అతడు మంచివాడుగా మారి, తనకంటే అందమైన, చదువుకున్న అమ్మాయితో సుఖంగా ఉంటే తనకదే చాలుట." "ఏమిటో వెర్రిమాలోకం". అనుకునేవారు.

తండ్రి పోయాడు. వదిన గారు వచ్చినా, ఆమెకు వాహిని తత్వం తెలుసు ఆమె స్వేచ్ఛా స్వాతంత్రాలకు ఎట్టి అడ్డంకులు లేవు.

మేనల్లుడు మనోజ్ పుట్టాక వాహిని ఈ ప్రపంచం మరచింది. మనోజ్‌కు సంరక్షణ చేయడం అతడికి అన్నీనేర్పడం ఇవే ఆమె కాలక్షేపం. మనోజ్ కూడా అయిదో ఏడు వచ్చిన దగ్గర్నుండీ. వాహినికి డిటో గా తయారయాడు పిల్లలను పోగు చేయటం, కబుర్లు కధలు, నవ్వులతో ఇల్లు మార్మోగిపోవాల్సిందే! ఉద్యోగ రీత్యా దూరంగా వెళ్ళిన మోహన్ వాహిని నుండి జవాబురాక పోయినా ఉత్తరాలు వ్రాయటం, ఆమె కబుర్లు మరవలేదు. పేపరు చూసిన మోహన్ వాహిని గురించి దిగులుతో వచ్చాడు. మురళికి పడినశిక్ష కంటే, అతడ్ని నమ్మినందుకు వాహిని తనను తనే శిక్షించు కొంటుందని తెలుసు.

"వాహినీ! నువ్వు చూడు నీకేం కావాలో నీకే తెలియదు నలుగురితో కబుర్లు, అందరూ మంచిగా ఉండాలని అనుకోటం ఇదే జీవితం కాదు. నువ్వు చూసిన జీవితం ఎంత! ఆమాటకొస్తే నేనూ గొప్పవాడ్ని కాను చిన్నతనం నుండీ నువ్వు నాతో స్నేహం చెయ్యాలని శాసించే వాడిని. నువ్వు నా తత్వం మంచిదికాదని తిట్టేదానివి. నాకు ఇన్నీ నేర్పి, ఇప్పుడిలా మూగబోతే ఎలా వాహినీ! మురళిని మర్చిపో! అతడికి నీముఖంలో నవ్వుచూడాలనే సహృదయతలేదు అదృష్టంలేదు. నిన్ను నమ్మించి, నీ ఆశలు నట్టేట ముంచాడు. తల్లికి పనికిరాని, అమాయకపు సంతానం మీదే భ్రాంతి ఉంటుంది. ప్రతీ స్త్రీకి అంతర్గతంగా మాతృభావనే అధికంగా ఉంటుంది. ఇకనైనా మురళి పట్లనీకున్న స్వచ్ఛమైన అభిమానాన్ని 'లోకుల్నచే రంగులు పూయించి కలుషితం చేయకు" అలా ఆమెతో కబుర్లు చెప్తూనే ఉన్నాడు. చివరికి వాహినే అడిగింది.

"ఇన్ని కబుర్లు ఎప్పుడు నేర్చావు." స్వన్నని మందహాసం ఆ ముఖంలో చోటు చేసుకుంది.

నేర్పితే, నేర్పితే ప్రపంచంలో మిగిలేదంతామంచే! అవినీతి ఇలా విలయతాండవం చేయదు. నాలో దాగిన మమకారమే నేర్పితే, నువ్వెప్పటికీ నాదానివి కావాలనే తాపత్రయమే చెప్పింది" అన్నీ మరచి అతడిదో సిట్లో ఆమె ఆనంద బాష్పాలు రాల్చింది. మురళి మిగిల్చిన విషాదానికి అవిధంగా తెరపడింది. □



# చిదంబరానంద



స్వామీ చిదంబరానంద!

ఆ ముఖంలో ఏమి వర్చస్సు!

ఆ కళ్లలో ఏమి తేజస్సు!

దబ్బపండులాంటి శరీర చ్ఛాయ!

సరైన వొడ్డూ పొడుగూ వుండడం ఒకెత్తు అయితే – చక్కని ముఖ కవళికలూ గంభీరమైన కంఠస్వరం కలిగివుండడం మరొకెత్తని చెప్పాలి! అందుకే వారి ప్రతి మాటా, ప్రతి కదలికా, భక్త జనుల్ని ఆనందసాగరంలో ముంచెత్తుతూంటాయి.

ఆ కళ్లజోడూ, పొడుగాటి గెడ్డం స్వామికి ఎంతగానో నప్పాయి!

అనర్గళంగా సాగిపోయే వారి వేదాంతోపన్యాసాలని విని తీరాలి!

మొట్టమొదటిసారిగా వారి ఉపన్యాసం విన్నప్పుడు పరమహంస ముగ్ధుడయిపోయాడు! వారి ఉపన్యాసాలన్నీ విన్నాక తను వారికి శిష్యుడుగా సుశ్రూష చెయ్యడం వినా – తన జీవితానికి మరో ధ్యేయం లేదనుకున్నాడు. ఆఖరి రోజు – స్వామివారి కాళ్ల మీద పడిపోయి తనను శిష్యుడిగా స్వీకరిస్తే తప్పిస్తే కాళ్లని విడిచిపెట్టేది లేదని అన్నాడు. స్వామి ముఖం అతి ప్రశాంతంగా వుంటుంది. అయినా వారి కళ్లలో చిన్న పిసరు కంగారు కనిపించింది! తన కోరికని మన్నించేంతవరకూ పరమహంస స్వామివారి కాళ్లని వొదిలిపెట్టలేదు!

తను తీసుకున్న నిర్ణయం సరైనదేననిపిస్తోంది. తన భక్తి తత్పరతతోనూ సేవలతోనూ స్వామిని రంజింపచేశాడు. కొద్దికాలంలోనే అనుంగు శిష్యుడయిపోయాడు.

స్వామి వేదాంతం మీద ఉపన్యాసాలు ఇస్తారని చెప్పి ఇహాన్ని గురించి పట్టించుకోరనటానికి వీల్లేదు! ఏ ఊరు వెళ్లినా తనకీ, తన శిష్య పరంపరకి, సదుపాయాలన్నీ సక్రమంగా అమరుతున్నాయో లేదో చూసుకొంటారు. ఒకమారు స్వామి ఉపన్యాసం ముగించుకొని గెస్టు హవుస్‌కి తిరిగొచ్చేశారు. ఒక మామిడిపళ్ల వర్తకుడు వచ్చాడు. ముఖంలో స్వామివారి పట్ల భక్తి భావం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. కానీ ఆ చూపుల్లో ఏదో ఆందోళన! మాట సరేసరి! చాలా కంగారుగా వుంది! ఇన్‌కంటాక్స్ గొడవల్లో ఇరుక్కొన్నాట్ట. బయటపడే మార్గం సెలవియ్యమన్నాడు.

స్వామి అతనికి ధైర్యం చెప్పి – స్థిమితపడేటట్టు చేశారు. గాలిలో చేయి తిప్పారు. చేతిలోకి అరటిపండు ప్రత్యక్షమయింది! ప్రసాదాన్ని తినమన్నారు. వర్తకుడు అప్పటికప్పుడే అరటి పండు వొలుచుకొని తిన్నాడు. వెళ్తున్నప్పుడు ఎంతో సంతోషంగా వెళ్లాడు! మరో రెండు రోజుల తర్వాత మళ్లీ వచ్చాడు. స్వామివారి కాళ్ల మీద పడ్డాడు. వారి పాద ధూళి తన నెత్తిన జల్లుకున్నాడు. ఇన్‌కంటాక్స్ గొడవల్లోంచి బయటపడ్డాట్ట!

"సర్వసంగపరిత్యాగులు! మీకేమిస్తేమటుకు అంగీకరిస్తారు?!" అన్నాడతను.

స్వామి ఉపనిషత్తులోంచి శ్లోకం ఒకటి కోట్ చేశారు. దాని సారం ఏమిటంటే – భక్తజనుల్ని సంతృప్తిపరచటం కోసం – వారిచ్చే కానుకల్ని అంగీకరించటం తనవంటి సర్వసంగపరిత్యాగులకి ముఖ్యమైన విధి – అని!

అంతే! ఆ సాయంత్రమే ఘుమఘుమలాడే రసాలూ, పంచదార కలిసెలూ, బంగినపల్లిలూ, పెద్ద పెద్ద బుట్టల్లో వచ్చాయి!

మరోమారు కాఫీ హోటల్ ప్రొప్రయిటర్ వచ్చాడు. మనిషన్నాక సమస్యలు లేకుండా ఉంటాయా? ముఖం చేతులూ కదులుతూనే ఉన్నాయి! నెర్వస్ వీక్‌నెస్‌ట. ఎన్ని వైద్యాలు చేయించినా నయం కాలేదుట. స్వామివారిని శరణుజొచ్చాడు.

స్వామి గాలిలో చెయ్యి తిప్పారు. విభూతి వచ్చింది. అతనికిచ్చారు. నుదుట్ని పెట్టుకోమన్నారు. చేతులకి రాసుకోమన్నారు. అంతే! చెయ్యి వణకడం ఆగిపోయింది! ముఖం కూడా స్టెడీగా వుంది! స్వామివారి విభూతికి ఎంతటి మహత్తు!!

అతను పరమానందభరితుడయిపోయాడు! స్వామివారికి తనేమి ఇచ్చినా వొప్పుకోరు కదా –

అన్నాడు. స్వామి వెంటనే భగవద్గీతలోంచి ఒక శ్లోకాన్ని వినిపించారు. ఆ శ్లోకం ప్రకారంగా తను అతనిచ్చే కానుకలేమైనాసరే – అంగీకరిస్తానన్నారు. మాటవరసకి హోటల్ నుంచి రోజూ తనకీ తన శిష్యులకీ తినుబండారాలు పంపిస్తే తాము అంగీకరిస్తామన్నారు. ఆ విధంగా చెయ్యడం శ్రీకృష్ణుడు కుచేలుడి దగ్గరనుంచి అటుకులు అంగీకరించడం లాంటిదన్నారు. అంతే! ఆ మరునాటి నుంచి నోరూరించే తినుబండారాలు రావటం మొదలయ్యాయి.

స్వామి ఒకటే చెప్పారు. తను వేదాంతం మీద ఉపన్యాసాలివ్వొచ్చు. తను సన్యాసీ కావచ్చు. కానీ భక్తుల్ని సంతృప్తిపరిచేటందుకు వారిచ్చే కానుకల్ని అంగీకరిస్తారు

రకరకాల మనుషులు రకరకాల సమస్యలతో స్వామివారి దగ్గరకి వచ్చేవారు. స్వామి –వారికి విభూతి ఇవ్వటం – అది నొసట్ని పెట్టుకుని నోట్లో కొద్దిగా వేసుకుంటే – సమస్యలు ఇట్టే మంచులా కరిగిపోవటం! భక్తులు స్వామి వారికి రకరకాల కానుకల్ని సమర్పించటం ద్వారా తమ కృతజ్ఞతనీ, భక్తినీ, తెలియజేసుకొనేవారు. గెస్ట్ హవుస్ అంతా పళ్ళూ, ఫలహారాలూ, బట్టలూ, బెల్లపు అచ్చులూ, ఇంకా ఖరీదయిన వస్తువులతోనూ నిండిపోయి వుండేది. స్వామి వాటిని తిరిగి భక్తులకే ఇచ్చేస్తుండేవారు. ఆయనకేం కావాలని? ఏ పూర్లో వచ్చిన కానుకల్ని ఆ పూర్లోనే భక్తజనాలకి పంచి పెట్టేసేవారు.

పరమహంస కూడా ఒకమారు విపరీతమయిన కడుపునెప్పి వస్తే – స్వామివారి విభూతి కొద్దిగా నోట్లో వేసుకొని మింగాడు. అంతే!! కడుపు నొప్పి మరుక్షణంలోనే నయమయింది!! మరోమారు జ్వరం తగిలినట్టనిపించి స్వామివారి విభూతి సేవించాడు. అంతే! మళ్ళీ జ్వరం తగిలితే ఒట్టు!! అందుకే స్వాములవారు కారణజన్ములని నమ్ముతాడు.

స్వామి ఉపన్యాసం ఇస్తున్నంతసేపూ వొణికినట్టనిపించింది!! ఆ తర్వాత తనూ, స్వామి గెస్ట్ హవుస్‌కి వచ్చేశారు.

స్వామి వస్తూనే పక్కమీద వాలిపోయేరు. చలితో విపరీతంగా వొణికిపోతున్నారు!

తను స్వామి చేతిని పట్టుకొన్నాడు. వేడిగా కాలిపోతోంది.

స్వామికి జ్వరమా?!–

వారికి మానవాతీత శక్తులుండవచ్చు. కానీ వారూ మానవమాత్రులే కదా–

'పరమహంసా – తల పగిలిపోతోందోయ్–'

తనకి బలే బాధనిపించింది.

"పరమహంసా – వొళ్ళు కాలిపోతోందోయ్–'

తనకి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"ఏమిటి ఇంకా చూస్తూ కూర్చున్నావ్?!" స్వామివారు హెచ్చరించారు.

"అర్ధమయింది స్వామీ" అని లోపలికి పరుగెత్తాడు.

తీనెమీద దేవుడి విగ్రహం వుంది. విగ్రహం పాదాల దగ్గర స్వామివారు సృష్టించిన విభూతి పళ్ళెంలో వుంది!

తను గబ గబా ఇంత విభూతి తీసుకొని స్వామి దగ్గరకి వెళ్ళాడు. స్వామి నుదుట విభూతి పెట్టాడు. నోట్లో కొద్దిగా వెయ్యబోయాడు.

"ఏమిటి నువ్వు చేస్తున్నది?!"

"విభూతి స్వామీ – తమరు సృష్టించినదే –"

"అయితే?!–"

"కొద్దిగా నోట్లో వేసుకోండి స్వామీ–"

"వేసుకొంటే?!"

"జ్వరం నయమవుతుంది స్వామీ –"

స్వామికి ఎందుకోగానీ చాలా కోపం వచ్చింది!!

"మూఢా!! ఆ విభూతి మనకోసం కాదురా – భక్తజనుల కోసం – వెంటనే వెళ్ళి డాక్టర్ని తీసుకురా –" అన్నారు. □



# దూరదర్శనం

**లత**

కోణ్నేటి సరస్సుపై డాక్యుమెంటరీ ఈ మధ్యనే వేశారు కాని చరణ్‌సింగు నాలుగవ దినం ఇలాటివే వెయ్యాలి ఆనందకరమైనవేమి వెయ్యరాదు అదొక సంప్రదాయం– ఈ రోజుతో టి వి. విషాదయోగం అయిపోయింది

ఆ సందర్భంలో నూకల చిన సత్యనారాయణ గారి గానం వినిపిస్తున్నారు మనకున్న కొద్ది మంది మంచి కర్నాటక సంగీతవేత్తలలో నూకల వారొకరు వారి సంగీతం శ్రవణానందంగా ఉంటుంది– ఎంత కాలము వేచి యుందును? ఎంత భారము మోసికొందును? కృష్ణశాస్త్రి గారి ఆవేదనా గీతిక అద్భుతంగా పాడారు నూకల వారు

## స్వరరాగసుధ

కల్యాణి– మేళకర్త రాగం అంతర గాంధారం ప్రతి శృతి మధ్యమం– ఈ రాగం ఘంటసాల వారి ఫేవరేట్ రసానుభవాల సంపుటి ఈ రాగం మురళీగారు పాడిన త్యాగరాజ కీర్తన వినటం అరుదు– కిందటి వారం పాడిన కీర్తన భక్తి రంజనిలో పాతికేళ్ళ కింద పాడినగుర్తు– ఈ వారపు కల్యాణి పాతదే, కీర్తన అపురూపం. ఈ తడవ ఆయన పచార్లు చేస్తుంటే బ్యాగ్రౌండులో పాట వినిపించింది తన ఆత్మతో తనే ఏకమయినారు మురళీగారు రాగంతో రమించి కీర్తన పాడారు దొరకునా ఇటువంటి సేవ బాలసుబ్రహ్మణ్యం పాడినది పరధ్యానంగా వింటే బాలమురళీ గారు పాడినట్లే ఉంది– సలలిత రాగసుధా రససారం మురళీగారు 20 ఏళ్ళ కిందట పాడిన పాట దానికదే సాటి స్వరరాగ సుధా

* * * * * *

న్యాయంగా దుర్యోధనుడు అభిమానవంతుడు రాజరాజు ఒదినగారిని ఇంతగా అవమానించటం ఎందుకో నాకు నమ్మ బుద్ధిగాదు– అయినా దాన్ని వదిలేద్దాం దుర్యోధనుడు డైలాగులు మొదలు పెడితే పారిపోవాలని పిస్తున్నది ఈ పౌరాణిక ఏకపాత్ర చాలా విసిగించింది ఆంధ్ర దేశాన్ని– ఆ పాండవులు యుధమునకే సిధ మవుదురేని– ఇక చాలు– దుర్యోధనుడు ద్వారక వెళ్ళాడు– ఇహ కృష్ణుడిని చంపటానికి. ఈలోగా అర్జునుడు ప్రారంభించాడు. తిరుపతి కవుల పద్యాలు తప్ప వచనం ఏమి బాగా లేదు– ఆ పద్యాలను తమ పరిధిలో బాగా అన్నారు. పులిపాటినీ, బందా కొపలక్ష్మాయి, యడవల్లి లాటి వాళ్ళని తలచుకు గదా, సరిపెట్టుకుందాం తిరుపతి కవుల పద్యాలు విన్నాం అది చాలు– నేను బందా వారి పద్యాలూ వేమూరి రామయ్య గార్ల పద్యాలే విని సంతోషించాను

## గంగ

సంగీత నృత్య రూపకం గొప్పగా రక్తి కట్టింది నరనారుల ప్రార్థన వల్ల భూమికి దిగిన శివ వియోగిని గంగ తనపరీవాహక పైట చెంగు మాయటం భరించలేక సృష్టిరాశై పోతుంది నరనారులు మురికి తొలగిస్తారు గంగ ప్రసన్న మవుతుంది రావణ విరచిత శివస్తోత్రంతో శివునీ పండితరాయల గంగాలహరితోనూ వేద సూక్తుల తోనూ గంగనీ స్తుతించారు ప్రముఖ నర్తకి మృణాళిని– సమర్పణ

## ఆగదు ఉదయం

రచన దివ్య ప్రభాకర్ వల్లభరావు పిచ్చి పెళ్ళానికి నాగరికత నేర్పటమేకాక పెళ్ళాన్ని నాగరికత కలదని అనుమానిస్తాడు. లక్షలు సంపాదించి తండ్రిని కాదని మామని కుక్క అని తిడతాడు ఇది మనలోకం కాదు బావా– అని వెళ్ళిపోతారు వియ్యంకులు– రెండు సంవత్సరాల్లో లక్షలు సంపాదించాడని మరో స్నేహితుడు కాస్త ఆదర్శాలున్న వాడు బాధపడతాడు. మొత్తం మీద నాటిక ఇప్పుడు రక్తి కడుతోంది

## రథచక్ర

వార్తలతో ఇన్‌సాట్‌లింక్ తెగింది వార్తలు మొత్తం పోయినయ్ ఈ రథచక్రలోనూ అలాగే ఉంది. కొడుకు చదువుకోసం పడవెక్కిన ఇల్లాలికి గత జీవితం గుర్తు వస్తుంది చెయ్యిలేని భర్త పెంకులు తొలగించి పారిపోతాడు బహుశా అప్పటికే గర్భవతి కాబోలు ఈ రథచక్ర ఓ మాదిరిగా ఉంది– ఎప్పుడో పదేళ్ళ కిందటి నవల లాగుంది ఈ నాటకం

## అమృత

సుమిత్రానందన్‌పంత్ కవితా మాలిక సంగీతం సరస్వతీ వారువతూలిక– సుమిత్రానందన్‌జీ పర్వతాల మధ్య పుట్టి పెరిగిన వాడు సహజ ప్రకృతిని వర్ణించే ఈ కవి ఛాయావాది– క్రాంత దర్శి– ప్రకృతినీ. మంచు పర్వతాల్నీ మాతృభూమినీ అభిమానించిన కవి– ఆయన జన్మభూమి ఆల్మోరా ప్రాంతమని గుర్తు– మరి ఆయన ప్రకృతిని ప్రేమించి దాని ఛాయని మాయ అంటాడు

వ్యాఖ్యాత్రి జయాబచన్ అంటే జయబాధురి ఇందులో యుగళగీతం పాడే యువకుడికి సుమిత్రానందన్‌జీ ముడిలాటి జుట్టు ఉంచటం మంచి ఔచిత్యం ఈ మహాకవి వార్ధక్యంలో జ్ఞానపీఠ ఎవార్డు పొందారు నీలాంజనా నయనా– ఇది వర్షఋతు వర్ణన– జీవితం నడుస్తోంది అన్న గీతానికి గొప్ప ఫొటోగ్రఫీ ఇచ్చారు

## వెన్నెల వేట

రచన. యర్రం శెట్టిశాయి కన్యరిపోర్టు చేయటం వలన ఎడిటరు ఉద్యోగం ఊడిన హీరో దీప్‌చంద్ అనే పేరుతో ఒక గొప్ప ధనవంతుడి దగ్గర ఘోస్టు రైటరుగా కుదురుకుంటాడు దీప్‌చంద్ గొప్ప రచయిత మన ఎడిటరుకాదు కన్యకూడా ఆయన దగ్గరే సెక్రటరీగా చేరి ఆయన బంగళా చేరి ఏవో కొన్ని ప్రశ్నలకు పాడు సమాధానా లిచ్చాడు అందులో 'ఎందుకూ పనికిరాని రచయితలని పాప్యులర్ చేయడమే పత్రికల ధ్యేయం" అన్నాడు – అది టి. వి కూడా చేయగలదు– ఇప్పుడు జరుగుతున్న కథ విశాఖపట్నంలో జరిగిన కథలా గతంలో ఈ రచయితదే ఒక నవల వచ్చింది ఆత్మకథ ఇతరులు వ్రాసినప్పుడు ఆత్మకథకాదు ఆటో బయాగ్రఫీకి తెలుగు ఆత్మకథ. బయోగ్రఫీకి తెలుగులో జీవిత చరిత్ర అని వ్రాసిన వారి పేరు వేస్తారు ఇందిరాగాంధీ – కుష్వంత్‌సింగ్ లాగ ఆటో బయాగ్రఫీకి నా ఆత్మకథ అని గాంధీజీ వ్రాసినట్లు అంటారు రచయిత కొంచం జాగ్రత్త వహించాలి □

'రథచక్ర'లో లలన్‌సారంగ్



# హైదరాబాదు నోట్‌బుక్

## వర్ధమాన క్రీడాకారుడు

### శ్రీ జి. పి. ఫల్గున :-

సన్నగా, బలంగా, పొడుగ్గా వుండే ఫల్గునను చూస్తే ఎవరైనా ఇతడు క్రీడాకారుడయి వుంటాడు సుమా' - అనే భావం కలుగుతుంది అతని దృఢమైన నడక, చూపులు, హావభావాలు అలాటి భావం కలుగడానికి కారణం ఫల్గున నూటికి నూరు పాళ్ళు క్రీడాకారుడే క్రీడాకారుల కుటుంబంలో జన్మించాడు అగ్రజులందరూ క్రీడాకారులే, పరిసరాలూ ప్రోత్సాహం కలిగించాయి ఇక క్రీడాకారుడు కాక మరేమవుతాడు' ఫుట్‌బాల్ ఆటగాడుగా రూపొందాడు నేను సికిందరాబాద్ జిమ్‌ఖానా మైదానంలో మా అన్నయ్య వసుసేన ఫుట్‌బాల్ ఆటను చూసేవాడిని ఎంతో గర్వపడేవాడిని జిమ్‌ఖానా మైదానంలో ఫుట్‌బాల్ శిక్షకులుగా వున్న శ్రీ ఎస్ ఎ. సలాం నన్ను కూడ ఫుట్‌బాల్ నేర్చుకోమని సలహా యిచ్చారు మా అన్నయ్య వసుసేన కూడ ప్రోత్సహించారు - అన్నారు



శ్రీ జి. ఏ. ఫల్గున

ఫల్గున ఈ విధంగా 1979 ఫుట్‌బాల్ కోచింగ్ క్యాంపుతో ఫల్గున క్రీడా జీవితం ప్రారంభమయింది ఆ సంవత్సరమే మారేడ్‌పల్లి రోవర్స్ క్లబ్ నుంచి సి డివిజన్ లీగ్‌లో ఆడే అవకాశం కలిగింది అప్పుడు జాతీయ క్రీడాకారులతో కలిసి ఆడారు వారి మెలకువలు తెలుసుకున్నారు 1980-81లో సబ్ జూనియర్ నేషనల్స్ మద్రాసులో జరిగాయి దానిలో పాల్గొన్నారు అప్పుడు శిక్షకులు శ్రీ యాజ్ఞానీ మద్రాసులో అగ్రశేణి ఫుట్‌బాల్ క్రీడాకారులతో పరిచయమయింది అప్పటి నుంచి భారతదేశం పక్షాన విదేశాలతో ఆడాలనే వాంఛ కలిగింది తీవ్రంగా నిరంతరం కృషి ప్రారంభించారు 1982లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం క్రీడాకారులకు హాస్టల్ సౌకర్యం కలిగించి శిక్షణ ఇచ్చే పథకం ప్రకటించింది ఆ పథకంలో శిక్షణ పొందిన ఫల్గున పాట్నాలో జరిగిన స్కూల్ నేషనల్ ఫుట్‌బాల్ పోటీలో పాల్గొన్నారు 1983లో న్యూఢిల్లీలో జరిగిన సుబ్రత ముఖర్జీ ఫుట్‌బాల్ పోటీలోను గోవాలో జరిగిన జూనియర్ నేషనల్స్‌లోను, కోయంబత్తూరులో జరిగిన టి ఎఫ్ ఎ షీల్డ్ పోటీలోను, హైదరాబాద్‌లో జరిగిన నిజాం గోల్డ్ కప్ పోటీలోను, పాల్గొన్నారు. హైదరాబాద్ x1 (జూనియర్) జట్టుకు నాయకత్వం వహించి నిజాం గోల్డ్ కప్ పోటీలో మహమ్మడన్ స్పోర్టింగ్ క్లబ్ జట్టు వంటి పెద్ద జట్టును ఢీకొన్నారు 1984లో ఫల్గున జీవితంలో కొత్త మలుపు వచ్చింది ఆంధ్రప్రదేశ్ ఫుట్‌బాల్ అసోసియేషన్ మద్రాసులో జరిగిన సంతోష్ ట్రాఫీ పోటీలో కొత్త క్రీడాకారులకు అవకాశమిచ్చింది అప్పుడు ఫల్గున హైదరాబాద్ x1లో చేరి ఆడారు దురదృష్టవశాత్తు కేరళ జట్టు పోటీలో క్వార్టర్ ఫైనల్స్‌లో గాయపడి ఆస్పత్రిలో చేరవలసి వచ్చింది పిదప ఆయన హైదరాబాద్ x1 జట్టులో బెంగుళూరులో జరిగిన స్టాఫర్డ్ కప్ పోటీలోను మద్రాసులో జరిగిన విఠల్ ట్రాఫీ పోటీలోను, పాండిచ్చేరిలో జరిగిన ఎం జి ఆర్ ట్రాఫీ పోటీలోను పాల్గొన్నారు పై రెండింటిలో మొదటి దానిలో హైదరాబాద్ జట్టు గెలిచింది రెండవదానిలో రన్నర్స్‌గా వచ్చింది పిదప బొంబాయిలో జరిగిన రోవర్స్ కప్ పోటీలో హైదరాబాద్ x1 జట్టులో ఆడారు ఫల్గున సమర్థతను చూచి అఖిలభారత ఫుట్‌బాల్ సమాఖ్య కలకత్తాలో జరిగిన జూనియర్ ఇండియా కోచింగ్ శిబిరంలో శిక్షణకు సిఫార్సు చేసింది శిక్షణ పొందిన తరువాత ఫల్గున తన లోపాలు గ్రహించి, తీవ్రంగా కృషి ప్రారంభించారు ఉత్తరప్రదేశ్‌లో జరిగిన సంతోష్ ట్రాఫీ పోటీలో పాల్గొన్నారు ఈయన జట్టుకు మూడవ స్థానం లభించింది 1988లో జరుగనున్న ఒలింపిక్స్‌లో పాల్గొనడానికి మద్రాసు, కేరళ శిబిరాలలో శిక్షణ

భారత ఆహారసంస్థ రీజినల్ మేనేజరు శ్రీ ఎం హనుమంతరావుగారి కుమార్తె కుమారి జ్వాలశ్రీకళ, హైదరాబాద్‌లో ఇటీవల లాస్యప్రియ ఆధ్వర్యంలో నృత్య ప్రదర్శన చేస్తున్న దృశ్యం



పొందారు 22 ఏషియాడ్ యూత్ ఫుట్‌బాల్ ఛాంపియన్‌షిప్ పోటీలలో పాకిస్తాన్, సౌదీ అరేబియాలతో పర్యటించారు. ఏషియన్ గేమ్స్‌లోను, ఒలింపిక్ గేమ్స్‌లోను భారతదేశం పక్షాన పాల్గొనడం నా వాంఛ నేను నా కుటుంబానికి, శిక్షకులకు, రాష్ట్రానికి, మాతృదేశానికి కీర్తి తేగలననే విశ్వాసం నాకు సంపూర్ణంగా వుంది - అన్నారు ఫల్గున క్రమశిక్షణ, దృఢసంకల్పం ఉంటే ఎలాటిదయినా సాధించవచ్చునని ఆయన విశ్వాసం ఫల్గునకు మంచి అలవాట్లున్నాయి ఈత చాల ఇష్టం సినిమాలు, రాజకీయాలు ఇష్టంలేదు ఉదయం, సాయంత్రం రెండేసి గంటలు ఫుట్‌బాల్ ప్రాక్టీస్ చేస్తారు విదేశీ ఆటగాళ్ళు చాల దృఢంగా వుంటారని, క్రమశిక్షణను విశేషంగా పాటిస్తారని, నిరంతరం ప్రాక్టీస్ చేస్తారని ఆయన తెలిపారు ఫల్గున వయస్సు ఇంకా ఇరవై అయిదు దాటలేదు ఇంటర్ చదివారు ఎంతో భవిష్యత్తు వుంది ఇతరులపై ఆధారపడని ప్రభుత్వోద్యోగమూ వుంది ఆయన తన ఆశయాలు ఫలింపజేసుకొని దేశానికి కీర్తి తెస్తారనే నమ్మినాను

## చిన్ననాటి జ్ఞాపకాలు ఆవిష్కరణ :-

స్వాతంత్ర్య సమర యోధులు, ప్రముఖ గాంధీ అనుయాయులు, నిర్మాణ కార్యకర్తలు శ్రీ కోదాటి నారాయణరావు రచించిన చిన్ననాటి జ్ఞాపకాలు అనే ఆత్మ కథాత్మకమయిన గ్రంథం ఆవిష్కరణ జూన్ 13వ తేదీన శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో కేంద్ర మంత్రి శ్రీ జలగం వెంగళరావు ఆవిష్కరించారు ఈ ఆవిష్కరణోత్సవానికి అధ్యక్షత వహించిన ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు, భాషా నిలయం అధ్యక్షులు శ్రీ అవ్వా సత్యనారాయణరావు, డాక్టర్ దాశరథి కృష్ణమాచార్యులు, డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు, డాక్టర్ రావూరి భరద్వాజ శ్రీ కోదాటి నారాయణరావు బహుముఖ ప్రజ్ఞను, ప్రజా సేవను ప్రశంసించారు శ్రీ చివలూరి లక్ష్మీనారాయణా చార్యులు ప్రశంసా పద్యాలు చదివారు సన్మానపత్ర సమర్పణ, సన్మానం తర్వాత శ్రీ కోదాటి నారాయణ రావు కృతజ్ఞత తెలుపుతూ, ఈ గ్రంథంలో తమ 11వ సంవత్సరం వరకే జీవిత విశేషాలు, దేశ పరిస్థితి, పరిసర సంస్కృత్యాది వివరములు ఉన్నాయని, తర్వాతి జీవితం కొన్ని భాగాలుగా వ్రాయదలచానని అన్నారు ప్రారంభంలో భాషా నిలయం కార్యదర్శి శ్రీ ఎం ఎల్ నరసింహారావు స్వాగతం చెప్పగా, కన్వీనర్ శ్రీ అక్కిరాజు వెంకట జనార్దనరావు వందన ధన్యవాదాలు చెప్పారు

## ఉపశ్రుతి :-

ఏమండీ, మృగశిరకార్తె కూడా వెళ్ళిపోయింది, జంటనగరాలలో వర్షం పడలేదే? వాతావరణ శాస్త్రజ్ఞులు ఏవేవో భవిష్యత్తులు చెప్పారే? - అనడిగారు నన్నొకరు నారు పోసినవాడు నీరు పోయడా? - అన్నారు మా మాటలు వింటున్న ఒక తత్వజ్ఞుడు

- తిరుమల రామచంద్ర

# వింబుల్డన్ –'87



బిల్లీ జాన్‌కింగ్

ప్రపంచ టెన్నీసు 'మక్కా'గా ఖ్యాతినొందిన వింబుల్డన్ '87 జూన్ 20 నుండి లండన్‌లో ప్రారంభమౌతున్నది ఎప్పటివలె విశ్వ అగ్రగామి టెన్నీసు క్రీడాకారులు 'వింబుల్డన్ కిరీటం' కోసం పోటీ పడి...

...చి ఓపన్, యు ఎస్ ఓపన్, ఆస్ట్రేలియన్ ...డరేషన్ కప్, క్వీన్స్‌క్లబ్ పోటీల కంటే ...న్‌లో పాల్గొనుటకు ఎంతో ఆసక్తి ...కారు. ఒకసారి 'సెంటర్ కోర్టు'లో ఆడితే జన్మ ...నట్లు భావించే క్రీడాకారులు ఉన్నారు ...ు తిలకించే అవకాశము లభించితే చాలు అనే ...మానులు ఉన్నారు

## పూర్వాపరాలు

ఆధునిక టెన్నీసునకు రూపము కలిగించినది ఇంగ్లాండు విక్టోరియా మహారాణి కాలములో టెన్నీసు ఆటకు ప్రోత్సాహము లభించినది ఆనాడు ఆట స్థలమునకు కొలతలు, ఆటకు నిబంధనములు సరిగాలేవు మధ్యతరగతి ప్రజలు కాలక్షేపమునకు బంతి ఆట ఆడేవారు ఖాళీ పచ్చికబయళ్ళలో ఏదైనా అడ్డు పెట్టుకొని (యిప్పుడు 'నెట్') బంతిని బ్యాట్ లాంటి దాని సహాయముతో ఆడేవారు ఫ్రెంచి ఆట 'లాతాంగే పామీ' నేటి ఆధునిక టెన్నీసుకు ఆధారము. ఇంగ్లాండులో టెన్నీసు యందు కూడా ఎం. సి సి ఆసక్తి చూపి రూపము, నిబంధనములు రూపొందించినది ఆల్ ఇంగ్లాండు క్రికెట్ అండ్ లాన్ టెన్నీసు క్లబ్ ఏర్పరచి ఆట అభివృద్ధికి కృషి జరపబడినది. లండన్‌లో వింబుల్డన్ ప్రాంతములో గల 'వార్ పిల్ రోడ్ 'క్లబ్'లో టెన్నీసు ఆసక్తిగా ఆడేవారు 1922న క్లబ్ స్థలము అనువుగా లేక చర్చి రోడ్‌నకు మార్చబడినది అప్పటి నుండి వింబుల్డన్ పోటీలు యిక్కడే జరుగుచున్నవి 16 గ్రాస్ కోర్టులు, 10 క్లే కోర్టులు గలవు రెండు కోర్టులపై కప్పుకూడా కలదు సెంటర్ కోర్టులో 14,000 మంది, నెం ఒన్ కోర్టులో 7,500 మంది ఆట తిలకించు ఏర్పాట్లు గలవు. మొత్తం 30,000 మంది వింబుల్డన్ టెన్నీసు పోటీలు చూచుటకు అనువు గలదు

మొదటి సారిగా వింబుల్డన్ ఛాంపియన్ షిప్ 1877లో జరిగినది అప్పుడు క్లబ్ ఉపయోగార్థము నిధి ప్రోగు చేసి 'రోలర్' కొను నిమిత్తము పోటీ జరపబడినది అనాడు రోలర్ కొనలేని స్థితిలో ఉన్న క్లబ్ నేడు కోట్ల విలువ కలిగి ఉన్నది 1877 లో పురుషుల సింగిల్స్ పోటీ మాత్రము జరిగినది ఎ డబ్ల్యు గోర్ మొట్ట మొదటి వింబుల్డన్ ఛాంపియన్ షిప్ విజేత అప్పటి నుండి ప్రతి ఏట జరుగుతున్నది 1915– 18 వరకు మొదటి ప్రపంచ యుద్ధము 1940– 45 వరకు రెండవ ప్రపంచ యుద్ధము వలన జరగలేదు పురుషుల డబుల్స్ 1879 నుండి, మహిళల సింగిల్స్ 1884 నుండి, మహిళల డబుల్స్ 1913 నుండి, మిక్సిడ్ డబుల్స్ 1913 నుండి జరుగు చున్నది

వింబుల్డన్ పురుషుల సింగిల్స్‌లో ఎక్కువ సార్లు విజయం పొందిన వారు డబ్ల్యు రెన్‌షా (1881 నుండి 1886, 1889) ఆర్ దోహర్టి (1887 నుండి



బోరిస్ బెకర్

1900) హెచ్. దోహర్టి (1902 నుండి 1906) ఫ్రెడ్ పెర్రీ (1934, 35, 36) రాడ్ లావర్ (1961, 62, 68, 69) బోర్గ్ (1976, 77, 78, 79, 80,) మెకన్రో (1981, 82, 84) మహిళల సింగిల్స్‌లో ఎస్ లెంగన్ (1919 నుండి 1923), ఎల్ బ్రౌ (1948, 49, 50) కింగ్ (1966, 67, 68, 72,-73, 75) నవ్రతిలోవా (1978, 79, 1982, 83, 84, 85, 86)

చార్లట్ డాడ్ –1887 నుంచి 1893 వరకు అయిదు సార్లు విజేత



## ప్రపంచ టెన్నీసు రికార్డులు

**అత్యధిక సార్లు విజేత :** గ్రాండ్ స్లామ్ ఛాంపియన్ షిప్స్ అంటే ఆస్ట్రేలియన్, ఫ్రెంచ్, యు ఎస్ ఓపన్ వింబుల్డన్‌లలో మొత్తం 66 సార్లు గెల్చిన కీర్తి మార్గరెట్ కోర్టుకు దక్కింది

ఆమె 1969–75 మధ్య కాలములో 26 సింగిల్ టైటిల్స్, 21 డబుల్స్; 19 మిక్సిడ్ డబుల్స్ టైటిల్స్ యీ పోటీలలో విజయం పొందినది ఇన్ని సార్లు విజయం పొందిన స్త్రీ పురుషులు ఎవరూ లేరు .

**అత్యధిక సింగిల్స్ టైటిల్స్ :** క్రిస్ ఎవర్ట్ లాయిడ్ 132 సింగిల్ టైటిల్స్ అంతర్జాతీయ పోటీలలో గెల్చినది.

**అత్యధిక యు. ఎస్. ఛాంపియన్ షిప్స్ :** శాంత మోనికాకు చెందిన 66 ఏళ్ళ డోరోతీ భానీ 146 సార్లు (సింగిల్స్, డబుల్స్) గెల్చినది పురుషులలో గార్డనర్ ముల్లోయ్ 71 సార్లు గెల్చాడు

**అతిచిన్న వయసులో గెలుపు .–** బ్రిటన్‌కు చెందిన ఛార్లొటి (లోటియా) డాడ్ 15వ ఏట మొదటి సారిగా వింబుల్డన్ చిన్న వయసులో గెల్చినది.

## వింబుల్డన్ – '87

**అతర్వాత** 1888, 1891, 1892, 1893 లలో కూడా గెల్చినది.

**అతి పెద్ద వయసులో గెలుపు :** బ్రిటన్ వాసి అర్థర్ డబ్ల్యు గోరే 1909 లో మూడవ సారి (1877, 1908, 1909) వింబుల్డన్‌లో విజయం పొందినప్పుడు అతని వయసు 41 ఏళ్ళు.

**'సెట్' అతి తక్కువ కాలములో గెలుపు :** రేక్యాసే (యు. ఎస్.) పాటీ వెట్స్ (బ్రిటన్) పై 6–0 మొదటి సెట్ విజయం తొమ్మిది నిమిషములలో సాధించాడు. ఇది 1925 లో ఈస్ బేమ్ పోటీలో జరిగినది.

**అతి ఎక్కువ కాలము జరిగిన పోటీ :** 1984 సెప్టెంబరు 25 న ఎక్కి నెల్సన్, జీనహెప్‌నార్ మధ్య పోటీ 6 గంటల 31 నిమిషాలు జరిగినది.

**ఎక్కువ మంది తిలకించిన టెన్నీసు పోటీ :** 1970 సెప్టెంబరు 20న హూస్టన్ ఆస్ట్రోకోమ్‌లో బిల్లీ జాన్ కింగ్ బాబీ రిగ్స్‌ను ఓడించినప్పుడు 30,472 మంది ప్రేక్షకులు ఆట తిలకించారు. 50 మిలియన్ ప్రజలు ప్రపంచమంతటా టి. వి. లో చూచారు. 1954 డిసెంబరు 27న సిడ్నీలో వైట్‌సిటీ స్టేడియంలో జరిగిన యు. ఎస్., ఆస్ట్రేలియా డేవిస్ కప్ మ్యాచ్‌ను 25,578 మంది తిలకించారు.

1877 ప్రప్రథమ వింబుల్డన్ పోటీ తిలకించిన వారు 200 మంది కూడా లేరు. అప్పుడు టెన్నీసు కోర్టు కొలతలు 26 గజాలు పొడుగు, 9 గజాలు వెడల్పు. హీత్‌కోటీ, జోన్స్, మార్షల్ అనే ముగ్గురు యీ పోటీ నిర్వాహకులు. టెన్నీసు నెట్ ఎత్తు అయిదు అడుగులు పోస్టుల వద్ద, 3 అడుగుల 3 అంగుళాలు మధ్య గలదు. 25 గిన్నీసు విలువ గల కప్పును స్థానిక పత్రిక 'ది ఫీల్డ్' బహూకరించినది. 22 మంది ప్రారంభ పోటీలో పాల్గొన్నారు. ఫైనల్సులో స్పెన్సర్ గోర్, డబ్ల్యు. సి. మార్షల్‌ను ఓడించాడు.

1985 వింబుల్డన్ ఛాంపియన్ షిప్ గెల్చిన పశ్చిమ జర్మనీకి చెందిన బోరీస్ బెకర్ వయస్సు 17 ఏళ్ళ 7 నెలలు.

**ముకరమ్**

## ఉత్తరాలు

( 4 వ పేజీ తరువాయి)

### కథలు

'పితృదేవో భవ' కథ పితరుల పట్ల దయాహీనంగా ప్రవర్తించే కొడుకులకు కనువిప్పు కల్గిస్తుంది. కొడుకు చేత ఇంట్లోంచి వెళ్ళగొట్టబడి రామస్వామి పొందిన ఆవేదన కంట తడిపెట్టించింది. శ్మశానాన్ని వర్ణిస్తూ రాసిన మాటలు మచ్చుతునకలు.

-గుబ్బల సత్యనారాయణమూర్తి, పెదపాడు

★ ★ ★

వీరపల్లె వీణావాణిగారి కథ "పితృదేవో భవ" హృదయాన్ని కదిలించి వేసింది. తండ్రీకొడుకుల పవిత్రబంధం కూడా వ్యాపారంలా మారి రామస్వామిలాంటి తండ్రులు అనుభవిస్తున్న మానసిక వేదన కళ్ళకు కట్టినట్లు వివరించారు. 'చేరువ' కథ కూడా బాగున్నది.

-జె. సుబ్రహ్మణ్య శాస్త్రి, జక్కరసకుప్పం

★ ★ ★

"అభినేత్రి" కథ చదువుతున్నంతసేపూ "మహానటి సావిత్రి"గారే కళ్ళముందు వున్నట్లుంది. కథ చాలా జాలిగొల్పినట్లున్నది. రచయిత్రి గార్కి నా అభినందనలు.

-పర్వతనేని వరలక్ష్మి, నూజెళ్ల

★ ★ ★

ఆంధ్ర సచిత్ర వారపత్రికను గత 8 సంవత్సరములుగా చదువుతున్నాను. మంచి కథలు, సీరియల్స్, శీర్షికలు వేస్తున్న మీకు అభినందనలు. 19-25, జూన్ '87 వారపత్రికలో మీరు ప్రచురించిన "అభినేత్రి" కథ మా కుటుంబ సభ్యులనెంతో ఆకట్టుకున్నది. చదువుతున్నంత సేపు మహానటి సావిత్రి గారి జీవిత గాథ జ్ఞాపకానికొస్తుంది. ఇదేగాక "పితృదేవో భవ", 'చేరువ' కథలు కూడ బావున్నాయి.

-కె. పురుషోత్తం, పలమనేరు

★ ★ ★

కె. వి. ఎస్. వర్మగారి 'చేరువ' మంచి కథ. పెరుగుతున్న పారిశ్రామిక నాగరికత, దాని ప్రభావాన్ని అన్ని రంగాల్లోనూ చూపుతుంది. పిల్లల పెంపకం పట్ల ప్రేమ ఉన్నా మరో చోట ఉంచాల్సి వచ్చిన పరిస్థితి కథలో ముఖ్యమైన విషయం కాదు. వృద్ధతరం తమ జీవితాన్ని ఎలా వెళ్ళమార్చుకోవాలో, అందుకు ఏం చెయ్యాలో నిర్ణయించుకోవాల్సిన సమస్య ఇందులో ఉంది. ఇది చాలా క్లిష్టమయిన సమస్య. ఈ సమస్యను చాలా సున్నితంగా, కొన్నాళ్ళు గుర్తు ఉండేలా రచించారు రచయిత. రచయితకు అభివందనలు.

-వాసిరెడ్డి వేణుగోపాల్, జగ్గయ్యపేట □

**అవీ ఇవీ అన్నీ**

## సరస్వతీ పుత్ర అవార్డు

మిత్ర సాహితీ సమితి కడప "సరస్వతీ పు అవార్డు" 1987 నుండి ఏర్పాటు చేసింది. అవార్డు క్రింద ప్రశంసా పత్రంతో వెయ్యిన్నినూటపదహారు రూపాయలు ? పద్మశ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు మాత్రా చందస్సు కావ్యాలపై రామాయణం, మేఘ దూతము, శివతాండ పరిశోధవాత్మక వ్యాసాలు రాసిన ఉత్తమమైన వ్యాసానికి ఈ అవార్డు లభి

అవార్డు 1988 జనవరిలో కడపలో ఏ సత్కార సభలో – పద్మశ్రీ పుట్టపర్తి చేత ఇస్తారు.

వ్యాసకర్తలు తమ రచనలను అక్టోబరు లోగా కార్యదర్శి, మిత్ర సాహితీ సమితి, బళ్లారి కడప 516001 చిరునామాకు పంపాలి. □







Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667